# చతుర

330వ సంచిక
జూలై 2005
రూ.7/-




డాక్టర్ కె.ఎన్.మల్లీశ్వరి నవల

## అట్టడుగు స్వరం

సచిత్ర విచిత్రం

# తేనెటీగలే కవచం



**జం**తువులు, పక్షుల పట్ల ప్రేమతో, వాటిని ఎంతో ఆదరంతో పెంచుతారు కొందరు. వింత కలిగించేలా పాములు, ఉడుములను కొన్ని క్రూరజంతువులను ప్రేమతో సాకుతారు మరికొందరు. ఈ చిత్రంలోని ఆసామికి తేనెటీగలంటే మహా ప్రేమ! అసంఖ్యాకమైన ఆ ఈగలను ఆప్యాయతతో పెంచుతాడు. ప్రతిఫలంగా ఆ జీవులు అతనికి తేనె సమకూరుస్తాయి. అవి గుంపులుగా అతని శరీరంపై ఓ కవచంలా అల్లుకొంటాయి! అతనొక తేనెటీగల వ్యవసాయదారుడు. పేరు మాంగోచు ఆన్ క్వీన్. చైనాలోని గుంజిక్స్‌లో అతని నివాసం.

వైవిధ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 28 సంచిక : 6

జూలై : 2005 330వ సంచిక

## లోపలి పేజీలలో...



బొమ్మలు: కె.శివాజీ

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: మధు మోడల్: అక్షయ

# ఎర్రబస్సుకి దారేది? వ్యంగ్య రచన

'మా'నూ మాకును కాను...రాయి రప్పను కానే కాను.. మామూలు బస్సును నేను..' పాట విచిత్రంగా వినిపించింది.

చుట్టూ ఆశ్చర్యంగా చూశాను.. ఎవరూ లేరు.

సగం కాలిపోయి అంధవికారంగా ఉన్న ఎర్ర బస్సు మాత్రం కనిపించింది..

'రాయినైనా కాకపోతిని..మనిషి పాదం తాకగా...' మళ్లీ మరోపాట అదే భావుకతతో వినిపించింది..

ఆర్టీసీ డిపోలో మెకానిక్‌గా చేసే నాకు.. ఈఅనుభవం కొత్తగా ఉంది. రాత్రి డ్యూటీ అయిపోయాక వస్తుంటే ఈపాట వినిపించడంతో మళ్లీ వెనక్కితిరిగాను..అక్కడన్నీ ఇటీవల గొడవల్లో తుక్కుతుక్కయి పోయిన బస్సులు తప్ప ఏమీ లేవు..

'ఆశ్చర్యపోకు మిత్రమా!నేనే'

ఒక బస్సువైపు ఆందోళనగా చూశాను

'కంగారుపడకు నేస్తం! ఎర్రబస్సునే మాట్లాడుతున్నాను.. నాలో ఉన్న ఆవేదన నీతోనైనా చెప్పుకుంటే..కొంత భారం తగ్గుతుందనిపించింది. వింటావా! నేస్తం..'అనగానే బుర్ర అటూ, ఇటూ ఊపాను.

'ఎంతో ఘనకీర్తి సాధించి చరిత్రలో మిగిలిపోయిన రాజుల కళా వైభవంలా మారింది నాపరిస్థితి.. నిన్నటి దాకా.. పక్క ఊరికి ఎంతో ఠీవిగా వెళ్లి వచ్చిన నేను ముష్కరుల దాడిలో ఎలా ముక్కముక్కలుగా కకావికళమై మారిపోయానో చూశావా!

ఎంత వెటకారమైపోయింది మిత్రమా! నాబతుకు.. ఎవరికి కోపం వచ్చినా, ఆవేశం వచ్చినా నన్నే చావచితక్కొట్టేస్తున్నారు..నేనంటే అంత లోకువైపోయానా!

ఆఖరికి అన్నలు కూడా ఆర్టీసీ బస్సుల కిందే అన్నీ పెడతారు..

స్టూడెంట్లకు కోపం వస్తే..ముందు మమ్మల్నే ఆపేస్తారు..

అల్లరిమూకలకు ఆగ్రహమొస్తే..మా అంతం చూస్తారు..

రోడ్డుమీద ఇలాంటి పరిస్థితుల్లో కనిపిస్తే చాలు.. సింహం ముందు చిక్కుకున్న జింక పిల్లల్లా మారుతోంది మా పరిస్థితి

నోరులేనిదాన్ని చేసి..ఆటాడిస్తున్నారు కదా!..

నన్ను కొడితే.. తర్వాత ఆ నష్టం ఎవరు భరిస్తారు? అటొచ్చి, ఇటొచ్చి, ఎటొచ్చినా మీకే కదా! టెండరు..అది ఆలోచించరేం..

చివరికి మీ జేబుకి చిల్లు.. నోటుకి నీళ్లు! కాదంటావా!

ఒక్క క్షణం ఆలోచించండి..

రాష్ట్రం మొత్తం మీద సుమారు 800 బస్సులు ధ్వంసమైపోయాయి..ఎన్ని కోట్లరూపాయల నష్టం? ఇదంతా ప్రజాధనమే కదా! అసలే ఆర్టీసీ నష్టాల బాటలో నడుస్తోందని పొద్దున్న లేచింది మొదలు.. రాత్రి పడుకునే వరకూ చెవిలో జోరీగలా ఝూంమని గోల పెడుతుంటే, ఈ దెబ్బకు గూబ మరింత గుయ్ మనదా!

'ప్రభుత్వం ఇస్తుంది కదా!' ప్రశ్నించాను.

"అక్కడ ఏముంది? కాసింత 'ఉచిత విద్యుత్తు'కే.. తలకిందులుగా తపస్సు చేస్తున్నారు"

'ఏదో ఒకటి చేస్తుందిలే..' అన్నాను

ఏమీ చేయదు.. మళ్లీ ప్రజల దగ్గరకే వచ్చి పెంచిన రేట్లతో టిక్కెట్, టిక్కెట్

4 జూలై 2005 (signature)

అంటారు.. లేదంటే కుడిజేబులోంచి తీసి ఎడమజేబులో పెడతారు..

అర్థం కాలేదన్నట్లు చూశాను..

అంటే బస్సు టిక్కెట్లు పెంచకపోయినా.. పరోక్షంగా మిగతా పన్నులు పెంచి.. ప్రజల దగ్గర నుంచి వసూలు చేసి.. వాటిని తీసుకుని మళ్లీ ఆర్టీసీ చేతిలో పెడతారన్నమాట

ఎటుచూసినా ప్రజలకే.. అంటే మీకే ఢంకా ప'లాసు'.. ఆ చివర పదాలు ఒత్తి పలికింది.

ఒక్క బస్సు ఖరీదు.. సుమారు రూ.10లక్షల నుంచి 30లక్షల వరకూ ఉంటుంది తెలుసా.. మళ్లీ అంది..

'మరి ఏమిటి కింకర్తవ్యం' డౌటు అడిగా..

ఊర్లోకి వస్తే ఆటోరిక్షాల తాకిడి, ఊరు దాటితే ప్రైవేటు బస్సుల తాకిడి.. వీటి మధ్య సతమతమవుతూ.. ఇప్పటికే కక్కలేక, మింగలేక గుట్టుగా బండిని లాక్కువెళుతున్న మా అధికారులు.. ఈ వంకతో ఇక నిర్భయంగా, ధైర్యంగా చేతులెత్తేస్తారు.. అంతేకాదు ఈమధ్యనే మర్యాద రామన్న ఉత్సవాలు చేశాం.. అందుకే మాబాగా చేశారు మర్యాద అంటూ ఆనందిస్తారు కూడా! ఆళ్లకి మేం చేశాం, మాకు వారు చేశారు.. ఇచ్చిపుచ్చుకోవడమంటే ఇదే కాబోలనుకుంటారు'

చివరగా చెప్పేదేమిటంటే... డబ్బులున్న వారికి కార్లు ఉంటాయి, కాని మధ్యతరగతివారికి.. సామాన్యులకు ఆప్తుడిని, ఆత్మబంధువైన నేను వారి దైనందిన జీవితంలో భాగస్వామినైపోయాను..

నేనేం నేరం చేశానో చెప్పండి...సామాన్య ప్రజలని వారి గమ్యస్థానాలకు సురక్షితంగా చేర్చుతున్నానే..పగలనకా, రేయనకా, వర్షమనకా, ఎండనకా, అతుకుల, గతుకుల రోడ్డులో అష్టకష్టాలు పడుతూ, పడుతూ లేస్తూ, నాకు ఆరోగ్యం సరిగా లేకపోయినా, పార్టులన్నీ అరిగిపోయినా, టైర్లు పాతవైపోయినా, తక్కువ ధరలకు ప్రయాణికులను ఎంతో జాగ్రత్తగా తీసుకువెళ్లే నన్ను ఇలా బాధపెట్టడం మీకు భావ్యమా! చెప్పు..

ఆరోజుల్లో గాంధీగారు, నెహ్రూగారు మహానుభావులెందరో నన్ను ఉపయోగించుకున్నారు..మరి నేడు ఒక ప్రభుత్వం ఉన్నప్పుడు.. జన్మభూమి అన్నారు.. ఈ ప్రభుత్వం వచ్చాక..పల్లెబాట, నగరబాట పేర్లు పెట్టి ఉపయోగించుకుంటున్నారు..అసలు ఉన్న ప్రభుత్వం అధికారంలోకి వచ్చిందంటే ఆనాటి పాదయాత్రలు, బస్సుయాత్రలే కారణమంటాను కాదంటావా!

మీ అందరికీ తలలో నాలుకలా ఉన్న నన్ను..విలువలేనిదిగా అందరూ చేస్తుంటే.. చూస్తూ ఊరుకుంటున్నారే!

అవసరమైనప్పుడు ఉపయోగించుకుని..అవసరం తీరాక నా తల పగలగొడతారా? ఇది న్యాయమా!

ఎంతమంది ప్రజలు అవస్థలు పడ్డారు.. ఆసుపత్రులకి వెళ్లే రోగులు, చంటిపిల్లల తల్లులు, మహిళలు, వృద్ధులు, నడవలేని వారు, మాట్లాడలేనివారు, పాఠశాలకు వెళ్లిన పిల్లలు..వీరంతా ఎంత నరకయాతన అనుభవించారు..ఒక్కసారి మమ్మల్ని ఇలా ఆపేస్తే వారంతా ఎలా గమ్యస్థానాలకు చేరి ఉంటారు... ఎవరో చేసిన దానికి.. మేము, ప్రయాణికులు అవస్థలు పడాలా! ఏమిటీ దారుణం..ఏమిటీ అన్యాయం, ఒక్కసారి ఆలోచించండి..అంటూ ఆర్ధోక్తిగా ఆగిపోయింది

నేనేమీ మాట్లాడలేకపోయాను.. ఎర్రబస్సు ఆవేదన మనసులో గింగిరులై తిరుగుతుంటే మౌనంగా ఆలోచిస్తూ ఇంటిదారి పట్టాను..

– శ్రీనివాస్ మిర్తిపాటి

★



జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్‌గారి సందేశం

కీర్తి

# కీర్తి-ప్రశంస

ధనం పోతే తిరిగి సంపాదించుకోవచ్చు. ఆరోగ్యం చెడితే బాగు చేయించుకోవచ్చు. కానీ మనిషి పవిత్రతను కోల్పోయి ప్రవర్తనపై మచ్చ పడితే ఎన్ని ఉన్నా లేనట్లే. జీవన పర్యంతం ఆ మచ్చ మాసిపోదు. దానిని తొలగించడం అతి కష్టం.

నీతిగా మంచిపేరును, కీర్తిని సంపాదించుకోవాలి కాని అనుచిత రీతిలో కాదు. అన్యాయపు పనులు చేసి సంపాదించిన యశస్సు దుఃఖకారణమవుతుంది. అన్యాయంగా లభించిన కీర్తి నాలుగు రోజుల వైభోగమే!

మనిషి దానాలు, పుణ్యకార్యాలు, నిజాయితీతో, చిత్త శుద్ధితో చేయాలి. చిత్తశుద్ధితో ధర్మ మార్గాన్ని ఆచరించాలి. అందరితోనూ ప్రేమ భావనని పంచుకోవాలి.

ఏ పని చేసినా దానిని నిష్కామకర్మగానే చేయాలి తప్ప స్వార్థం పనికి రాదు. నిష్కామకర్మ నాచరించిన వ్యక్తికి లభించిన కీర్తే అతనికి భూషణమవుతుంది.



మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్

ఒక మౌలవీ అంటాడు, "నీకు మంచి ఆదర సత్కారాలు లభించాలంటే పొరుగూరికి వెళ్ళినపుడు దగ్గర్లో ఉన్న మసీదులో ఐదు సార్లు క్రమం తప్పక నమాజ్ చేయాలి. అది చూసి నీవు భక్తుడవనీ, ధార్మికుడవనీ నమ్మి చుట్టుపక్కల వారు నిన్ను ఆదరించి తీరుతారు" అని. చూడండి! ఇందులో ఎంత స్వార్థం, మోసం ఉన్నాయో! భగవంతుని స్మరణ సత్యమైన అంతఃకరణతో చేయాలి గాని ఇలా చూపరులను మోసగించేటందుకు కాదు.

ఇతరులు మెచ్చుకోవాలనే స్వార్థంతో, యశః కాంక్షతో దాన ధర్మాలు, పరోపకారాలు, భగవత్ స్మరణలు చేసే వాళ్లంతా భ్రమలో మునిగారని చెప్పవచ్చు. ఇలాంటి మనిషి తనకు తాను శత్రువేగాక చూపరుల దృష్టిలో నీచుడవుతాడు. ఎపుడో ఒకసారి

ఆ కీర్తికి ఎదురుదెబ్బ తగిలినపుడు పశ్చాత్తాప పడక తప్పదు.

కీర్తి కోసం నువ్వు ప్రయత్నించ నక్కర లేదు. మంచి పనులు చేస్తే అది దానంతటదే వస్తుంది. కీర్తి దూర తీరాలకు వ్యాపించాలనే దురాశ పెంచుకోక సత్యవర్తనతో మెలగటం నీ స్వభావంగా మారాలి. సాధారణంగా అందరినీ ప్రసన్నంగా ఉంచేందుకు ప్రయత్నించాలి. అప్పుడు కీర్తి తనకు తానుగా నీకు లభిస్తుంది.

## ప్రశంస

ఇపుడిపుడే నీకెవరైనా పరిచయమై నీ గుణాలను ప్రశంసిస్తుంటే వారి మాటల్ని విశ్వసించకు. నీ గొప్పలు నీవు చెప్పుకోకు.

మంచి పనులన్నీ ధర్మ భావనతోనే చెయ్యబడవని గుర్తుంచుకో. అలాగే అన్ని తీపి మాటలూ మనస్ఫూర్తిగా చెప్పబడవు.

ఇతరుల ప్రశంస నిన్ను భ్రమలో, మోసంలో పడేస్తుంది. దీనివల్ల నీలో అహంకారం పెరగవచ్చు.

పొరపాటున కూడా నిన్ను నీవు పొగడుకోకు. మంచి పనుల్లో నిమగ్నమై సమయాన్ని సద్వినియోగపరచు. మంచి పనుల్లో నీ మనస్సు లీనమవడం ఎంతో గొప్ప విషయం.

ఇతరులు తనను ప్రశంసిస్తుంటే వినడానికి కుతూహలపడేవారి మనసు సంకుచితమైనది. పొగడకపోతే ఇలాంటి వారు బాధపడుతుంటారు.

ఎవరైనా మనస్ఫూర్తిగా నీ అర్హతకు తగినట్టు ప్రశంసిస్తే వారికి కృతజ్ఞతలు చెప్పుకో. లేకుంటే నీవు కృతఘ్నుడవు అనిపించుకుంటావు. సభ్యత తెలియని వాడివని ఎదుటి వాళ్ళు నీ గురించి అనుకునే ప్రమాదముంది.

ప్రశంసను విని పొంగిపోకు. అలా పొంగితే తరువాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది.

నిన్ను ప్రశంసించాడు కదాని అర్హతున్నా లేకపోయినా అవతలి వ్యక్తిని ప్రశంసించకు. నీవు ముఖ ప్రీతి కోసం చెబుతున్న మాటల్లోని నిజానిజాలు అతనికి తెలుసు గనుక నిన్ను చులకన చేసే అవకాశం ఉన్నది.

నీ మాటలే నీ వ్యక్తిత్వాన్ని నిలబెడతాయి.

ఒక వ్యక్తిని పదుగురు ప్రశంసిస్తుంటే నీవు నిందించకు. వాళ్లంతా ఎదురు తిరిగి నీకు శత్రువులు కావచ్చు.

స్త్రీలు పురుషుల్ని అతిగా ఎప్పుడూ పొగడరు. చాలా తక్కువగా ప్రశంసించటం చూస్తుంటాం. పదేపదే పొగడటానికి వారికేం అవసరం?

ప్రతి స్త్రీలోనూ, ప్రతి పురుషునిలోనూ దోషాలూ, సుగుణాలూ రెండూ ఉంటాయి. ఈ రెంటికీ అతీతులుగా ఎవరూ ఉండరు.

నీ మిత్రులెవరినీ అధికంగా ప్రశంసించకు. ఎందుకంటే అతనికి తన సంగతి నీకంటే ఎక్కువగానే తెలుసు. పొగిడితే నిన్ను వాచాలుడనుకుంటాడు. మనసు కల్మషమైతే స్నేహం కూడా చెడవచ్చు.

అబద్ధపు ప్రశంస విషంతో, నిప్పుతో సమానం. దానివల్ల నెరవేరిన పనులు కూడా చెడిపోతాయి.

ప్రశంస చేయాలనుకుంటే కేవలం గురు ప్రశంస, ఈశ్వర ప్రశంస చెయ్యి. దీనివల్ల నిన్ను చెడ్డవాడని ఎవ్వరూ అనరు. ఎంత ఎక్కువగా సాధ్యపడితే అంత ఎక్కువగా వీరిని స్తుతించు. వందనాలర్పించు. గుణగానం చెయ్యి. ఇందులోనే నీకు అసలైన ఉపయోగం, మేలు ఉంది.

సేకరణ, అనువాదం: జ్యోతిరాణి

★

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (8)

*చెహోవ్ లేఖలు ( అలెగ్జాండర్‌కు రాసిన మరోలేఖ 1888)*

కొంత మంది తటస్థంగా రాయలేరు. బహుశా ఇది స్వభావరీత్యా నీకు వీలుపడదు. నేర్చుకొన్న విషయాలను విస్మరించటమూ అంతే సులభం. 'నిజాయితీ'లో తటస్థత ఉంది. ఒక పాత్రను సృష్టించి, ఆపాత్రలో తనను తాను చూసుకోవడం కొందరికి ఇష్టం. (నా దృష్టిలో ఇది నేరం. మన అభిప్రాయాలు, విలువలు, కోరికలకూ ఆ కల్పిత పాత్రకూ ఏ సంబంధమూ ఉండ కూడదు.) సెంటిమెంట్ కథలు రాయటం నీకిష్టం. అందువల్ల నీపాత్రలు సడెన్‌గా ప్రేమించుకొంటారు. అంతలోనే విడిపోతారు. కడవల కొద్దీ కన్నీళ్లు కారుస్తారు. ఇలాంటి 'గోల' నీకిష్టం. ప్రేమించుకున్నారుసరే. వాళ్లెవరు? వాళ్ల ఆర్థిక స్థితి ఏమిటి? జీవితంలోని మిగతా సమస్యల మాటేమిటి? ఇంత గందరగోళం మధ్య ప్రేమించుకొంటే పాత్రలు మరింత రక్తి గడతాయి. జీవితం రంగుల కలకాదు. ఎంత విసుగు, బోర్ అనుభవించారు వాళ్లు! హీరో ఎప్పుడూ చలాకీ గానే ఉంటాడా? చాలా సార్లు అందరం డల్‌గా వుండమూ! ఏమీచెయ్యకుండా కాలాన్ని ఎంత వృధా చేస్తామో నీకు తెలియదా? అందరికీ, పాత్రలతో సహా- సంతోషంగా ఉండాలనే ఉంటుంది. రోజూ జల్సాలు కావాలి. కాని సాధ్యమా? "తేనే-పాలు లాంటి జీవితం" తియ్యగా ఉంటుందేమోగాని అందులో పసవుండదు. అవి అబద్ధం, ఊహ అని తెలిసిపోతూనే ఉంటుంది. నీకు అనుభవం ఉన్నది. లోకం చూశావు. తెలుసుకున్నావు. కాని"పాఠకుల కోసం" అంటూ సెంటిమెంటల్‌గా రాస్తున్నావు. ఇంత అనుభవ జ్ఞానమూ వృధాచేసుకొంటున్నావు. అయినా ఇవన్నీ ఎందుకులే. నీ కథల్నీ ఇష్టపడే వాళ్లుండకపోరు..."

*ఎం.వి.కి సెలెవ్‌కు రాసిన లేఖ–1887*

"... ప్రశంస చదివిన తర్వాత కూడా నాకు కోపం తగ్గలేదు. ఘాటుగానే రాస్తున్నాను. (ముందే జాగ్రత్త పడమని హెచ్చరిక). విమర్శకు ప్రతిస్పందించక పోవడం ఉత్తముల లక్షణం. అది సాహితీ మర్యాద కూడా. కాని మీరు రాసింది విమర్శ కాదు... "ఇద్దరం సాయంత్రం షికారుకెళ్ళి కబుర్లు చెప్పుకున్నట్లు" అన్నాడు. అందువల్ల సాహిత్యం గురించి గాక, కొన్ని మౌలిక విషయాల గురించి కబుర్లు చెప్పటం మిత్రుడిగా నా బాధ్యత అనుకుని రాస్తున్నాను.

మీరు నిరసించే 'చవకబారు' సాహిత్యమంటే నాకూ ఇష్టం లేదు. కాని అలాంటిది ఉండాలా వద్దా అంటే ఈ లోకంలో అన్ని రకాల మనుషులూ ఉన్నట్టే దానికీ ఉండే హక్కుంది. మీకూ నాకూ, ప్రపంచంలోని విమర్శకులకూ సాహితీ నిర్ణేతలకూ మనకు నచ్చని సాహిత్యాన్ని నిషేధించే హక్కు లేదు. ఇన్ని శతాబ్దాల సాహిత్యంలో ఎవరిది సరైన పంథా అంటే ఏం చెప్పగలం? హోమర్, షేక్స్పియర్, లోప్ డివెగా... వీళ్ళెవరూ పేడ కుప్పల్ని అసహ్యించుకోలేదు. అయినా వాళ్ల నైతికతను మనం ప్రశ్నించలేం. ఇంక ఆధునిక రచయితల సంగతి. మంచీ చెడూ అంటూ గిరి గీసుకుని రాసేటప్పుడు 'మంచి' గురించి మాత్రమే రాస్తారు. కాని ఆత్మ లోకంలో దివాలా, జీవితం పట్ల అపనమ్మకం వీళ్ళ ప్రత్యేకత. ఎవరి అభిరుచి మంచిదో, చెడ్డదో ఎలా నిర్ణయించటం? గ్రీకులకు ఈ ప్రశ్న

8 జూలై 2005

తిలో 'నిషిద్ధ' వస్తువంటూ లేదు. అన్నింటి గురించీ బాహాటంగా గానం చేశారు. నాటకాలు రాశారు. ప్రదర్శించారు. ప్రేక్షకులు ఆనందించారు. (ఇప్పటికీ ఆనందిస్తున్నారు) ఇప్పటివాళ్ళు మాత్రం మడి కట్టుకుని "మంచిని పెంచే నీతి కథలు మాత్రమే రాయవలెను" అంటున్నారు. కొన్ని విషయాల గురించి మనం చర్చించి వదిలెయ్యాలి. తులనాత్మక నిర్ణయాలు తీసుకోవటం అభిలషణీయం కాదు. ఇవి నిరంతరం జరిగే చర్చలు. వాదోపవాదాలు. ప్రతి తరం తనకేం కావాలో అదే నిర్ణయించుకుంటుంది. తుర్గెనీవ్, టాల్‌స్టాయ్ ఇలాంటి "పేడకుప్పల" గురించి రాయలేదంటారా! వాళ్ళు రాయకపోతే ఏమిటి? వాళ్ళ రచనలు దేనికి ప్రమాణం? నిరుపేదలు 'కథా వస్తువులు' కాదన్న రచయితలు వాళ్లకు ముందు కూడా ఉన్నారు.

"రైతు కూలీల గురించీ, చిల్లర కొట్ల చిట్టెమ్మల గురించీ రాయటమంటే సాహిత్య విలువల్ని దిగజార్చటమే" అన్నారు. ఒకరు చేసిన పని మంచిగానీ, చెడు గానీ అందరికీ కొలబద్ధ గాదు. దిగజారిన సాహిత్యం ఉందని అంగీకరించినా (ఆర్గ్యుమెంట్ కోసం) అవి లేనంత మాత్రాన సాహిత్య విలువలు పెరుగుతాయని ఎవరైనా హామీ ఇవ్వగలరా? ఈ లోకంలో అన్నీ సాపేక్షికమే. దేన్నీ "ఇదంతే" అని తూకం వేసి చెప్పలేం. "సుమారు ఇలా ఉండొచ్చు" అని అంచనా మాత్రం వెయ్యగలం. బాల సాహిత్యంలో కూడా అశ్లీలతను చూడగలిగిన మహానుభావులు లేరా? అలా అన్నవాళ్లు అది చదివి నరాల ఉద్రేకానికి కూడా గురవుతారు. నీలి కథల్లో బూతు చూడగలం మనం. మరి కొందరు చీకటి కోణాల్ని పరిశోధించి, అర్థం చేసుకొని, వెలుగు వైపు పయనిస్తారు. కళ్లలో కళ్లు పెట్టి చెడును చూడగలిగితే తప్ప మంచిని ప్రస్ఫుటంగా దర్శించలేం. వ్యక్తుల బలహీనతలు తెలుసుకున్న లాయర్లు, శరీర రుగ్మతల్ని నయం చేసే డాక్టర్లు పాపాలనీ, నీచాలనూ తెలుసుకున్నంత మాత్రాన అవినీతి పరులవుతారా? వాటిని తొలగించాలన్నా, సంస్కరించాలన్నా వాటి గురించి తెలుసుకోవలసిన అవసరం ఉంది. సాహిత్యంలో ఏం రాసినా, జీవిత వాస్తవికత ముందు అది దిగదుడుపే. పీపా ఖాళీ చేసే వాడికి, గ్లాసుడు మద్యం తాగితే నిషా వస్తుందా?

2. "ఈ లోకం నిండా లుకలుకమంటున్న ఆడ మగ పేడ పురుగులు" అన్నావు. నూటికి నూరు పాళ్ళు నిజం. మనుషులు "పరిపూర్ణ" జీవులు కారు. అందువల్ల కేవలం సజ్జనులు, సన్మార్గులు ఉత్తములు మాత్రమే ఉండాలనుకోవటం వాస్తవ దూరం. 'మంచి' గురించి, 'ఆదర్శ పురుషుల' గురించి రాయటం మాత్రమే సాహిత్య లక్ష్యమా? ఆ పరిమితులతో చేసే రచన మరేమైనా కావచ్చు గాని సాహిత్యం మాత్రం కాదు. వాస్తవాన్ని చూపించటం సాహిత్య కర్తవ్యం.

ఉన్నత, ఉత్తమ విలువ గురించి మాత్రమే రాయాలనుకోవట మంటే చెట్టుకున్న పళ్ళు మాత్రమే చిత్రించి, పండుటాకుల్నీ, పట్టిన చీమలను కాండాన్నీ వదిలేసినట్టు. ఉత్తమ విలువలు మంచివే గాని రచయిత మిఠాయి వాలా కాడు. సెంట్లు, సౌందర్య సాధనాలమ్మే వ్యాపారీ, విదూషకుడూ కాడు.

వాస్తవికతను చూపించటం అతడి బాధ్యత. నాగలి పట్టదలచినవాడు "చేతుల్లో బలం లేదు." అనగూడదు. బాధ్యతల్ని అంగీకరించటమంటే బలహీనతల్ని అధిగమించటమే. జీవితంలోని దుమ్ము, ధూళి, మురికి అతడి ఊహలకు కూడా అంటుకుంటుంది. ఈ విషయంలో (వార్తాపత్రిక) విలేఖరికీ, అతడికీ సామీప్యం ఉంది.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు)

★

# అంతర్వేదన.. ఆధ్యాత్మిక తపనల సంగమం 'జయం'

కథ వెనుక కథ

ఆయనపేరు చెబితే చాలు.. ఆంధ్ర పాఠక జనావళి హృదయంలో ఓరకమైన గిలిగింత కలుగుతుంది.. ఆయన శైలి అలాంటిది మరి. పాఠకుడిని అక్షరాల వెంట పరుగు తీయించేలా రాయడంలో ఆయన బహునేర్పరి. ఆయన కలంనుంచి జాలువారిన 'రెండురెళ్లు ఆరు', 'చంట బ్బాయ్', 'తేనెటీగ' తదితర నవలలు ఆంధ్రుల ఆహ్లాద రచయితగా ఆయనకు కిరీటం పెట్టాయి. మీకు ఇప్పటికే అర్థమై ఉండాలి.. అవును.. **మల్లాది వెంకటకృష్ణ మూర్తి** గారే. అలాంటి మల్లాది తనబా ణీకి భిన్నంగా రాసిన నవల 'జయం'. సరదా.. ఆహ్లాదమేకాదు.. జీవితానికి ఓ



లక్ష్యం ఉండాలి.. ఐహికంగా కాక అది ఆముష్మిక పరంగా ఉండాలన్న తపనతో దీన్నిరాశానని ఆయన చెబుతున్నారు. 'జయం' నవల కథవెనుక కథ ఏమిటో ఆయన మాటల్లోనే చూడండి..

నా మొదటి నవల ఆంధ్రప్రభ వారపత్రికలో 1972లో అయిదు వారాల సీరియల్‌గా వచ్చింది. దానిపేరు 'అద్దెకిచ్చిన హృదయాలు'. ఆ తర్వాత వివిధ దిన, వార, మాసపత్రికల్లో వందకి పైగా నేను రాసిన ధారావాహిక నవలలు ప్రచురితమయ్యాయి. వాటిల్లో కొన్ని పాఠకుల విశేషాదరణ పొందాయి. 'మిస్టర్ వి', 'చంటబ్బాయ్', 'వినాయకరావు పెళ్లి', 'ఎయిర్ హోస్టెస్', 'నివాళి', 'స్రవంతి', 'అందమైన జీవితం' మొదలైనవి అలాంటివాటిలో కొన్ని.

నా నవలలను స్థూలంగా అయిదు కేటగిరీలుగా విభజించవచ్చు. అవి సామాజికం(మిసెస్ పరాంకుశం), హాస్యం(వినాయకరావు పెళ్లి), క్రైం (తొమ్మిది గంటలు), రొమాంటిక్(సావిరహే), ఫాంటసీ(చతురలో వచ్చిన 'కొత్త శత్రువు'). పత్రికా సంపాదకులు వీటిలో ఏదికోరితే అది రాసేవాడ్ని.

## నా నవలల్లో నాకు బాగా నచ్చిన నవల

పైన చెప్పినవి కాక ఇటీవల మరో కేటగిరీకి చెందిన నవల రాశాను. అదే 'జయం'. పూర్తి ఆధ్యాత్మిక నవల. ఇది జూన్ 2003లో వెలువడింది. ఆధ్యాత్మిక నవల కాబట్టి పెద్దగా ఆదరణ లభించదనుకున్నాను. అయితే దీంతోపాటు వెలువరించిన మరో రెండు నవలలు 'పున్నమి'(క్రైం), 'సద్దాం ఆంటీ ఇంటి కథ'(కామెడి)లకన్నా 'జయం' ఎక్కువ అమ్ముడవడం విశేషమే కాబట్టి, తెలుగులో పూర్తి ఆధ్యాత్మికస్థాయిలో రాసిన ఈ నవలను నేను ఈ శీర్షికకి ఎన్నుకున్నాను. పాఠకులు మెచ్చి, సినిమాలుగా వచ్చి అనేక మలి ముద్రణలు పొందుతున్న అనేక నా ఇతర నవలలకన్నా నాకు బాగా నచ్చిన నవలకూడా ఇదే కావడం దీన్నే ఎన్నుకోడానికి ఇంకో కారణం.

పుట్టిన ప్రతివాడు ఏదో రంగంలో పైకి వచ్చి పదిమందిచేత శభాష్ అనిపించుకోవాలని అనుకుంటాడు. అదే జీవిత లక్ష్యంగా కష్టపడతాడు. చివరికి అందరిచేత గుర్తింపు పొందుతాడు. తన జీవిత పరమార్థం నెరవేరినట్లు భావిస్తాడు.

## రూటు మార్చుకున్నాను

కొంతకాలం క్రితందాకా నేనూ ఇలాగే అనుకునేవాడిని. కాని కొన్నేళ్ల క్రితం- సరిగ్గా చెప్పాలంటే.. సెప్టెంబర్ 10, 1999న కర్ణాటకలోని మూకాంబిక అమ్మవారి దర్శనం కోసం ఆలయంలోకి మామూలుగానే వెళ్లాను. కానీ వెలుపలికి వచ్చేటప్పుడు నా ప్రమేయం లేకుండానే నాలో పెనుమార్పు వచ్చింది. అప్పటివరకూ దేవుడిని అంతగానమ్మని నాలో ఆధ్యాత్మిక చింతన పెల్లుబికింది. ఉడిపి కృష్ణాలయానికి వెళ్లినప్పుడైతే కనీసం హారతి పళ్లెంలో మసిగానైనా అక్కడే ఉండిపోతే బావుణ్ణని మనసు పీకేసింది. అప్పటినుంచి నా పాత జీవనవిధానానికి స్వస్తి చెప్పేశాను. పూర్వం ధనార్జనకి, పేరు సంపాదించుకోడానికి ఎంత ప్రాముఖ్యత ఇచ్చేవాడినో అప్పటినుంచీ ఆధ్యాత్మికతకూ అంతే ప్రాముఖ్యం ఇస్తున్నాను. మహాత్ముల సందర్శనవల్లనో, సత్పురుషుల ఆశీస్సుల వల్లనో, సత్‌గ్రంథాల పఠనంచేతనో, ఆ పరమాత్మ అనుగ్రహం చేతనో- 'మనిషి పరమార్థం ఓ రంగంలో అద్వితీయుడిగా పేరు తెచ్చుకోవడం కాదు. ఇంకోటుంది- అన్నది నా మనసులో ఇంకింది. అంతకు మునుపు ఏ తపనతో రాసేవాడినో అదేతపన ఈ పరమార్థం విషయంవైపు షిఫ్ట్‌అయింది. నేను అర్థం చేసుకున్న మేర ఆధ్యాత్మికత గురించి పాఠకులకి అందించాలనిపించింది.

## వ్యాసాలు, చిన్న కథలతో మొదలెట్టి..

ముందు చిన్న చిన్న ఆధ్యాత్మిక వ్యాసాలు, కథల ద్వారా ఆ పనిని మొదలె

ట్టాను. ఈ అంశంమీద నవలరాస్తే.. అనే ఆలోచన కలిగింది. అయితే ఫక్తు ఆధ్యాత్మి కత ఇతివృత్తంగా వచ్చిన నవల తెలుగులో నా దృష్టికి రాకపోవడంతో, పాఠకులకి నచ్చుతుందో లేదోనని బేరీజు వేసుకునే అవకాశం లేకపోయింది.

రచయితల్లో ఓ గుణం ఉంటుంది. రాయాలనుకున్న దాన్ని రాయకుండా ఉండలేరు. అలాంటి తపనతో రాసిన నవల్లో వారి హృదయం తొంగి చూస్తుంది కాబట్టి పాఠకులకు ఎలాంటి గజిబిజి లేకుండా అర్థమవడమే కాక, నేపథ్యం ఏదైనా నచ్చుతుంది. సబ్జెక్ట్ పాఠకులందరికీ ఆసక్తిలేని విషయమైనా సరే, అది కమ్యూనిజం కావచ్చు ఫెమినిజం కావచ్చు ఫేక్షనిజం కావచ్చు వైద్య శాస్త్రానికి చెందింది కావచ్చు మరేదైనా కావచ్చు

**సీరియల్‌గానే ప్రారంభించా..**

గతంలో అలా ప్రత్యేక తపనతో నేను రాసిన కొన్నినవలలు పాఠకుల ఆదరణ పొందాయి. ఆ నమ్మకంతో 'జయం' నవలని వర్క్అవుట్ చేశాను. కొత్తగా ఆరంభమయ్యే ఓ వారపత్రిక ఎడిటర్ సీరియల్ అడిగినప్పుడు ఓ క్రైం, ఓ కామెడి నవలల థీమ్స్‌తోపాటు 'జయం' గురించి కూడా చెప్పాను. 'ఇంతదాకా తెలుగులోరాని సబ్జెక్ట్ మీద సీరియల్ వేయడం మంచిదనుకుంటున్నాను. బావుంటే అలాంటి సబ్జెక్ట్ ఎన్నుకున్నందుకు నాకు పేరొస్తుంది. బాగా లేకపోతే మీ పాఠకులు మిమ్మల్నే తిడతారు. కాబట్టి 'జయం' రాయండి' అన్నారాయన. అయితే కొన్ని వారాలు వెలువడ్డాక ఆ పత్రికను అనివార్య కారణాలవల్ల నిలిపివేశారు. తర్వాత దాన్ని పూర్తిచేసి డైరెక్ట్‌నవలగా వెలువరించాను.

**భగవద్గీత ఏంచెప్పింది?**

భగవద్గీత, ఉపనిషత్తులు బోధించే ప్రధాన విషయం మనిషి జన్మకి లక్ష్యం ఈ ప్రపంచంలో సాటివారి చేత ఔరా అనిపించుకోవడం కాదు.. ఆధ్యాత్మిక సాధనల ద్వారా మోక్షం పొందడం. అది అందరికీ సాధ్యం కాకపోయినా కనీసం గత జన్మల నించి మోసుకువచ్చిన కర్మల భారాన్ని ఈ జన్మలో తగ్గించుకుని తద్వారా జన్మరాహిత్యం వైపు పయనించడం.

ధ్యాన సాధనల అనుభూతులే ఇతివృత్తం

జయం నవల ఇతివృత్తం సరిగ్గా ఇదే. దాని సారాంశం తీసుకుంటే, రాయలసీమలోని ఓ పల్లెటూళ్ళో పుట్టిన మునిరత్నం అనే యువకుడు కర్ణాటకలోని కొల్లూరులో కొలువైన మూకాంబిక ఆలయానికి వెళ్ళడంతో అతనిలో ఆధ్యాత్మిక జిజ్ఞాస మేల్కొంటుంది. అతను సన్యాసాశ్రమం స్వీకరించి రకరకాల ధ్యాన సాధనలుచేసి చివరికి జన్మరాహిత్య స్థితిని పొందుతాడు. ఈ నవలలో ఆధ్యాత్మిక ధ్యాన సాధనలు ఎలా ఉంటాయి, మనిషిలో ఉండే షట్చక్రాల గురించి, ఒక్కో చక్రాన్ని ధ్యాన సాధనతో దాటుతుంటే కలిగే అనుభూతులు ఎలా ఉంటాయి? చివరి స్థితికి చేరినా గురుకృప లేకుండా ముక్తి లభించక పోవడం అంటే ఏమిటి? గురుకృప లభించిన జీవన్ముక్తుడెలా ఉంటాడు మొదలైన అంశాలు నవలారూపంలో వివరించాను. నేను చదివిన అనేక వందల ఆధ్యాత్మిక గ్రంథాలలోని విషయాలని ఈ నవలలో చొప్పించాను.

**ఎందరో మహానుభావులు**

ముఖ్యంగా ఇంకెన్నడూ తిరిగి అమ్మ కడుపున పుట్టకూడదన్న నిశ్చయంతో దీన్లోని హీరో మునిరత్నం పాత్రకి జరిగే అనేక సంఘటనలకు మూలం గురించి చెప్పాలి. భారతదేశంలో అపూర్వ జ్ఞానులుగా కొనియాడే భగవాన్ రమణమహర్షి, రామకృష్ణ పరమహంస, వివేకానంద తదితర ఆధ్యాత్మిక హీరోల జీవితాల్లో జరిగిన ఒక్కో సంఘటన తీసుకుని మునిరత్నం జీవితంలో జరిగినట్లు మెలోడ్రామాతో రాశాను.

ఉదాహరణకి రమణమహర్షి వంశంలో తరానికొకరు సన్యాసం పుచ్చుకునే శాపం

ఉంది. దీన్ని మునిరత్నం వంశంలో ఉన్నట్లు రాశాను. రామకృష్ణ పరమహంస సమీప బంధువు సన్యాసదీక్ష తీసుకోడానికి తన భార్య చేత తెలివిగా ఒప్పిస్తాడు. దాన్నీ ఇందులో వాడుకున్నాను. వివేకానందస్వామి తమిళనాడులో ఓ సంస్థానాధీశ్వరుడికి విగ్రహారాధన మీద గల వ్యతిరేక భావం తొలగించాడు. దాన్ని కూడా ఇందులో మునిరత్నం పరంగా చదవచ్చు. మాతా అమృతానందమయి ఆధ్యాత్మికంగా ఉన్నతస్థితికి ఎదిగాక, సముద్రపు ఒడ్డులోని ఇసకరేణువులు ఆమె ఆరాధించే కృష్ణుడి రూపాలుగా కనబడేవి. మునిరత్నానికి చివర్లో అలాంటివి అనుభవమైనట్లు రాశాను. చంద్రశేఖరేంద్రసరస్వతి పీఠాధిపతి కాకమునుపు, తను చదివే క్రిస్టియన్ స్కూల్లో షేక్స్పియర్ నాటకంలో ఓ పాత్ర పోషించారు. అదీ ఈ నవల్లో మునిరత్నం పరంగా రాశాను. రాఖాడిబాబా పూర్ణజ్ఞాని అయ్యాక అందర్నీ శివరూపాలుగా చూస్తూ మగ, ఆడ తేడాలు లేకుండా 'శివ' అని పిలుస్తున్నారు. అవధూత జిడ్రూ అణ్ణ విసర్జించే మలినం సుగంధంతో నిండి ఉండేది. వీటిని కూడా మునిరత్నం పరంగా వాడుకున్నాను. ముక్తానంద బాబా ధ్యానానుభవాలు 'చిత్‌శక్తి విలాసం' అనే పుస్తకంగా వచ్చింది. అందులోని కొన్ని ప్రధానాంశాలూ తీసుకున్నాను. ఇందులోని మునిరత్నం సద్గురువు నిత్యానందబాబా నిజమైన వ్యక్తి. ఆయన జీవిత విశేషాలని యథాతథంగా పొందుపరచాను.

గొలగమూడి వెంకయ్యస్వామిని ఓ భక్తుడు భోజనానికి పిలిస్తే నిర్యాణం తర్వాత ఆయన ఓ సాధువు రూపంలో వెళ్ళిన సంఘటనతో నవల ముగించాను. వీటన్నిటినీ అవసరమైన చోట, అవసరమైన మేర నాటకీయతతో సంఘటనలుగా మలచడంతో రక్తి కట్టాయనే చెప్పాలి.

**ఆధ్యాత్మికవాదులకు నచ్చింది**

ఆధ్యాత్మిక వాదులను 'జయం' విశేషంగా ఆకర్షించింది. 1980లలో నవలా యుగంలో రచయితగా నాకు వచ్చిన దానికి సమానమైన రెస్పాన్స్ 'జయం'కి వచ్చింది. దీన్ని చదివి అనేకమంది ఫోన్‌ద్వారా నన్ను అభినందించారు. దీనికింత ఆదరణ లభిస్తుందని ఊహించలేదు. ఆధ్యాత్మికత డ్రై సబ్జెక్ట్. కాని నవల్లోని సంఘటనలు, నాటకీయత సరిపాళ్ళలో కుదరడంవల్ల అన్నివర్గాల పాఠకులని ఆకట్టుకుంది.

ఒకప్పుడు మల్లాది రాసిన మంచి నవల ఏదంటే 'స్రవంతి, మిస్టర్ వి, అందమైన జీవితం' లాంటి పేర్లు చెప్పేవారు. 'జయం' కూడా ఆ జాబితాలోకి ఎక్కిందనే చెప్పాలి. ఇదిరాసి రెండేళ్ళయినా ఇంకో ఆధ్యాత్మిక నవల నేను రాయకపోవడానికి కారణం 'జయం' రాయడానికి కలిగిన తపన, అంతః ప్రేరణ మళ్ళీ కలగకపోవడమే. ఇంకేది రాసినా 'జయం' కంటే పైస్థాయి నవల కాకపోవచ్చున్న భయం కూడా ఉంది. అయితే ఇంకో ఆధ్యాత్మిక నవలకి విషయ సేకరణ చేశాను. త్వరలో శ్రీకారం చుట్టాల్సి ఉంది.

సేకరణ: చంద్రప్రతాప్

★

# నవలా పరిచయం

"దేవుడా! అందరూ నీచంగా భావించే ఈ కులంలో పుట్టించినందుకు నీకు లేని సిగ్గు నాకెందుకు?" అని భగవంతుడినే నిలదీసిన ఆమె అగ్రవర్ణాలవారి అభిజాత్యాన్ని సహించలేకపోయింది. అడుగడుగునా అణచివేతకు గురవుతున్నా తను ఎవరికీ తీసిపోననీ ఓడిపోననీ అడుగుముందుకు వేసి శిరసెత్తి నిలిచింది. ఈ మట్టిలోని మాణిక్యానికి సానపట్టి, చైతన్యాన్ని తట్టి లేపి, ఆమెలో నిద్రాణమై ఉన్న ప్రతిభాపాటవాల్ని వెలికితీసిన వారూ ఉన్నారు. వారి అండదండలతో అత్యున్నత స్థానానికి ఎదిగి ఆదర్శంగా నిలిచింది. తనను అవమానించిన వారికి గుణపాఠంనేర్పి విజయకేతనం ఎగురవేసింది. ఆమె స్వరం పరిసరాలు దద్దరిల్లేలా శంఖనాదమై నినదించిన వైనాన్ని అద్భుతంగా ఆవిష్కరించిన **కె.ఎన్.మల్లీశ్వరి** నవల **'అట్టడుగుస్వరం'** ఈ నెల 'చతుర' సమర్పణ.



## రచయిత్రి పరిచయం:



టి. యస్. ఆర్ అండ్ టి. బి. కె. ఉమెన్స్ డిగ్రీ కాలేజ్ ప్రిన్సిపాల్‌గా ఉన్న డాక్టర్ కె. ఎన్. మల్లీశ్వరి ఎం. ఏ. ఎం. ఫిల్, పిహెచ్. డి. చేశారు. లేడీస్కాలర్, భారతంలో స్త్రీ, ప్రేమించడం ఒక కళ అనే నవలలు వెలువరించారు. సమస్యలను స్త్రీ దృక్పథంతో చూస్తాననే వీరి కథలు కొన్ని ఇటీవలే కొన్ని పత్రికలలో ప్రచురితమయ్యాయి.


రచయిత్రి చిరునామా:

డాక్టర్ కె.ఎన్.మల్లీశ్వరి
39-5-11 మురళీనగర్
విశాఖపట్నం-530007

నాకు ఊహ తెల్సిన దగ్గర నుండీ 'నేను ఒక మనిషిని' అన్న జ్ఞానం నాకెపుడూ కలగలేదు... నా పదిహేనో ఏట జ్ఞానోదయమయ్యాక కొత్తగా కళ్ళు తెరిచి లోకాన్ని చూడటం ప్రారంభించాను.

"ఆ!.... ఆ!.... అసుంట.. అసుంట... గుమ్మం తొక్కకు" అనేవాళ్ళు!"

"ఛీ!... ఛీ!... ఫో అవతలికి. గుడి దగ్గరా మీ మొహాలేనా అనేవాళ్ళు!"

"ఎవరైనా శుభ్రంగా ఉంటారేమోగానీ... వీళ్ళని బాగు చేయడం ఎవరి తరం కాదు..." అనేవాళ్ళు!..

ఇంత మంది ఉండగా 'నువ్వు మనిషివి' అని విశ్వసించడం నీ వల్ల అవుతుందా? ...

నావల్లా కాలేదు.. జీవితమంతా అలాగే అజ్ఞానంలో ఉండేదాన్నేమో!...

కానీ ఒక దేవత నన్ను మేలుకొలిపింది... నాలో ఉన్న చైతన్యాన్ని తట్టిలేపింది... నాలో నిద్రాణమై ఉన్న ప్రతిభా పాటవాల్ని వెలికి తీసింది...

ఆరోజే......

నా కళ్ళు తెరుచుకున్న రోజే!...

నాలో ఆవేశం ఉప్పొంగిన రోజే!!

ఊరి బయట శిథిలమైపోయిన దేవాలయపు గర్భగుడిలోనుంచి జాలిగా తొంగి చూస్తున్న దేవుడికి చెప్పేశాను. "దేవుడా!... అందరూ నీచంగా భావించే ఈ కులంలో పుట్టించి నందుకు నీకు లేని సిగ్గు నాకెందుకు? ...." అని

★ ★ ★

గతుకుల రోడ్డు మీద పడుతూలేస్తూ పరుగెడుతున్న బస్‌లో కిటికీ పక్కన కూర్చుంది సుజాత. స్టాపులో ఆగినప్పుడల్లా బస్ వెనకాల పోటీ పడుతూ వస్తున్న దుమ్ము తెరలు బస్‌ని ముంచెత్తివేస్తూ ముందుకు దూసుకుపోయేవి...

కర్చీఫ్ ముక్కుకి అడ్డం పెట్టుకుని కళ్ళు మూసుకుని దుమ్ముబారి నుంచి తప్పించుకుంటోంది సుజాత.

ఆగస్టు నెల కావడంతో రోడ్డు కిరువైపులా వరిపైరు పచ్చదనం తివాచీలా పరుచుకుంది.

ఆ అందమైన తివాచీ తమ సొంతమన్నట్లు కొంగలు విహారం చేస్తున్నాయి.

దూరం నుంచి మెత్తని పరుపులా కన్పించే ఆ పచ్చదనం మీద పడుకోవాలనీ, చేతులతో తడమాలనీ సుజాతకి కోరిక.

ఆలోచనలో వుండగా పక్కన ఎవరో వచ్చి కూర్చోవడం గమనించలేదు.

"ఎవరమ్మాయివే నువ్వు? ఎప్పుడు చూసిన గుర్తులేదు" అన్న మాటలు వినబడి పక్కకి తిరిగి చూసింది..

యాభైఏళ్ళావిడ చేతి సంచీ ఒళ్ళోపెట్టుకుని కూర్చుంది. ఒంటి నిండా బంగారమే!

నవ్వొచ్చింది సుజాతకి. బలవంతాన ఆపుకుంది.

"ఎవరమ్మాయివి? " రెట్టించిందావిడ.

"ఏసుపాదం గారి అమ్మాయిని" తడబాటు లేకుండా చెప్పింది..

అంతే! పక్కలో పాముని చూసినట్లు ఠక్కున లేచి నిలబడింది ముందు సీట్లో కెళ్ళి కూర్చుంది.

"ఖర్మ! ఇంటికెళ్ళి మళ్ళీ స్నానం చెయ్యాలి కాబోలు! టింగురంగామని సోగ్గావుంటే గొప్పింటమ్మాయనుకున్నా"

తన పక్కనున్నావిడతో చెప్పడం విని నిర్లిప్తంగా నవ్వుకుంది సుజాత. ఇది తనకేమన్నా కొత్త అనుభవమా? తన కొక్కదానికే అయిన అనుభవమా? వందల ఏళ్ళ నుంచీ పడుతున్న అవమానాలేగా?

వినీవినీ నిజమే అనుకునే వాళ్ళు కొందరయితే అలవాటు పడిపోయిన వాళ్ళు మరి కొందరు.

వీళ్ళు పాత కాలం వాళ్ళు.

ఇప్పుడు పరిస్థితి అలా లేదు.

విన్న వెంటనే ఎదురు తిరిగి ఆవేశంతో చిందులు తొక్కేవారు కొందరైతే ఎదుటి

వారి అజ్ఞానాన్ని నవ్వుతో క్షమించి తమ నిజమైన ఎదుగుదల కోసం కృషి చేసేవారు మరికొందరు. వీళ్ళు కొత్త తరం వాళ్ళు.

సుజాత కొత్త తరానికి చెందిన రెండో రకం మనిషి.

బస్ వేంపాడు గ్రామంలో ఆగింది. అది ఆఖరి స్టాప్. అందరూ దిగేస్తున్నారు. సుజాత తన సూట్ కేస్, బాగ్ పట్టుకుని దిగింది. ఆ ముసలావిడ చూసి చూసి సుజాత దిగాక జాగ్రత్తగా దిగింది.

సుజాత రోడ్డు మీద నడుస్తుంటే రచ్చ బండ దగ్గరవున్న జనాలంతా కళ్ళప్పగించి చూసి గుసగుసలు పోయారు. లెక్క చేయ నట్లు నడిచింది సుజాత.

వేంపాడు గ్రామం చివర వుంటుంది గూడెం. బస్టాప్ నుంచీ కిలోమీటరు నడ వాలి.

ప్రభుత్వం ఎన్ని పథకాలు వేసినా, ఎవ రెన్ని ఆందోళనలు చేసినా ఆ ఊరి చివరి బతుకులు మారవు కదా! ఆఖరికి సిటీబస్ కూడా గూడెంవరకూ రాదు. రానివ్వరు ఊరి వాళ్ళు. వస్తే ముందే గూడెం వాళ్ళు ఎక్కేసి కూర్చుంటే సీట్లు నిండిపోతాయి. పెద్దకుటుంబాల వాళ్ళు నిల్చుని ఉండాలి అదీ బాధ. అసలు ఏడెనిమిదేళ్ళ కిందటి వరకూ గూడెం వాళ్లెవరూ బస్సులెక్కే వారు కాదు. నాలుగు కిలోమీటర్లు నడిచి వెళ్లి అడ్డ రోడ్డు దగ్గర లైన్ బస్‌లు ఎక్కి ఏలూరు వెళ్ళేవారు. అక్కడ పనులు చూసు కుని మళ్లీ తిరిగి ప్రయాణం. ఎంత రాత్ర యినా ఆ చిమ్మ చీకటిలో, ఆ కీచురాళ్ళ రొదలో రైలు కట్ట దాటుకుని పెద్ద ములు గర్రతో పురుగూ, పుట్రాను చెల్లా చెదరు చేస్తూ నడిచి వచ్చే తమ గూడెం వాళ్లని చూస్తే సుజాతకి ఒళ్ళు పొంగిపోయేది.

ధైర్యానికీ, సాహసానికీ, శ్రమకీ, పట్టుద లకీ వెరవని తమ వాళ్లు ఎందుకు యింకా ఈ చీకటి బతుకుల్లో మగ్గాలో ఆమెకి చిన్న ప్పుడు అర్థమయ్యేది కాదు. ఇపుడు అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తోంది.

తన ముందు గేదెల మంద ఉండటంతో నెమ్మదిగా నడుస్తోంది సుజాత.

'గోధూళి వేళ' అని కవులు వర్ణించినంత అందంగా మాత్రం లేదా సాయంత్రం. కానీ అలవాటైన దృశ్యం కావడంతో ప్రాణం లేచొ చ్చింది.

దాదాపు ఐదేళ్ళ తర్వాత ఊరిని చూస్తోంది. ఎన్ని అవమానాలతో ఎంత పట్టుదలతో తనీ ఊరిని వదిలిందో గుర్తు తెచ్చుకుంటే ఆశ్చర్యంగా ఉంది.

ఆ ఆవేశం

ఆ ఉద్రేకం...

ఆ అమాయకత్వం

తనలో కనుమరుగయ్యాయి. కాదు. తనే వదిలించుకుంది. తనేదైనా సాధించాలంటే ఉండకూడనివి అవే అని గ్రహించుకో గలి గింది.

ఒక్కో ఎదురు దెబ్బతో ఒక్కో బలహీ నతా కరిగిపోయాయి. ఇంకా ఈ పోరా టంలో తను సాధించేది ఎంతో కోల్పోయేది ఎంతో అంతా తన చేతుల్లోనే ఉండాలి. ముందు తన జీవితాన్ని తీర్చి దిద్దుకోవాలి. తర్వాత తన చుట్టు పక్కల వారిని. ప్రస్తుతం తన ముందున్న లక్ష్యం అదే!.

గొడ్లకాడ బుడ్డోడు పాటందుకోవడంతో ఈ లోకంలోకి వచ్చింది. ఆ కంఠం పరిచి తమైనదిగా అన్పించడంతో పరిశీలనగా చూసింది.

పండు బాబు...

చిన్నప్పుడు తన వెంటే తిరుగుతూ తను చేసే ప్రతి పనినీ, తను చదివే ప్రతి పదాన్నీ ఆశ్చర్యంతో పరికించేవాడు. తనకన్నా ఎని మిదేళ్ళు చిన్నవాడు... పదిహేనేళ్ల ప్రాయంలో ఉన్నాడు.

కానీ ఆ వయసంటే ఎవరూ నమ్మరు. పోషకాహార లోపంతో ఎదుగుదల ఆగి పోయి కర్రలా బిగిసిన శరీరం. ముఖంలో

కళ్ళొక్కటే కన్పిస్తూ లోపలికి పోయిన దవడలు, పగిలిపోయిన పెదాలు, తైల సంస్కారం లేని జుట్టు - బాధగా అన్పించింది.

" పండు బాబూ!." దగ్గరికి వెళ్ళి పిలిచింది.

ఉలిక్కి పడి తిరిగి చూసి ఎవరో పెద్దింటోరమ్మాయి దోవ అడుగుతుందేమోనను కుని కర్ర పట్టుకుని గేదెల వెంటబడి "యెహె! జరగండే. చ్చొచ్చొ" అంటూ దోవ చెయ్యడం ప్రారంభించాడు.

"నేనురా! సుజా అక్కని" చెప్పింది.

"సుజా అక్కా?" నమ్మలేనట్లు కళ్ళు మరింత పెద్దవి చేసి చూశాడు.

గుర్తించినట్లు మొహంలోకి సంభ్రమం పాకి వచ్చింది. వెంటనే రోడ్డుకు అడ్డంబడి లగెత్తుతూ "ఓరయ్యో! అక్క వచ్చేసిందిరా! ఒరే మత్తేసూ! నా మందని గూడా జూడరా! అందరికీ జెప్పరా" పరుగెడుతూ చెపుతున్న వాడే మళ్ళీ వెనక్కి వచ్చి సుజాత చేతిలోని లగేజ్ అందుకుని పరుగెత్తాడు. పండుబాబు ఆనందాన్ని చూసి నవ్వుకుంది సుజాత.

మత్తేసు పదేళ్లవాడు. సుజాత ఊరు వదిలి వెళ్లేనాటికి వాడికి ఐదేళ్ళే కావడంతో స్మృతి పథంలో ఆమె రూపు అంతగా ముద్రించబడలేదు. అందుకే ఓరచూపులు చూస్తూ మెల్లగా నడుస్తున్నాడు.

వాడిని మాటల్లో పెట్టి తను లేని సమయంలో ఊళ్ళో జరిగిన విషయాలు తెలుసు కుంటూ పరిసరాలు గమనిస్తూ నడుస్తోంది.

ఊరేం మారలేదు. అవే రోడ్లు. అవే యిళ్లు. అవే చెట్లు. కాకపోతే ఒకటి రెండు కిరాణా కొట్లు. ఓ ఎరువుల కొట్టు, ఓ పిండి మిల్లు వెలిశాయంతే!

ఊరు దాటి ఫర్లాంగు నడవగానే గూడెం ప్రారంభమయింది. గూడెం మొదట్లో బావి, చర్చి, మిషనరీ స్కూలు, అటూ యిటూ యథేచ్ఛగా పారుతున్న మురికి కాలువలు, వాటిమీద జుయ్యిన ఎగురుతున్న దోమలు, చిన్న చిన్న పూరిళ్లు, అపరిశుభ్రంగా ఉన్న పరిసరాలు, ఆమె మనసు బాధతో మూలిగింది.

ఇల్లు యింకా పావు కిలోమీటరు దూరంలో ఉండగానే పెద్ద గుంపు ఎదురయింది. ఏసుపాదం ఆ గుంపు ముందట అంగలు పంగలు వేసుకుని ఛాతీ విరుచుకుని కర్రని నేల మీద తాటిస్తూ భూమి అదిరిపోయేలా ధనా ధనా నడుస్తూ వస్తున్నాడు.

తండ్రిని చూడగానే చిన్న పిల్లలా పరిగెత్తి చంకనెక్కాలనిపించింది...

అంతా తనవాళ్లే! అమ్మ, పిన్నమ్మలు, తాతయ్యలు అదుగో గుంపులో ఆ మూల తన చిట్టి తమ్ముడు. అంతా తన వాళ్లే. వీళ్లందరినీ వదిలేసి తను ఐదేళ్ళు ఏకాకిలా బతికింది.

**వాడివేడి వ్యాఖ్యలకు పెట్టింది పేరు చక్రవర్తుల రాజాజీ. తొలితరం రాజకీయనేతలలో ఆయన ఉద్దండుడు. ఎన్నో పదవులు నిర్వహించారు. సంస్కృతాంధ్ర ఆంగ్లాలలో మహాపండితుడు. మొదట కాంగ్రెస్‌వాదే అయినా తర్వాత నెహ్రూతో విభేదించి స్వతంత్రపార్టీలో చేరారు. నెహ్రూలాంటి మేధావిని సైతం చురుకైన మాటలతో ఇరుకున పెట్టగల సమర్థుడాయన.**

ఓసారి ప్రభుత్వం పన్నుల గురించి ఆయన చేసిన వ్యంగ్య వ్యాఖ్యానం చూడండి..

'ప్రభుత్వ పన్నులు ప్రత్యక్ష పన్నులనీ, పరోక్షమనీ రెండురకాలు. మొదటివి ధనవంతుల మీద, రెండోరకం సామాన్యుల మీద వేస్తుంటారు. విశేషమేమంటే- ప్రత్యక్షపన్నులు ధనవంతులు భరించలేనట్లుంటే పరోక్షపన్నులు సామాన్యులకు అర్థంకాకుండా ఉంటాయి. అంతే తేడా.'



మోడువారిన జీవితంలో తొలకరి జల్లు కురిసినట్లయింది. ఇన్నాళ్లుగా ఏది అధైర్యానికి చిహ్నమని తొక్కి పెట్టేసిందో అది ఆనందాన్ని తోడు తీసుకుని కళ్ళలోంచి కిందకి దూకింది. కాస్త దూరంలో ఉండగానే ఎక్కడి వాళ్లక్కడ ఆగిపోయారు. అందరి చూపులూ నమ్మశక్యంగా లేవు.

ఆరేళ్ల కిందట సన్నగా, పుల్లల్లాంటి కాళ్లు చేతులతో కందగడ్డ లాంటి కాగిపోయిన ఒళ్ళు, పోషణ లేక ఎర్రబడిన రాగి జుట్టుతో మొహంలో మాటి మాటికి రోషం, అసహనం ప్రతిఫలిస్తుండగా అందరి మీదా అయినదానికీ కానిదానికీ విరుచుకుపడుతూ అసంతృప్తికి చిహ్నంగా కనిపించిన తమ సుజాతేనా ఈమె!

ముట్టుకుంటే మాసిపోయేలా ఉన్న గులాబీ రంగు ఒళ్ళు! పొడవుగా, తగిన లావుతో హుందాగా ఉంది. కట్టుకున్న కాటన్ చీర ఆ హుందాతనాన్ని మరింత పెంచుతోంది. నల్లగా ఒత్తుగా ఉన్న చువ్వ జుట్టు నడుం దాటింది. ఒంటి మీద ఏ ఆభరణాలూ లేకపోయినా సహజ సిద్ధమైన ప్రకాశంతో మెరిసిపోతోంది.

"ఓలమ్మో! ఇది నా కూతురే!!!" సుజాత తల్లి మరియమ్మ పరిగెత్తుకుని దగ్గరికి వచ్చి చేతులు పట్టుకోబోయి సంకోచంతో ఆగిపోయింది.

గబుక్కున తల్లిని చుట్టుకుపోయింది సుజాత. మరియమ్మ వేసుకున్న మురికిగుడ్డల కంపు, చెమట ఏవీ సుజాతని ఆటంకపరచలేక పోయాయి. తన జన్మనిచ్చిన తల్లి అన్న భావం ముందు మిగతావన్నీ పరారయి పోయాయి.

అంతే! అందరూ పొలోమని కేకలు వేసుకుంటూ వచ్చి చుట్టుముట్టారు. అందరూ ఏవేవో ప్రశ్నలు అడుగుతున్నారు. తనకి వినిపించినవాటికి సమాధానాలు చెప్తోంది. చాలా మంది ఆడవాళ్ళు ఏదో ఒక మిష మీద ఆమెని తాకి ఆనందిస్తున్నారు.

సినిమాల్లోనూ, పెద్దోరిళ్ళలోనూ కనిపించే యిలాంటి అమ్మాయి తమ గూడెం అమ్మాయి అని తెలియగానే చిన్నపిల్లలకి పట్ట పగ్గాలు లేవు. ఆమెని ఆనుకుని నిల్చోడానికి గుద్దులాడుకుంటున్నారు.

"పదండెహె! పిల్లని ఈదుల్లో నించోబెట్టి వూసులాడతన్నరు" ఓ ముసలాయన కసరడంతో అంతా బయల్దేరారు.

ఏసుపాదం ఇల్లు గూడానికి అవతలి చివర ఉంటుంది. ఇంటిని ఆనుకునే అతనికి అరెకరం పొలం ఉంది. ఆ పొలం గట్టునే భూషణం గారి పాతికెకరాల పొలం ఉంది. బోరు నీరు ధారాళంగా ప్రవహిస్తూ ఉంటుంది. ఎకరం లక్షన్నర వరకూ పలికే సస్యశ్యామలమయిన భూములవి. భూషణం గారి బోరు దగ్గరే తన అరెకరానికి నీరు కొంటాడు ఏసుపాదం. అంతే కాకుండా ఆ చుట్టు పక్కల యిళ్ల వాళ్లు తాగు నీరు అక్కడినుంచే పట్టుకెళతారు.

ఇంటికి చేరగానే అక్కడి పరిసరాల్ని చూసి అప్పటి వరకూ పొందిన బాధని మర్చిపోయింది. ప్రకృతి సహజత్వంతో ఆ ఇంటి పరిసరాలు నిండిపోయాయి.

చుట్టూ పొలం. నీటితో నిండిన బోదెలు వాటి మీద నుంచి వస్తున్న పిల్లగాలిని యిష్టంగా పీల్చింది. పట్నపు పొల్యూషన్ అంతా నిశ్వాసం ద్వారా బయటికి వస్తున్న భావం కలిగింది.

ఆ ఇల్లు చాలా చిన్నది. ఇల్లు అని కూడా అనరేమో! మట్టి గోడలని పేడతో అలికి పైన తాటాకు కప్పు వేశారు. అందులోనే రెండు గదులు ఉన్నాయి.

ఇంటి బయట శుభ్రం చేసి చిన్న పందిరిలా వేశారు. వర్షం లేనప్పుడు, వేసవి కాలంలోనూ ఇంటిల్లిపాదీ నులక మంచాలేసుకుని అక్కడే పడుకుంటారు.

రాత్రి ఏడున్నర వరకూ ఎవరో ఒకరూ వస్తూ పోతూనే ఉన్నారు. చివరికి ఏసుపాదం విసిగిపోయి దడి తడకని తాడుతో

కట్టేశాడు. ఎవరన్నా వచ్చినా బయట వాళ్ళని బయటే 'రేపు రమ్మ'ని చెప్పి పంపిం చేస్తున్నాడు. మరియమ్మకి వంట పెద్ద సమస్యయి పోయింది. కూతురు ఇపుడు దొరసాని బిడ్డలా తయారయి వచ్చింది. ఇదివరకులా కొరివి కారం ఎండు నెత్తళ్ళు వండితే తినకపోవచ్చు. చప్పిడి కూరలు ఏవో వండాలి.

పెద్దోరిళ్లలో తను పనికి వెళ్ళినపుడు మిగి లిపోయిన కూరలు ఇచ్చేవారు. అవి ఏ రుచితో ఉండేవో గుర్తు తెచ్చుకుంది. గబ గబా చిమ్నీ పట్టుకుని కూరల పాదుల దగ్గ రికి పరుగెత్తింది. నాలుగు మొక్కలు చుక్క కూర, నవనవలాడే వంకాయలు తెంపుకుని వచ్చింది.

బయట కర్రల పొయ్యి వెలిగించి పెసర పప్పు చుక్క కూర, వంకాయ వేపుడు చేసింది. ఆ పక్కనే మంచం మీద కూర్చుని తండ్రితో తమ్ముడితో కబుర్లు చెపుతున్న సుజాత ముక్కుకి తాళింపు వాసన తగల గానే నోరూరింది.

భూషణం గారి పొలంలో నుండి నాలుగు అరటాకులు తెంపుకొచ్చాడు తమ్ముడు రాజు. అక్కడే బోరు నీటిలో శుభ్రంగా కడిగాడు.

బయట పుచ్చ పువ్వులా వెన్నెల. చిమ్నీతో అవసరం లేనంత వెలుగు.

అక్కడే మంచాల మీద కూర్చున్నారు. ఎదురుగా ఎత్తు పీటల మీద అరటి ఆకులు పెట్టి వేడి వేడి అన్నం, కూరలు వడ్డించింది.

రాత్రెపుడో తిన్న భోజనం. ఉదయం తిన్న టిఫిన్ తప్ప పొట్టలో ఏమీ లేదు. ఆవురావురుమంటూ తినేసింది. ఆకు మడుస్తూ లేచినపుడు గొప్ప సంతృప్తిగా అన్పించింది. ఇంతకన్నా ఏది సంతృప్తిని ఇస్తుంది వ్యక్తిగతంగా.

చక్కటి నిద్ర పట్టినపుడు ఆకలి మీద భోజనం చేసినపుడూ నలుగురితో కలిసి మనసారా నవ్వుకోగలిగినపుడు కలిగిన ఆనందం కన్నా వ్యక్తిగతమైన ఆనందం ఏముంది? పగలంతా పొలం పనుల్లో అలసి పోయి ఉన్నారేమో సుజాతతో మాట్లాడు తూనే జోగు తున్నారు తల్లితండ్రులు. వా ళ్ళని పడుకోమని చెప్పి తను దడి దగ్గరికి వెళ్ళి నిల్చుంది.

వెన్నెల్లో పొలం, దూరంగా తాటి చెట్టు, బోరు, కుండీ, చుట్టూవున్న గుడిసెలు చిత్ర కారుడి మనోహర దృశ్యాలలా కదలకుండా వున్నాయి.

ఈ ఊరు తనది. ఈ నేల తను జన్మని చ్చింది అనుకోగానే విడదీయరాని బంధం ఏదో ముడివడిపోయినట్లు అనిపించింది.

కాళ్ళు నొప్పి అన్పించగానే అక్కడ వున్న బండరాయి మీద కూర్చుంది.

దూరంగా పడుతూ లేస్తూ వస్తున్న ఆకా రాన్ని గమనించి పరిశీలనగా చూస్తుండి పోయింది.

ఎవరో యువకుడు. దగ్గరకి వచ్చాక కూడా గుర్తుపట్ట లేకపోయింది. అతనూ అంతే! తటపటాయిస్తూ నిల్చుని,

"ఎవురు? " అడిగాడు.

"ఇంటికి వచ్చిన వాళ్ళు మీరు. ముందు మీరెవరో చెప్పండి" సుజాత నవ్వుతూ అంది. ఆ కంఠస్వరం విని గుర్తుపట్టేశాడు.

"ఆ! సుజీ! నేను యాదిలేనా? " ప్రసాద్!! ప్రసాద్ కావచ్చు

ఆ మసక వెలుతురులో రేఖాచిత్రంగా అతని సమున్నత శరీరం, కాయకష్టంతో రాటుదేలిన కండలు కన్పిస్తున్నాయి.

"ప్రసాద్ బాగున్నావా? " అడిగింది.

సంతోషంతో అతని మొహం వికసిం చింది.

"ఆ! బాగానే వుండా! నువ్వెప్పుడొచ్చా?" తనూ పక్కనే వున్న బండరాయి మీద కూలబడుతూ అన్నాడు.

**కొవ్వొత్తిలా వెలుగుతూ మానవసేవ అనే కాంతిని విరజిమ్మ గలిగితే నన్ను నేను ధన్యుడిగా భావిస్తాను. – సేన్‌గురూజి**

"సాయంత్రమే!."

గత జ్ఞాపకాల బరువుతో ఇద్దరి మనసులూ భారంగా ఉన్నాయి. ఆ భారాన్ని దించుకోవాలనీ పంచుకోవాలనీ ప్రసాద్‌కు ఆరాటంగా వుంది. కానీ సుజాత గంభీరంగా ఉండటం అతనికి కొత్తగా వుంది.

తనకి తెలిసిన సుజీ తనూ ఒకేజట్టు. ఎపుడూ ఏదోసాధించాలన్న ఆవేశం, పగ, ప్రతీకారాలతో ఇద్దరూ రగిలిపోయే వారు. అన్నీ మర్చి పోయిందా? .

"కూలి నుంచి గుడిసెకి వచ్చేతలికి ఆలీసెం అయింది. బువ్వ దిన్నాక అయ్య జెప్పిండు. సుజాత వచ్చిందిరా అని. వున్న పాలిన లగెత్తుకొచ్చా" ప్రసాద్ వివరించాడు.

అతను చెప్పుతున్నంత సేపూ సుజాత అతని వంక విచిత్రంగా చూస్తూ ఉండిపోయింది.

ఆమె మౌనం ప్రసాద్‌కి ఇబ్బంది కరంగా వుంది. సుజాత మారిపోయిందా? తమ అనుబంధం మర్చిపోయిందా? అతనికి మనసంతా చేదుతిన్నట్లుగా తయారైంది.

చీకటిలో చీకటిలా మౌనం రాజ్యమేలుతుండగా హఠాత్తుగా గొంతువిప్పింది సుజాత.

"నీలో చేవ చచ్చిందా? " ఉరుములా గర్జించినట్లు అనిపించి ఉలిక్కి పడ్డాడు ప్రసాద్.

ఆ అభియోగానికి ఏం సమాధానమివ్వాలో తెలియక కొట్టుమిట్టులాడుతున్నాడు.

"మనిషివి మారావా? " మళ్ళీ అదే పదును స్వరం. అర్థం కాలేదతనికి.

"భాష మారిందేం? "

కొంచెం కొంచెం అర్థమవుతోంది. అతనికి హఠాత్తుగా ఆనందం వేసింది. సుజీ ఏం మారలేదు. అప్పటి సుజీనే. కానీ తనే మారి ఆమెని బాధ పెట్టాడు.

"గూడెంలో అందరూ మాట్లాడే తీరే అది నేనొక్కడినీ" నసుగుతూ అన్నాడు.

"మార్పు ఒక్కళ్ళిద్దరితోనే ప్రారంభం అవుతుంది. నీ కిష్టమైన భాషలో మాట్లాడుకునే అధికారం నీకు వుంటుంది ఏం? భాష ఎవరి సొంతం? దాని మీద ఎవరికయినా గుత్తాధికారం వుందా? " ఆమె కంఠంలో కించిత్ ఆవేశం...

"కానీ నువ్వు మళ్ళీ తిరిగి వస్తావనీ"

"వద్దు" లేచి నిలబడి "సంజాయిషీలు వద్దు. పోరాటం ఎవరికోసమో కాదు మన కోసమే"

ఏడెనిమిదేళ్ళ కిందటి సంభాషణలు గుర్తుకొచ్చాయతనికి. అతనూ లేచి నిలబడ్డాడు.

ఆమె చందమామకి అభిముఖంగా తిరిగింది. ఏదో జరగబోతున్నట్లు ఆ జరిగేది ఏంటో తనకి తెలుసునన్నట్లు ప్రసాద్ ఆమె పక్కనే వచ్చి నిల్చున్నాడు.

జరగబోయే దానికోసం ఊపిరి బిగబడుతూ గాలి స్తంభించింది. వరిపైరు నిటారుగా నిలబడి ఎదురు చూస్తోంది. చందమామ చిన్నబోయింది. ప్రకృతి అంతా నిశ్శబ్దమయిపోయింది.

"వేదం చదివిన నా నాలుకని తెగ్గోస్తావా? అయితే ఇపుడే దానిని ధిక్కరిస్తున్నాను" ఆమె తన కంచు కంఠంతో వేదపఠనం ప్రారంభించింది.

"దేవీం వాచమజనయంత దేవా
స్తాం విశ్వరూపాః పశవో వదంతి
సానో మంద్రేష మూర్జం దుహానా
ధేనుర్వాగ స్మా నుప సుష్టు తైతు."

ప్రసాద్‌కి ఒళ్ళు గగుర్పొడుస్తోంది. ఆ వాతావరణానికో, ఆమె కంఠానికో విచలితుడయిపోతున్నాడు. కానీ శ్రద్ధగా ఆలకించాడు.

ఆమె ఆపగానే తనూ గట్టిగా దిక్కులు ప్రతిధ్వనించేలా "వేదం విన్న నా చెవుల్లో సీసం పోస్తారా? ఇపుడే దానిని ధిక్కరించాను" అని అరిచాడు.

చాలాసేపు అలా చీకట్లో ఒకరి నొకరు చూసుకుంటూ గుండెల్లోని ఆరని అగ్నిని ఆర్పే ప్రయత్నం చేస్తూ నిలబడ్డారు.

అక్కడికి కొంచెం దూరంలో గుడిసె లోంచి తల్లీ, బయట పడుకున్న తండ్రి, తమ్ముడు దిగులుగా నిలబడి ఉండటం ఇద్దరూ గమనించలేదు.

గమనించి ఉంటే వారి ముఖాల్లో తొంగి చూస్తున్న భయం, సందేహం, దిగులు పోగొట్టే ప్రయత్నం చేసి ఉండే వారేమో!

★ ★ ★

రాత్రి పడుకోవడం ఎంత ఆలస్యమైనా తెల్లవారు ఝామునే లేచింది సుజాత. ఇష్టంగా పల్లె గాలిని పీలుస్తూ పక్క మంచం మీదే చాలాసేపు కూర్చుంది.

సూర్యుడి ఆగమనం కోసం ఎదురు చూస్తూ తూర్పు దిక్కు ఎర్రవారడం మనోహరంగా ఉంది. రాత్రి చల్లదనానికి సేదదీరిన వరి పైరు సూర్యుడి ప్రతాపాన్ని ఎదుర్కోవడానికి సిద్ధపడుతోంది.

దూరంగా బోదెల వెంబడి నీరు జలజలా ప్రవహించడం చిన్నగా వినిపిస్తోంది. రెండు అరచేతుల్లోనూ మొహాన్ని ఉంచి కళ్ళు విప్పార్చి చూస్తోంది సుజాత.

కూతురు లేచిన దగ్గరనుంచీ దగ్గరకొచ్చి పలకరించాలంటే గుబులుగా ఉంది మరియమ్మకి, ఏసుపాదానికి. రాత్రి సంఘటన గుర్తొచ్చి మరింత బెంగటిల్లి పోతున్నారు. 'కూతురు నిప్పు' ఆ సంగతి తెలుసు. కానీ ఆ నిప్పే ఆరని చిచ్చై తమ బతుకులలో పెను ముప్పుని సృష్టిస్తుందేమోనని భయపడుతున్నారు.

దానికి తోడు ఆమె ఉదయం లేచిన దగ్గరనుంచీ మౌనంగా కూర్చోవడం చూసి ఆమె ఏదో బాధతో కుమిలిపోతోందని భయపడుతున్నారు.

అందుకే అటూ ఇటూ కాలు కాలిన పిల్లుల్లా తిరుగుతున్నారు "యామ్మా! లేసిం దగ్గర్నుంచీ అట్టాగే కూచోనుండావు? " మరియమ్మ యథాలాపంగా అన్నట్లు అంది.

తిరిగి చూసింది సుజాత.

"అమ్మా! ఇక్కడ ఎంత బావుందీ!! చాలా ఆనందంగా ఉంది. అందుకే చూస్తున్నాను" మనస్ఫూర్తిగా చెప్పింది.

మరియమ్మ మనసు తేలికయింది. నెమ్మదిగా పని పాటల్లో పడింది. చల్దన్నం తిన్నాక ఏసుపాదం నెమ్మదిగా కూతురి పక్కన చేరాడు.

"ఏం నాన్నా! కూలికి వెళ్లడం లేదా? " అడిగింది. ఇంతవరకూ 'అయ్యా!' అని పిలిపించుకోవడానికి అలవాటు పడిన చెవులకి 'నాన్నా!' పిలుపు ఏదోగా ఉంది. ఏదో తనని కూతురు గొప్పగా గౌరవిస్తున్నట్లుగా అన్పిస్తోంది. ఇష్టమో, అయిష్టమో కూడా తెలీడం లేదు.

ఏదేమైనా కూతురి భాష, కట్టు, బొట్టు మారాయి. సమాజంలో గుర్తింపు పొందిన మనిషిలా ఉంది. ఇక తామూ మారక తప్పదు. రాత్రే ఇంటి దానికి చెప్పాడు. ఇక నుండీ ఇల్లూ, ఒళ్లూ శుభ్రంగా ఉంచుకోమని.

కూతురు రావడంతోనే తమ జీవితాల్లో పెద్ద మార్పేదో రాబోతున్నట్లు మనసు కలవరంగా తయారయింది. ఎన్నెన్నో విషయాలు ఆమెని అడగాలని మనసు పీకుతూ ఉంది. ఆమె చెప్పే సమాధానాలు విని తట్టుకోగలనా? అన్న సంకోచం మరో పక్క.

మరియమ్మ కూతురు కోసం మాణిక్యం హోటల్ నుంచి ఇడ్లీలు తెప్పించింది.

"అమ్మా! నేనేమైనా చుట్టాన్నా? యిలా ఎన్ని రోజులు నన్ను పోషిస్తావు? మీరు తినేదే నేనూ తింటాను" మందలింపుగా అంది.

"అట్టాగేలేవే! ఏందో కళ్ళబడవనుకున్న దానివి అగపడ్డావు. ఒకటే బేజారుగా ఉండాది" కళ్లొత్తుకుంటూ అంది మరియమ్మ.

"ఇక ఎపుడూ మిమ్మల్నీ, ఈ ఊరినీ వదిలి ఎక్కడకు వెళ్ళను. పోగొట్టుకున్న చోటే సంపాదించుకోవాలిగా!" చివరి మాట ఆలోచనగా అంది సుజాత.

మరియమ్మ, ఏసుపాదం కూలికి వెళ్లిపోయారు. సుజాతకి కాలక్షేపానికి, ఏదన్నా అవసరం వస్తే చూడటానికి రాజుని తోడుగా ఉంచారు.

రాజుకి అక్కని చూస్తుంటే ఆరాధనగా అన్పిస్తోంది. సుజాత ఊరు వదిలి వెళ్లేనాటికి రాజు వయసు పదేళ్ళు. పండుబాబు తోటివాడు.

ఆరేళ్ళ కిందట హఠాత్తుగా ఊరు ఊరంతా గందరగోళం కావడం. పోలీసు బూట్ల చప్పుడు తామంతా భయం భయంగా ఒదిగొదిగి జీవితాలు గడపడం అపుడపుడూ స్మృతి పథంలో మెదులుతూ ఉంటాయి.

ఆ వయసులో ఏం జరుగుతుందో అర్థమయ్యేది కాదు. ఎవరిని అడిగినా ముక్కు మీద వేలేసుకుని 'ఉష్' అంటూ సైగ చేసేవారు. వయసు వస్తున్న కొద్దీ విషయం అర్థమౌతోంది.

గొడ్లని మేతకి తోలుకు పోయినపుడు వంటరిగా చెట్టుకింద కూర్చుంటే ఏవో ఊహలు చుట్టు ముట్టేవి. ఒక దానితో మరొకటి కలిపి చూసుకుంటే ఆ ఊహల మొదటా, చివరా సుజాతే ప్రశ్నార్థకంగా నిలబడేది.

పెద్దింటోరి గొడ్లని కాపు కాసేటపుడు పొరపాటున గేదె తప్పించుకుని పొలంలో పడితే వెంటనే బందిల దొడ్డిలో పెట్టేవారు. ఇంటాయన గేదెని విడిపిస్తూ అనే మాటలు ఇప్పటికీ గుర్తే.

"యారా! మీ అక్క గూడా ఈ పొగరుపోతు గేదె లాంటిదేరా!. దాన్ని గూడా బందిల దొడ్డిలో పెట్టుండాల్సింది" హేళనగా నవ్వుతూ అనేవాడు. పక్కనున్న వాళ్లు శ్రుతి కలిపేవారు.

తన రక్తం సలసలా మరిగేది. మొహం అవమానంతో కందిపోయేది. కక్షగా ఆయన వంక చూసేవాడు. ఆ చూపుల్లో ఏదో ఆశ! ఏనాటికైనా వాటికి శక్తి వచ్చి భగభగా మండాలనీ, ఆ మంటల్లో తన అక్కని గురించి హేళన చేసే వాళ్లందరూ మాడి మసవ్వాలని కోరిక.

ఏదీ జరగక అసహాయంగా నిలబడిపోయేవాడు. అది చూసి ఆ పెద్దాయన ఫెళ్లున నవ్వుతూ "చూడంర్రా, బక్కోడి కోపం... అమ్మో! ఈళ్లగ్గానే సందు ఇచ్చామంటే మనల్నే మింగేస్తార్రా!" అంటూ వీపు మీద ఫెడీమని గుద్దేవాడు.

నిస్సహాయతకీ బాధకీ కన్నీళ్లని తోడు తెచ్చుకుని మౌనంగా వెనుదిరిగేవాడు. కానీ అతని అంతరంగమంతా వేనవేల స్వరాలతో విలపిస్తూ, గర్జిస్తూ సుజాత చుట్టూ తిరిగేది.

ఎవరితోనూ ఏమీ మాట్లాడేవాడు కాదు. గొడ్లని తోలుకెళ్లడం, మేత మేశాక, చెరువుకి తీసుకు వెళ్లి కడిగి పెద్దోరింట్లో కట్టేసి ఇంటికొచ్చి తల్లి పెట్టిందేదో తినేసి నులక మంచం మీద పడుకుని ఆకాశం వంకా, అందులోని నక్షత్రాల వంకా తదేకంగా చూస్తూ, అన్వేషిస్తూ గడిపేవాడు. జీవితమంతా నిర్లిప్తం. పదిహేనేళ్లకే కోరలు చాచుకుని వచ్చిన నిర్లిప్తత అతనికి జీవితం పట్ల ఏ ఆశా లేకుండా చేసింది.

అదుగో, అలాంటి సమయంలోనే పండుబాబు పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఉత్తినే రాలేదు. కమ్మని వార్త మోసుకు వచ్చాడు. 'అక్క వచ్చిందిరా' అంటూ.

ఆనందమో, దుఃఖమో తెలీలేదు. ఊరంతా పరుగెడుతుంటే తనూ వారి వెనకాలే వెళ్లాడు. దూరంగా అక్క.

ఆమె! సుజాతేనా? తన తోబుట్టువేనా? పెద్దింటాయన కూతురికన్నా గొప్పగా దర్జాగా నడిచి వస్తుంటే ఎదురు వెళ్లే ధైర్యం లేక చాటునుండి చూశాడు. తన చూపుల

పుష్పాలతో ఆమెని అభిషేకిస్తూనే ఉన్నాడు.

కానీ, నిన్న అర్ధరాత్రి నిశ్శబ్దం అంతటా పరుచుకుని ఉండగా, ఆ నిశ్శబ్దాన్ని, చీక ట్లనూ చీల్చుకొని దిక్కులు పిక్కటిల్లేలా ఓ కంఠం గుళ్ళో అయ్యోరి కంఠాన్ని కూడా సవాల్ చేస్తున్నట్లుగా మార్మోగేసరికి చెప్పొద్దూ! మృత్యు ఘంటికలు తన చెవుల పక్కనే మోగినట్లయి ఉలిక్కి పడ్డాడు. గుండెల్లో గుబులు ఉరకలెత్తింది. అమ్మా, అయ్యా దిగులు మొహాలు చూస్తే ఏదో జరగబోతున్నట్లనిపించింది.

తెల్లారేసరికి సూర్యుడు వస్తూ వస్తూ గుప్పెడు ధైర్యాన్ని తనమీద చల్లాడు. కొత్త రక్తమేదో శరీరంలో పరుగులెత్తింది. గొడ్లని కాసుకోడానికి రమ్మని పెద్దింటాయన కబురు చేసినా వెళ్లలేదు. ఏదో ఒక అండ తనకి రక్షణ నిస్తున్నట్లుగా ఉంది రాజుకి.

పందిరి గుంజకి ఆనుకుని కూర్చుని నారతో పలుపు తాడు నేస్తున్నాడు. అతని చేతి వేళ్లు చకచకా కదులుతున్నాయి. సుజాత ఆసక్తిగా అతని వేళ్ళ నైపుణ్యాన్ని చూస్తోంది. ఏకాగ్రతతో చేయాలే గానీ సృష్టిలో ప్రతీదీ కళే!.

"రాజూ! ఎంత వరకూ చదివావు? " అడిగింది.

"అయిదు" మొహం పైకెత్తకుండా చెప్పాడు. పసితనాన్ని వదిలి బొంగురుగా మారుతోన్న స్వరం. పై పెదవి మీద రోషంగా మొలుస్తోన్న మీసం. కొత్తగా అన్పించాడు.

"ఎందుకు ఆపేశావు? "

చివ్వున తలెత్తి చూశాడు. ఆశ్చర్యపోయింది సుజాత. ఆ కళ్లల్లో కసీ, క్రోధం పోటీ పడుతున్నాయి. అదీ క్షణం సేపే! వెంటనే నిర్లిప్తత. మొహం కిందికి దించుకున్నాడు.

"నేనేగాదు పండుగాడు, యాకోబు, రాణి, అందరం మానేశాం" క్షణం ఆగి "మాన్పించేశారు" చెప్పాడు.

"ఏం? "

"నీకు తెలీదా? " పదునుగా దూసుకు వచ్చింది స్వరం. మౌనం వహించింది సుజాత. ఏమనుకున్నాడో ఏమో తానే చెప్పడం మొదలు పెట్టాడు.

"నువ్వెళ్ళిపోయాక మేష్టర్లు నానా గోలా చేశారు. మేం బడికి పోతే పాఠం జెప్ప రంట. పెద్దింటోరి పిల్లలు కూడా మాతో కూకొని చదవరంట. వారం రోజులు అదే పనిగా తిరిగినా లోపలికి రానివ్వలా!. ఓ రోజు మునసబు గారి మనవడికీ యాకో బుకీ గొడవైంది. యాకోబు వాడిని మూతి బగిలేటట్లు కొట్టాడు. మళ్లా పోలీసులు వచ్చారు. యాకోబుని పట్టుకుపోయారు"

వింటున్న సుజాత నిటారుగా కూర్చుంది.

"యాకోబునా? "

"అవును ఆడిమీద ఏవో కేసులు పెట్టా రంట. ఊరంతా పట్టుబట్టి ఆడిమీద కక్ష గట్టారు. ఆడిని మళ్లీ ఊళ్ళోకి రానియ్యలా! ఆయ్యా వాళ్లు టౌన్ బోయినపుడు నేను గూడా ఆళ్ళతో బోయా. అప్పుడు జూశా. ఆఖరుగా ఊచల గదిలో మూల కూకోనుం డాడు. అందరిని జూసి గొల్లుమన్నాడు" ఆఖరి మాట చెపుతుంటే రాజుకి గొంతు నిండా దుఃఖమే!

వింటున్న సుజాతకి మనసంతా మెలిదిప్పినట్లయింది. "యాకోబు ఇపుడు ఎక్కడ ఉన్నాడు? "

"ఏదో స్కూల్లో ఏశారు. బోట్టన్ స్కూలో ఏదో. ఇకాడి గురించి ఎవరికీ యాదిలేదు. ఆళ్లమ్మకే మనేన. కానీ ఎవుళ్ళేం జేస్తారు? "

నిట్టూర్చింది సుజాత. లేచి నిలబడి పచార్లు చెయ్యసాగింది. రాజు తన పని తను చేసుకుపోతున్నాడు. మళ్ళీ అంతటా నిశ్శబ్దం. దూరంగా భూషణం గారి పొలంలో అక్కడక్కడా కలుపు తీస్తున్న వాళ్ళ మాటలు, తడిక పక్కనుండీ బోదెల ద్వారా జలజలా పారుతున్న నీళ్ళు చప్పుడూ గాలి వాలుకి వినిపిస్తున్నాయి.



## యాక్సిడెంట్ల దేవత

లోక్‌సభలో ప్రెస్‌బిల్ మీద చర్చ జరుగుతోంది.

హెచ్. వి. కామత్ ఆ సందర్భంలో రాజాజీని చాణక్యుడిలాంటి వాడని అన్నారు. ఇకనేం? రాజాజీ లేచి 'అధ్యక్షా.. గౌరవసభ్యుడు నన్ను చాణక్యుడితో పోల్చి అవమానిస్తున్నారు'అని ఫిర్యాదు చేశారు.

దానికి కామత్ 'చాణక్యుడితో పోల్చడం అవమానం కాదు. ప్రశంస. దాన్ని ఆయన తప్పుగా అనుకోవడం నా దురదృష్టం' అన్నారు నొచ్చుకుంటూ.

'నిజానికి గౌరవసభ్యుడికి నన్ను ప్రశంసించే అలవాటేలేదు. ఆయన వాడిన పదం నా అదృష్టవశాత్తు మంచిదైంది. ఇదో యాక్సిడెంట్. ఇలాంటి యాక్సిడెంట్లు సృష్టించే దేవతకు ధన్యవాదాలు' అన్నారు రాజాజీ.

కామత్‌సహా సభ మొత్తం పగలబడి నవ్వింది.

దూరంగా పొలం గట్టు వెంబడి ములగర్ర పట్టుకుని పెద్దపెద్ద అంగలతో వస్తున్నాడు ప్రసాద్. చేతులు కట్టుకుని పందిరి గుంజకి నిలబడి అటే చూడసాగింది సుజాత.

అతని అడుగులకి భూమే కదిలిపోతుందా అన్పిస్తోంది. నిన్న రాత్రి చీకట్లో అతన్ని చూడనేలేదు కానీ పోతపోసిన నిలువెత్తు పౌరుషం తన ముందుకి వస్తున్నట్లుగా వుంది. మెలితిరిగిన మీసం! దేనికీ, ఎవరికీ లొంగనన్నట్లున్న ఉంగరాల జుట్టు! కాయకష్టంతో రాటుదేలిన కండలు.

తడిక చప్పుడుకి తిరిగి చూశాడు రాజు. ప్రసాద్ కనిపించాడు. మళ్ళీతల దించుకునే పలుపుతాడుకి చివర ముడివేస్తూ..

"ఈ గూడెంలో వీడొక్కడే కొత్త పౌరుసం ఉన్నవాడు. ఈడిని జూసి ఊరోళ్ళంతా గొణుక్కుని పోతారే తప్ప గొడవ పెట్టుకోరు" జనాంతికంగా చెప్పాడు.

ప్రసాద్ దగ్గరకి రాగానే పలుకరింపుగా నవ్వింది. "కూలికి వెళ్ళలేదా? " అడిగింది.

"లేదు. ఈ రోజు గూడేనికి పండగొచ్చింది"

"ఏం పండగ? " ఆసక్తిగా అడిగింది.

నవ్వేసి ఊరుకున్నాడు. అర్థమయ్యాకానట్టుంది. రెట్టించలేదు సుజాత.

గుడిసెలోకి వెళ్ళి లోటాడు నీళ్ళుతాగివచ్చి గట్టు మీద కూర్చున్నాడు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళు వుండిపోయారు. ఎంతో మాట్లాడాలని వుంది కానీ ఎక్కడ మొదలుపెట్టాలో తెలీడంలేదు. ఆ మౌనం భరింపరానిదిగా వుంది. అస్థిమితంగా కదిలాడు ప్రసాద్.

"సుజీ! నేనేం జెయ్యాలో చెప్పు" ఆత్రంగా అడిగాడు.

"ఏదో చెయ్యాలన్న ఆరాటం యింకా నీలో మిగిలేవుందా? "

సవాల్ చేస్తున్నట్లు వినిపించింది గొంతు...

ప్రసాద్ మొహం కందగడ్డలా మారింది. కళ్ళలోకి ఎర్రజీరలు ప్రవేశించాయి. ముక్కు

**అందమైన వస్తువు అమితమైన ఆనందాన్ని ఇస్తుంది.**

**– థామస్ పెయిన్**

పుటాలు కోపంతో అదరసాగాయి.

"ఆరాటం గాదు కక్ష. దొరికినోడిని దొరికి నట్టు ఏసెయ్యాలి. మన గూడెం ఆడోరి ఒంటి మీద చెయ్యేసిన పెద్దమడుసుల్ని, యాకోబుని జైలుకి పంపిన ఎదవల్ని తరిమి కొట్టాలి. నేను అందుకే పుట్టాను. యిదుగో నా చేతులకి యిందుకోసమే యింత బలం" ములగఱ్ఱని ముక్కలు ముక్కలు చేశాడు.

కాసేపు అతని పనిని శాంతంగా పరిశీ లించి చిన్నగా నవ్వింది. విచిత్రంగా చూశాడు ప్రసాద్..

"నువ్వసలు మా సుజీవేనా? " కోపంగా అడిగాడు.

"ఏం"

"నీకళ్ళ ముందే ఎన్ని జరిగాయి? పోనీ వదిలేయి. నువ్వెళ్ళాక అర్ధరాత్రిళ్ళు గుంపులు గుంపులుగా వచ్చి ప్రతి ఆడదాన్నీ అవమానించారు. అందరం ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకున్నాం. దినదినగండంగా బతికాం. ఆఖరికి పదేళ్ళ యాకోబు ఆ బుడ్డ ఎదవ మీదకూడా కక్ష! ఆడి మీద మర్డర్ కేసు మొదలుకుని ఒకటారెండా లెక్కలేనన్ని కేసులు. పైఊళ్ళోవాళ్ళంతా ముక్కున ఏలే సుకున్నారు ఈ ఘోరాలకి. నీ రక్తం మరు గడం లేదా? నువ్వసలు మా గూడెం దాని వేనా? "

అప్పటి వరకూ కూర్చుని ఆలకిస్తున్న వాడల్లా తారాజువ్వలా ప్రసాద్ వైపు దూసు కొచ్చాడు రాజు. అతని చొక్కా పట్టుకుని వూపేస్తూ,

"అప్పుడు నువ్వుమాత్రం ఏంజేశావేం? పేద్ద పోటుగాడిలా అక్కని అడుగుతుం డావే? యాకోబుగాడు పోతాపోతా నీ నడుం పట్టుకుని ఆ వజాన ఎంత ఏడ్సాడ్రా! కుఱ్ఱోళ్ళంతా నీ చుట్టూతానే ఉన్నారా? నువు 'వూ' అను పెసాదూ! అని ఎంత సేపు బతి మలాడాడ్రా! రాయి మాదిరిగా అట్టాగే నిం చున్నావు.. పోలీసోడికి భయపడ్డావు. నువ్వేంట్రా మొనగోడిలా అక్కకి చెప్పొ చ్చావు" పేలడానికి సిద్ధంగా ఉన్న అగ్ని పర్వతంలా కుతకుతలాడిపోతున్నాడు రాజు.

మనసులో వున్నది బైట పడగానే అక్కడ నిల్చోలేక పోయాడు. ప్రసాద్‌ని విసురుగా తోసేసి గబగబా అడుగులు వేస్తూ పొలం గట్లకి అడ్డం పడి ఎటో నడుచుకుంటూ పోయాడు.

ప్రసాద్‌లో అంత ఆవేశమూ చల్లారి పోయింది. నిట్టూరుస్తూ నులక మంచంలో కూలబడ్డాడు.

"ఈ అయిదేళ్ళలో అడిగినోడే తప్ప అడ గనోడులేడు. 'ఏరా పెసాదూ' చేతులు ముడుసుకు కూకున్నావేంటిరా! అని చివరికి ఈ రాజుగాడు మూలమూల దాక్కుంటూ ఉండేవాడు. ఈడిలో ఎంత పౌరుషమో చూశావా? "

"మరి... మరి... ఎందుకు మౌనంగా ఉండిపోయావ్? " అర్థం కానట్లు అడిగింది సుజాత.

నమ్మలేనట్లు చూశాడు ప్రసాద్...

"నిజంగా మర్చిపోయావా? " లేచి నిల బడి అడిగాడు.

"ఏ విషయం? " గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ అడిగింది.

"ఆ రోజు రైలు కట్టకాడ రైలెక్కుతూ ఏ మన్నావ్? "

గుర్తొచ్చింది సుజాతకి.

"ప్రసాదూ! గూడెం జాగ్రత్త! నువ్వూ జాగ్రత్త. నేను మళ్ళీ వస్తా! అప్పటి వరకూ ఆవేశం వద్దు. ఏం జరిగినా చూస్తా వూరుకో నువ్వొక్కడివీ ఏం చేయలేవు. నాకు మాటివ్వు" కలలో వున్న దానిలా వల్లించింది సుజాత.

"అవును. అక్షరం పొల్లుబోకుండా నువ్వు చెప్పింది నిజం. నీ మాటకి కట్టుబడ్డా! నువ్వొత్తావని నాకు నమ్మకం. అందుకే ఇన్నేళ్ళూ చీమూనెత్తురూ లేనోడిలా గడిపా!

నువ్వొచ్చి యిన్ని గంటలు దాటినా నోరి ప్పవు. నా రక్తం మరిగిపోతోంది" నిష్టూ రంగా అన్నాడు.

"నేను ఆవేశం వద్దన్నా గానీ ఏ పనీ చెయ్యొద్దన్నానా? " "అంటే? ? ? "

"ఏవుందీ? ముందు నీకు నువ్వు ఎదగ డానికి ప్రయత్నించలేదు. ఇదివరకు కూలికి వెళ్ళేవాడివి. మహా అయితే యిపుడు కూలీ లకి మేస్త్రీవి అయ్యావు. బాగానే ఎదిగావు" వ్యంగ్యంగా అంది.

చేతిలో వున్న కర్ర ముక్కల్ని విసిరికొ ట్టాడు.

"ఈ బతుకు ఎందుకు? నా కోసమేనా? నా ఒక్కడి కోసమేనా? అయితే అట్టాంటి ఎదవ బతుకు నాకక్కర లేదు. నాకు నేను గొప్పోడినైపోయి ఏం బాముకోవాలి? " నిర సనగా అన్నాడు.

"నిజమే! నువ్వు చెప్పిందీ బాగానే ఉంది. నీ కోసమే అయితే అది స్వార్థమే. కానీ యితరుల కోసం నువ్వు బతికేటపుడు నీ వ్యక్తిత్వంలో ఏ లోపమూ లేకుండా చూసు కోవాలి కదా! నీ చుట్టూవారికోసం నువ్వే మైనా చెయ్యాలనుకున్నపుడు అది తప్పో ఒప్పో నీకు తెలిసి వుండాలి. అంతేకాదు 'ఆర్థిక భద్రత' మన ముందున్న ప్రధాన లక్ష్యం. మంచి తిండి తినాలి. శుభ్రమైన బట్టకట్టాలి. ఏ మాయదారి రోగమో వస్తే మందులకి కూడా డబ్బులు లేక విలవిల్లా డాల్సి వస్తే ఏం జన్మ అది. అందుకే ముందు నువ్వు ఆ స్థాయికి వెళ్ళు. నీకింకా సహనం వుందీ అనుకుంటే నీ చేతులు సాగి నంత వరకూ యితరులని అక్కున చేర్చుకో డానికి ప్రయత్నించు"

అర్థం చేసుకోవడానికన్నట్లు కాసేపు మౌనంగా వున్నాడు. "ఏమో! స్వార్థంలాగే అన్పిస్తోంది" మెల్లగా అన్నాడు. కానీ ఆ మాటలో అంత బలం లేదు.

"కొంచెం ఆలోచించి చూడు 'మీరు మారండి' అని చెపితే ఎవరూ వినరు. అదేదో నువ్వే మారి చూపించు. వంద మంది నిన్ను ఆదర్శంగా తీసుకుంటారు"

"సరే! నువ్వెట్టా చెపితే అట్టాగే! నీ పని కోసం ఉపయోగించుకో! బలాన్ని ఉపయో గించి మనం అనుకున్నది సాధించడానికి యింకా రాతియుగంలో వున్నామా? ..." చురుగ్గా ప్రసన్నంగా నవ్వుతూ అన్నాడు..

మర్నాడు చెయ్యాల్సిన పని గురించి మాట్లాడుకున్నారు. అందులో లోటుపాట్లు క్షుణ్ణంగా చర్చించారు. ఆమె ప్రణాళిక అంతా అర్థమయ్యాక అన్పించింది సుజాత ఆషామాషీగా యిక్కడికి రాలేదూ అని.

"తీగ లాగడానికి రంగం సిద్ధమయింది. డొంకంతా ఎలా కదులుతుందో చూడాలి" తమాషాగా అన్నాడు.

"నువ్విందాక అన్నావు స్వార్థమని. అది ఎన్నటికీ కాదు! ఇది మన పోరాటానికి నాంది. చూస్తుండు. ఊరంతా గగ్గోలెత్తిపో తుంది. కానీ మనకి ఒకటే ఆయుధం. శాంతి అంటే చేతులు ముడుచుకు కూర్చో మని కాదు. మన పని మనం చేసుకు పోదాం. ఎవరు అడ్డొచ్చినా చలించొద్దు. నీతిగా న్యాయంగా బతుకుదాం"

ప్రసాద్‌కి కొత్తగా ఉంది. వింతగా ఉంది. సుజాత వెళ్ళిన దగ్గరనుండీ అతనేవేవో ఊహించాడు. ఈ ఆరేళ్ళలో సుజాత రుద్ర కాళికలా మారి పెద్ద బలగంతో వచ్చిపడి తమకి అన్యాయం చేసిన వాళ్ళందరినీ నరికేస్తుందనీ, లేదా సినిమాల్లో చూపించి నట్లు అయ్యేయస్ చదివి కలెక్టరయి ఈ ఊరికి వస్తుందనీ. ఏవో కలలు. అందరూ యిలాగే ఊహించారు.

ఇన్నేళ్ళూ సుజాత ఏం చేసిందో ఎలా బతికిందో ఎవరికీ తెలీదు.

తెలుసుకోవాలన్న కుతూహలం నుంచి తప్పించుకోలేకపోయాడు ప్రసాద్.

"సుజీ! నువ్వు ఇన్నాళ్ళూ" అర్థోక్తిలో ఆపాడు. లేచి నిలబడింది సుజాత.

"ప్రసాద్! రేపు కలుద్దాం. నేను

చెప్పినవన్నీ గుర్తున్నాయిగా!"మామూలుగా చెప్పింది.

చిన్నగా నిటూర్చి లేచాడు.

★ ★ ★

సుజాత, ప్రసాద్, అతనితోటి వాళ్ళు మోహన్, ప్రకాశం, సుజాత పక్కింటి అమ్మాయి సురేఖ అయిదుగురు కలిసి ఊరివైపు అడుగులేస్తుంటే గూడెంలో అందరూ ఎక్కడి వాళ్ళక్కడ రేఖా చిత్రాల మాదిరి నిలబడిపోయారు. గాలి కూడా స్తంభించిపోయింది.

చర్చి గట్టు మీద కూర్చున్న ముసలయ్యా మాత్రం కళ్ళు చిట్లించి చూస్తూ, బోసి నోరు ఆడిస్తూ



"యాడికిరా కుర్రోళ్ళంతా బోతన్నారు? " అడిగాడు.

"యాడికోలేరా! ఈడికన్నీ అజలు!" ప్రకాశం విసుక్కున్నాడు.

"ఉలకరేరా! ఈళ్ళ గాళ్ళు బూమ్మీద లేవు" గొణుక్కుంటున్నాడు ముసలయ్యా.

సుజాత ఆగి అతని దగ్గరికి వెళ్ళింది.

"ఎవురే నువ్వు? " ఆనవాలు పట్టలేక అడిగాడు.

"నేను సుజాతని"

"ఆ! సుజాతా? వొచ్చావా? జాగరత్త! అందరూ కాసుకొని ఉండారు. ఏడికి పడితే ఆడికి తిరగమాకు. ఏపని గావాలన్నా ఆ బండోడికి చెప్పు" ప్రసాద్‌ని చూపిస్తూ అన్నాడు. గలగలా నవ్వింది సుజాత. ప్రసాద్‌కి ఎక్కడలేని రోషమూ వచ్చింది.

గబగబా వచ్చి ముసలయ్యాని ఒంటిచేత్తో పైకెత్తేసి 'ఇదుగో! ఎపుడూ బండోడు గట్టా మాట్టాడకు. పై నుంచి పైకే పంపేత్తాను" బెదిరించాడు.

లబలబలాడాడు ముసలయ్యా. అందరూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతున్నారు.

"ఏంటది ప్రసాద్? తాతని దించు" చిరుకోపంతో అంది సుజాత

"ఇది మా సరసంలే! సుజీ! నువ్వూరుకో!" తేలిగ్గా అన్నాడు ప్రసాద్!

"వారి నీ సరసం మండా! దించరా! నడుములు యిరిగి పోతన్నాయి" గోలపెట్టాడు.

పదిలంగా దించి గట్టు మీద కూర్చోబెట్టి "ఇంకెపుడూ నాతో పెట్టుకోబాక" బెదిరించి కదిలాడు.

"అమ్మో! ఈడు బండోడు గాదని ఎవురంటర్రా!" అని ముసలయ్యా గొణగడం విని సుజాతకీ నవ్వొచ్చింది.

గూడెం దాటి ఊళ్ళో అడుగు పెట్టగానే గుమ్మంలోంచీ, కిటికీల్లోంచీ ఆడవాళ్ళు తొంగి చూడసాగారు. రోడ్డు మీద వెళ్తున్న మగాళ్ళు ఓ క్షణం ఆగి వీళ్ళవంక చూసి వెళ్తున్నారు. వాళ్ళ చూపుల్లో కోపం, కసి, హేళన.

సుజాత ముందే హెచ్చరించడం వల్ల ఎవరూ మాట్లాడకుండా ధీమాగా నడుస్తున్నారు.

సరాసరి పంచాయితీ ఆఫీసు ముందుకి వెళ్ళి ఆగారు. ఒకరి మొహాలు మరొకరు చూసుకున్నారు. చూపుల్లోనే ధైర్యం ప్రసారం గావింపబడింది.

ముందుగా ప్రసాద్ లోనికడుగేశాడు. వెనకాల అందరూ నిశ్శబ్దంగా నడిచారు.

పంచాయితీ మీటింగులు లేకపోవడంతో ఆఫీసు ఖాళీగా ఉంది. గుమాస్తా ఒకడే కాగితాల్లో తలదూర్చి కూర్చున్నాడు.

"ఏవయ్యా!" ప్రసాద్ పిలిచాడు.

తలెత్తి చూశాడు గుమాస్తా. ఎగాదిగా పరిశీలించి "ఏరోయ్! పిలుపు మారింది" ఎకసెక్కెంగా అన్నాడు.

"సంతోషించవయ్యా! నువ్వు 'ఏరోయ్'! అంటే మేం 'ఏవయ్యా' అనైనా అంటున్నాం" అన్నాడు మోహన్.

"ఆ! యింతవరకొచ్చిందీ కథ" అంటూ ప్రసాద్ పక్కన ఉన్న సుజాతని చూసి "ఈ పిల్ల ఎవరూ? " అంటూనే గుర్తుపట్టేసి పక్కలో పాముని చూసినట్లు ఉలిక్కిపడ్డాడు.

గాభరాగా తలతిప్పేసి.

"ఆ!... ఆ!... ఏం పని? చెప్పండి" కంగారుగా అన్నాడు.

ఎంతతొందరగా వాళ్ళని వదిలించుకుంటే అంత మంచిదన్నట్లు వుంది వాలకం.

"పి. యమ్. ఆర్. వై. లోను అప్లయ్ చెయ్యడానికి వచ్చాం."

"ఏంటీ? " తనకి సరిగ్గా వినబడలేదన్నట్లు అడిగాడు.

"ప్రధానమంత్రి రోజ్‌గార్‌యోజన మేం అయిదుగురం ఒక గ్రూప్ డెయిరీఫాం పెట్టుకుంటున్నాం. ఇదుగోండి అప్లికేషన్" సుజాత అందించింది.

పైనుంచి కిందకి విచిత్రంగా దాన్ని పరిశీలించాడు.

"దీన్లో ఎన్ని రూల్సున్నాయో తెలుసా? అయినా మీ మొహాలు మీకు వీటి గురించేం తెలుసు? వాయిదా కట్టకపోతే బొక్కలో తోస్తారు. యియ్యన్నీ మీ వల్ల గాదుకానీ ఆ కూలిపనులేవో చేసుకుని హాయిగా వుండక ఎందుకొచ్చిన తిప్పలు? " అన్నాడు.

వింటున్న అందరికీ గుమాస్తా అసలు ధోరణి అర్థమైంది

"మేం మీ సలహా అడగలేదండీ అప్లికేషన్ పెట్టాం. త్వరగా ఫార్వార్డ్ చెయ్యండి. మీ డ్యూటీ అంత వరకే!" సుజాత సూటిగా చెప్పింది.

"సరేనమ్మా! నాదేం బోయిందీ? దీని మీద ప్రెసిడెంటుగారి సంతకం ఉండాలి. పెట్టించుకురండి" అప్లికేషన్ ప్రసాద్ చేతికి ఇచ్చాడు గుమాస్తా. అతని పెదాల మీద పైశాచికమైన నవ్వు.

అందరూ మౌనంగా సుజాత వంక చూశారు. నెమ్మదిగా తల పంకించింది.

ఇంతలో "ఎవర్రా అలికిడి" ఓ కంఠం ఉరుములా ధ్వనించింది.

"అయ్యా! గూడెపోళ్ళు వచ్చారు. లోన్లు గావాలంట" ఇక్కడ నుంచే చెప్పాడు.

"అంత ధైర్యం ఎవరికిరా వచ్చింది" లోపలి నుండి బైటకి అడుగేశాడు సర్పంచి సుదర్శనరావు. అతనికి ముందుగా కన్పించింది సుజాత.

వెంటనే ఆగిపోయాడు. ఆతర్వాత అతని కనుబొమలు వ్యంగ్యంగా పైకి లేచాయి.

"ఓ! వచ్చావా? నిన్న ఊరంతా గుప్పుమంటే ఏంటో అనుకున్నాను. బాగానే తయారయ్యావే!" పరిశీలనగా ఆమెను చూస్తూ అన్నాడు.

భావరహితంగా నిలబడింది సుజాత. ప్రసాద్‌కు గుండెలు మండిపోతున్నాయి. ఛాన్స్ దొరికితే చీల్చిచెండాడేటట్లు చూస్తున్నాడు.

"మేం లోన్‌కి అప్లయ్ చేశాం. మీరు సంతకాలు పెట్టాలి" శాంతంగా అంది సుజాత.

"సంతకమేగా పెడతాను ఒరే గుమాస్తా! కాయితాలన్నీ జూడరా! సరింగా ఉన్నయా!" మాట వేరొకరికి చెప్పినా చూపు సుజాత ఒంటిమీదే వుంది. పైటచీల్చుకుని అతని చూపులు ఎక్కడో తారట్లాడుతున్నాయి.

అన్నీ గమనిస్తూనే వుంది సుజాత. ఆ చూపు సోకిన చోటల్లా శరీరం భగ్గుమం

**మెదడుకు చదువు ఎంతో శరీరానికి వ్యాయామం అంతే.**

**– అడిసన్**

టోంది. మనసు ముడుచుకు పోతోంది. కానీ బుద్ధి శాంతాన్ని ఆశ్రయించింది. తనని కాదన్నట్లు నిల్చుంది.

ముళ్ళమీద నిలబడినట్లు వుంది ప్రసాద్‌కి, అస్థిమితంగా వుంది. ప్రెసిడెంట్ కళ్ళు పీకేయాలన్నట్లు వుంది. ఎంతకీ చూపు మరల్చడు సుదర్శనరావు... ఇకాగలేక పోయాడు ప్రసాద్.

"ఏందయ్యా! చూత్తున్నారు? " సుజాతకి అడ్డు వచ్చి దురుసుగా అడిగాడు.

"ఏంట్రోయ్! దానికి లేని సిగ్గు నీకు పొడుచుకు వచ్చింది. ఎవురికి కొత్త... ఊరందరి ముందూ..."

గాయం రేగింది బాగా.

ఉచితానుచితాలు మరిచేలా!

"రేయ్! ఏంట్రా వాగుతున్నావ్? నీకింత బులపాటంగా ఉంటే నీ పెళ్ళాన్ని పంపు ఈధిలోకి దాన్ని నిలబెట్టి జూసుకో! కావాలంటే మేమూ వచ్చి చూత్తాం" ప్రసాద్ వెర్రెక్కి అరిచాడు.

ఊహించని ఈ సంఘటనకి అంతా నిశ్చేష్టులయ్యారు. గుమాస్తా నిలువు గుడ్లేసుకుని ప్రసాద్ వంక చూశాడు. మోహన్, ప్రకాశం ఆందోళనగా సుజాత వంక చూశారు.

చూస్తుండగానే సుదర్శనరావు కళ్ళు ఎర్రబడి పోయాయి. మనిషి నిలువునా వణుకుతున్నాడు. అతను ఊహించని దెబ్బ అది. అనడమే తప్ప అనిపించుకోవడం తెలియని మనిషి కావడంతో ఒక్క నిమిషం చేష్టలు దక్కి నిల్చుండిపోయాడు.

తర్వాత పోట్లగిత్తలా దూసుకు వచ్చి ప్రసాద్ మీద పడ్డాడు. విసిరి కొట్టాడు ప్రసాద్... వెళ్ళి మూలన పడ్డాడు సుదర్శనరావు.

"ఇంత కాలం మీరుకొడితే పడుంది చేతకాక కాదు. మేమూ కొట్టొచ్చని తెలీక. యిక ముందెపుడూ నోరూ, చెయ్యీ పారేసుకోవద్దు. మర్యాద దక్కదు. యిక అప్లికేషన్ మీద సంతకం పెడతారా సరి. లేదంటే ఊరు దాటి వెళ్ళి తేల్చుకుంటా" చరచరా బైటకి నడిచాడు. మిగతా నలుగురూ అనుసరించారు.

సుజాత మొహంలో రేఖామాత్రంగా అసంతృప్తి.

★ ★ ★

"ఏంటి సర్పంచి గారూ! ఏదో విశేషం జరిగిందంట. కాస్త మా చెవిలో కూడా వెయ్యకూడదా? " కరణం గోవిందశాస్త్రి ముసిముసిగా నవ్వుతూ అన్నాడు. పక్కనే వున్న భూషణం, రామస్వామి, మున్సబు గారి అబ్బాయి పార్థసారథి కూడా కిసుక్కున నవ్వారు.

వాలు కుర్చీలో కూర్చున్న సుదర్శనం మాట్లాడలేదు. కళ్ళు మాత్రం అగ్నిగోళాల్లా భగభగ మండుతున్నాయి. వాటికి కొనసాగింపా అన్నట్లు తాగుతున్న సిగరెట్ కొన ఎర్రగా వెలుగుతోంది.

"అవతల కొంపలంటుకు పోయేలా ఉంటే ఇక్కడ అయ్యగారు తాపీగా పొగ పీలుస్తూ కూర్చున్నారేంటండీ!" గుమాస్తా జగన్నాథం ఆందోళనగా అన్నాడు.

"ఎవురి కొంపల్రా అంటుకుపోయేది? " గర్జించాడు సుదర్శనం.

"ఎవరివో అయితే మనకేంటండీ బాధ. ఉదయం ఫార్సు చూసికూడా నిమ్మకి నీరెత్తినట్లు కూర్చున్నారు"

"ఏంటి జగన్నాథం? నువ్వా సర్పంచి గారూ అంత హైరానా పడిపోతున్నారు? ఏం జరిగింది? " భూషణం అడిగాడు.

"ఏం జెప్పమంటార్లెండి మళ్ళీ గడ్డుకాలం దాపురించేలా వుంది. వచ్చిందిగా మహాతల్లి. ఊళ్ళో దిగి ఇరవైనాలుగు గంటలైందో లేదో మందని పోగేసుకుని వచ్చింది. లోన్లు గావాలంట"

అందరూ ఉలిక్కిపడ్డారు.

"ఆ! లోన్లా! వాటి మీద పడిందా ఆళ్ళ

కన్ను" ఆందోళనగా అన్నాడు పార్థసారథి.

"అసలు నోరెత్తి అడగాలన్న తెగింపు ఎలా వచ్చిందిరా!" ఆశ్చర్యంగా అడిగాడు భూషణం.

"మరి అదే గదా చెప్పేది. ఏదో పంతం తోనే ఊళ్ళో దిగింది. గూడేన్నంతా గుప్పిట్లో పెట్టేసుకుంటది. ఇక లోన్లే గాదు. ఎన్నెన్ని జరుగుతాయో చూడండి" జగన్నాథం అన్నాడు.

అందరూ ఆలోచనలో పడిపోయారు. "ఏం చేద్దామంటారు? " గోవిందశాస్త్రి జనాం తికంగా అన్నాడు.

"చేసేదేముంది సర్పంచి గారు ఆ కాయి తాల మీద సంతకాలు పెట్టేయడమే!"

"సంతకాలు పెట్టినా లోను శాంక్షన్ గావద్దా! గూడెం వాళ్ళ లోన్లన్నీ మాయజేసి మనమే వాడేసుకున్నాం గదా!" పార్థసారథి అన్నాడు.

"అందుకే తిప్పలు" జగన్నాథం నీరసంగా అన్నాడు.

"ఎవ్వరికిరా తిప్పలు? తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు బెదరవు. అదే గాదు. దాని తల్లోని జేజమ్మ వచ్చినా మనల్నేం జేస్తుంది" ఉక్రో షంగా అరిచాడు సుదర్శనం.

"అదేం జేసిందో ఏం జేయగలదో మనం దరికీ తెలుసు. పౌరుషాలు మానేసి ఏం చెయ్యాలో మాట్లాడుకోవడం మంచిది" భూషణం శాంతంగా అన్నాడు.

"మాట్లాడేదేవుంది? ఈ సంవత్సరానికి ఇక లోన్లు ఎవురికీ రావు. అయిపోయా యని చెప్పేద్దాం"

"నమ్ముతారా? " సందేహంగా అన్నాడు రామస్వామి "నమ్మకపోతే నట్టేట్లో దూకమ నడమే. మన వైపు అంతా వేలిముద్రలతో సహా పక్కాగా వుంది. ఆ కాడికి ఏమొచ్చినా జూసుకోడానికి మన ఎమ్మెల్యే ఉన్నాడు" ధీమాగా అన్నాడు సుదర్శనం.

"నిజమే అనుకోండి. అయినా దాన్ని అంత తేలిగ్గా అంచనా వెయ్యొద్దు ఒకసారి దెబ్బతిని వున్నాం" భూషణం హెచ్చరికగా అన్నాడు.

"దాన్ని నేను అంత తొందరగా వదల నుగా. కిందటి సారి ఇచ్చిన డోసు సరిపో యినట్లు లేదు.. ఈసారి ఎటూ బెసకకుండా ఒడిసిపట్టేస్తా" మీసం దువ్వుతూ అన్నాడు సుదర్శనం.

"అబ్బ! ఏవందం? ఏవందం? తెల్లతా చులా మిడిసి పడతందనుకోండి... నేనపుడే అనుకున్నా... బాబు గారు ఒదిలిపెట్టరని" జగన్నాథం నవ్వుతూ అన్నాడు.

మిగతా అందరూ సుజాత గురించి విన డానికి ఆసక్తి ప్రదర్శించారు. తను చూసిన ఆమె ప్రతి కదలికనీ వైనవైనాలుగా వర్ణించు కుపోతున్నాడు జగన్నాథం. పైశాచిక ఆనం దంతో ఘోల్లున నవ్వుతూ వింటున్నారు.

సుజాతని తల్చుకుంటే సుదర్శనంలో మోహం, వాంఛ క్షణక్షణం పెరిగిపోతున్నట్ల నిపించింది.

ఇంతకాలం ఆమె కనిపిస్తే చాలు అడ్డంగా నరికేయాలనిపించే భావం ఇపుడు లేదు. ఆమెని చూడగానే పుట్టుకొచ్చిన వ్యామోహం నిమిషనిమిషానికీ పెరిగిపోతూ కొత్త ఊహల్ని కలిగిస్తోంది. ఆ ఊహల్ని నిజం చేసుకోవాలంటే చాలా ఓపిక ఉండాలి. నిట్టూర్చాడు సుదర్శనం.

అతనికి హఠాత్తుగా గుర్తొచ్చింది. తను సుజాతని చూస్తుంటే వచ్చి అడ్డంగా నిలబడి 'ఏందయ్యా జూత్తన్నారు? " అంటూ ఆ ప్రసాద్ గాడు అడిగాడు.. ఆ సమయంలో ఆడి మొహంలో ఎంత కసి? కక్ష తలుచు కుంటుంటే ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకి నట్లు ఉంది. ఆడికేంటో అంత యిది?

"ఇక మీ ఇష్టం సర్పంచి గారూ! మీరు ఏ నిర్ణయం తీసుకున్నా మా సపోర్ట్ వుంటుంది. మేమే గాదు ఊళ్ళో అంతా అండగా నిలబడతారు. దాన్ని ఓ పట్టు పట్టాల్సిందే! హమ్మో! ఎంత గుండెలు తీసిన బంటురా అది. వందలా, వేలా లక్షలు

లక్షలు నాశనమయ్యాయి. గుండె మండిపో తందనుకో అసలు ఈ వజాన నోర్మూసు కుని ఉండటవే నాకు నచ్చడం లేదు" భూషణం కోపంగా అన్నాడు.

"మనం వెతక్కుండానే పిట్ట సరాసరి వల దగ్గరికి వచ్చింది కదా! చూద్దాం. రెక్కల్లో సత్తువున్నంత వరకూ ఎగరనీ అపుడే ఆట మజాగా వుంటుంది" గుంభనగా నవ్వాడు సుదర్శనం.

★ ★ ★

"నాకిదేం నచ్చలేదు" ఆ నిశ్శబ్ద వాతావర ణంలో ఖంగున మోగింది సుజాత గొంతు.

గిరుక్కున తిరిగి చూశాడు ప్రసాద్. అతని మొహంలో కోపం తాండవమాడు తోంది. మనిషి అస్థిమితంగా కదులుతు న్నాడు.. తప్పనిసరిగా చెయ్యాల్సిన పనిని సగంలో వదిలి వచ్చేసినట్లుంది.

మోహన్, ప్రకాశం ప్రశ్నార్థకంగా చూశారు.

"తప్పు చేసింది సర్పంచ్. వాళ్ళావిడ గురించి ఎందుకు నీచంగా మాట్లాడావు? అంటే ఎక్కడ ఎవరు గొడవపడినా మీరు మీరు బాగానే వుంటారు కానీ మీ పెళ్ళాలో, తల్లులో, చెల్లెళ్ళో బలవ్వాలన్న మాట" ఆవే దనగా వుందామె స్వరం.

ఆలోచనలో పడ్డాడు ప్రసాద్..

"అందుకే ఆవేశం పనికి రాదు. అలా రియాక్టవకుండా వుండాల్సింది" అంది సుజాత.

సర్రున కోపం మళ్ళీ ఎగసింది ప్రసాద్‌కి. కర్ర నేలకేసి కొట్టి లేచి నిలబడ్డాడు. "ఆడు నిన్ను ఎట్టా చూశాడో గుర్తుందా? ఇంకో నిమిషం ఉంటే వాడి కళ్ళు పీకేసే వాడిని ఆడికి ఎంత ధైర్యం, లేకపోతే అలా జూశాడు! నాకు రక్తం సలసలా మరుగు తోంది" పిడికిళ్ళు బిగించి పళ్ళు నూరుతూ అన్నాడు.

వింతగా చూసింది సుజాత.

"అసలు నాకే అంత ఆవేశం రాలేదు" అర్థోక్తిలో అంది. "ఎవరి సంగతీ నాకనవ సరం. సుజీ వంటి మీద చెయ్యే కాదు చూపు పడినా సహించేది లేదు" చరచరా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

మోహన్, ప్రకాశం నవ్వుకుంటున్నారు. అర్థంకానట్లు చూసింది సుజాత. ఎవరూ ఆమెకి విడమర్చి చెప్పే ధైర్యం చెయ్యలేకపో యారు...

సర్పంచి సంతకాలు పెట్టాడో లేదో తెల్సు కోడానికి మర్నాడుదయం మళ్ళీ బయలుదే రారు.

"నువ్వు మళ్ళీ అక్కడ గొడవ పెట్టేట్టయితే రావొద్దు" తెగేసి చెప్పింది సుజాత.

"కావాలని గొడవ పెట్టుకోవడం నాకే మన్న సరదానా? అక్కడెవరన్నా ఎదవ వేషం వేస్తే మాత్రం చేతులు కట్టుకుని కూర్చోవడం కల్ల"

మౌనం వహించింది సుజాత. ప్రసాద్ రెండుమూడు సార్లు కదిలించినా మాట్లాడ లేదు.

"ఈ అలగడాలూ, అప్పటికీ, ఇప్పటికీ పోలేదు. సరే. ఎవరేవన్నా మీసం లేనో డిలా నోరు మూసుకుంటాలే! మామూలుగా వుండు" ఉక్రోషంగా అన్నాడు ప్రసాద్.

కిసుక్కున నవ్వింది సురేఖ.

"ఇదొకటి దీని పళ్ళెపుడూ బయటే" ఆమె తలమీద మొట్టి అన్నాడు. అందరూ నవ్వుతూ సాగారు.

వెళ్ళగానే గుమాస్తా 'రండి! రండి!' అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

వ్యంగ్యంగా కళ్ళెగరేస్తూ పెదాలు వంక రగా పెట్టి నవ్వుతూ అతని దగ్గరికి వెళ్ళాడు ప్రసాద్. అతని యాక్షన్‌కి సురేఖకీ, మోహ న్‌కీ, ప్రకాశానికీ విపరీతంగా నవ్వొచ్చింది. కానీ సుజాతని చూసి, గంభీరంగా మొహాలు పెట్టడానికి ప్రయత్నిస్తూ నిల్చు న్నారు.

వీళ్ళ తతంగం చూసి జగన్నాథానికి



ఒంటికి కారం పూసుకున్నట్లు వుంది.

"సంతకాలు అయ్యాయా? " ప్రసాద్ అడిగాడు. 'పోరా పిల్లకాకి' అన్నట్లు ఎగాదిగా అతనివైపు చూసి సుజాత వైపు తిరిగి

"మనూరికి శాంక్షన్ చేసిన లోన్లన్నీ పూర్తయిపోయాయి. ఇక ఈ సంవత్సరానికి లేనట్లే? మీ గూడెం వాళ్ళకి కూడా అయిదారు లోన్లు వచ్చాయి" చావు కబురు చల్లగా చెప్పాడు.

"గూడెంలో వాళ్ళు లోన్లతో ఏం వ్యాపారాలు చేస్తున్నారు? " ఆశ్చర్యంగా మోహన్ వైపు చూసింది. అతనూ పెదవి విరిచాడు. అందరూ కాసేపు తీక్షణంగా ఆలోచించారు.

"నాకు తెలిసి మా గూడెంలో వాళ్ళకి లోన్లేవీ రాలా!" బల్ల గుద్ది చెప్పాడు ప్రసాద్.

ఆ తాకిడికి ఎగురుతున్న ఫైళ్ళని గట్టిగా పట్టుకుని "ఓరి వీడి జబర్దస్తీ మండా!" కసిగా తిట్టుకుంటూ,

"నీకు తెలీనంత మాత్రానా నిజాలు నిజాలు కాకుండా పోతాయా? "

"మీరు మా వాళ్ళకి లోన్లు యిచ్చినట్లు ఏంటి ఆధారాలు? " ప్రకాశం అడిగాడు.

"మీకు నేనసలు సమాధానం చెప్పక్కరలేదురా! కానీ ఎదో ఇరగబడతున్నారుగా! చూడండి" బీరువాలో ఫైళ్ళు తీసి చూపించాడు.

ఛైర్‌లో కూర్చొని అన్నీ పరిశీలించింది. గూడెంలో అయిదు గ్రూపుల వాళ్ళు కిరాణా కొట్టు, పిండిమిల్లు, సుద్దముక్కల తయారీ, గొర్రెల పెంపకం, బొమ్మల తయారీ కింద

**మహాత్ములు మనోబలాన్ని కలిగి ఉంటారు. దుర్బల మనుషులు కోరికలను మాత్రమే కలిగి ఉంటారు.** - పంచతంత్రం

లోను తీసుకున్నట్లు పేర్లతో సహా ఆ ఫైల్‌లో ఉంది. పేర్ల దగ్గర వేలిముద్రలు వున్నాయి. వేలిముద్రల దగ్గర అనుమానం వచ్చింది ప్రసాద్‌కి.

"ఇవి మా వాళ్ళవే అని ఏంటి నమ్మకం? " నిలదీసి అడిగాడు.

"ఓరి నీ అనుమానం తగలెయ్యా! ఏలి ముద్రలు సరిపోకపోతే మేం ఊచలు లెక్క బెట్టాలిరా!..." మనసులో ఆశ్చర్యపోతూనే పైకి తిట్టాడు.

"సరే! ప్రకాశం! ఈ పేర్లన్నీ నోట్ చేసుకో! మనవాళ్ళు ఈ వ్యాపారాలు ఎక్కడ చేస్తున్నారో చూద్దాం."

అమ్మో! ఇదేదో కొంపమీదికి వచ్చే వ్యవ హారంలా వుందే! గింజుకుపోతున్న జగ న్నాథం పైకి మేకపోతు గాంభీర్యం నటిస్తూ ఉండిపోయాడు.

"లోన్లకని అవీ ఇవీ చూపించి డబ్బులా గారు. తర్వాత అన్నీ అమ్మేసుకుని ఆ డబ్బుతో వడ్డీ వ్యాపారం చేస్తున్నారు. మీ వాళ్ళు" రహస్యంగా చెప్పాడు జగన్నాథం.

"వడ్డీ వ్యాపారమా? " ఆశ్చర్యంగా అంది సుజాత. "రెక్కాడితే గానీ డొక్కాడని స్థితి మాది. మాకు వడ్డీ వ్యాపారాలా? ఏవయ్యా వంటి మీద తెలివుండే మాట్లాడుతు న్నావా? " ప్రసాద్ విసురుగా అన్నాడు.

పరిస్థితి విషమించేలా ఉందని గమనిం చింది సుజాత "ప్రసాద్! పదండి. ముందు మనవాళ్ళని అడిగాక మిగతా వివరాలు తెలుసుకుందాం" సుజాత బయల్దేర దీసింది.

తల వంచుకుని నడుస్తున్న సుజాత ఎదు రుగా పెద్ద పర్వతాన్ని ఢీకొన్నట్లుగా ఆగిపో యింది.

ఎదురుగా సుదర్శనరావు.

పెద్దపులిని చూస్తే కలిగే ఒకలాంటి తడ బాటు.

ఒక అడవిలో ఎవరూ లేని సమయంలో జాతి వన్నె పులి ఎదురైతే ఎలాంటి ఫీలింగ్ కలుగుతుంది? ... సమ్మోహనపరిచే దాని సౌందర్యం, మీదపడి తినేస్తుందన్న భయం ఏకకాలంలో కలిగి మనల్ని చకితుల్ని చేస్తాయి.

ముప్ఫయిఅయిదేళ్ళ అతని దృఢ శరీరం యావత్తూ క్రూరమయిన అందంతో నిండి ఉంటుంది. అతని అందానికో, డబ్బుకో లొంగిపోయే ఆడవాళ్ళూ కొంతమంది అత నిలో అతిశయాన్ని మరింత పెంచారు.

సుజాతని చూడగానే అతని చూపులు మారిపోయాయి. కళ్ళు కాంక్షని నింపుకు న్నాయి. అణువణువూ ఎప్పుడెప్పుడు ఆ అందాన్ని సొంతం చేసుకోవాలా అన్నట్లు ఆత్రపడసాగింది. ఆమె తనని గుద్దినచోట చేత్తో తడిమాడు. కంపరంగా తల తిప్పు కుంది సుజాత. అవేమీ పట్టించుకోలేదు సుదర్శనరావు. ఆమె వైపే చూస్తున్నాడు.

'ఛ! పశువు నయం' గట్టిగానే గొణుగుతూ కదిలింది సుజాత.

విచిత్రంగా అతనికేమి రోషం రాలేదు. మెలితిరిగిన మీసాల చాటున నవ్వొకటి కద లాడింది. ఛాతీని తడుముకుంటూ ఆమె కనుమరుగయ్యేంత వరకూ చూస్తూనే వున్నాడు.

★ ★ ★

పంచాయితీ ఆఫీసు దగ్గరనుండి సరాసరి మిషనరీ స్కూలు ఆవరణ దగ్గరికి చేరారు ఐదుగురూ. సుజాత చెప్పిన పేర్లు గల వాళ్ళని పిలవడానికి వెళ్ళాడు మోహన్. నలుగురు మాత్రం దొరికారు. మిగతా వాళ్ళు కూలికెళ్ళారు. వీళ్ళు సమావేశం కావడం చూసి ఇంకో ఇరవైమంది వరకూ పోగయ్యారు.

జగన్నాథం చెప్పిన లిస్ట్ చదివి 'వీళ్ళలో ఎవరయినా లోన్లు తీసుకుని వ్యాపారాలు పెట్టుకున్నారా' అని అడిగింది సుజాత. ఎవరూ లేదన్నారు. ఎంత నొక్కించి అడి గినా లేదనే సమాధానం వచ్చింది.

'అయితే వేలి ముద్రల దగ్గర మతలబు

జరిగింది. లం.... కొడుకులు... నిలువునా ముంచేస్తున్నారు. ఈసారి ఎట్టాగయినా ఒక్కొక్కడి పనీ పట్టాల్సిందే' వీరంగం ఆడేస్తున్నాడు ప్రసాద్.

కోపాన్నీ, అసహనాన్నీ కంట్రోల్ చేసుకుంది సుజాత. సీరియస్‌గా చూసింది. కొంచెం తగ్గాడు వెంటనే మళ్ళీ బాధనిపించింది సుజాతకి.

ప్రసాద్ అయినదానికీ కానిదానికీ ఆవేశపడిపోవడం తను సీరియస్ అవ్వడం. అతను వెంటనే తగ్గిపోవడం చూస్తుంటే తనేదో అతన్ని ఆడించేస్తున్నట్లుగా వుంది. ఎంత చెప్పినా అర్థం చేసుకోని మొండితనం మనిషిలో ఎక్కువ. విసుగ్గా అనుకుంది.

అన్నివైపుల నుంచీ ప్రశ్నించడం ప్రారంభించింది సుజాత. చివరికి ఒకతను ఏదో చెప్పాలనుకుని తటపటాయించడం చూసింది సుజాత.

"ఏంటి చిన్నయ్యా! ఏవన్నా చెపుతావా? " మృదువుగా అడిగింది.

"ఏం లేదమ్మా! గానీ మొన్నామద్దెన గవర్నమెంటోళ్ళు పేదోళ్ళకోసం డబ్బులు ఇచ్చారని మాకు ఇరవై మందికి వందేసి చొప్పున పంచిపెట్టారు. అపుడు ఏలిముద్రలు కూడా ఏశాం" తప్పు చేసినట్లు చెప్పాడు.

హతాశురాలయినట్లు చూసింది. ఉచ్చు వీళ్ళ చుట్టూ ఎంత బాగా బిగించారో అర్థమయింది.

"ఇదంతా ఎపుడురా? మాకు మాట మాత్రమైనా చెప్పలేదు" ప్రసాద్ నోరావళించి అడిగాడు.

"నీకు చెప్పొద్దన్నార్రా! చెపితే పడనివ్వవని అన్నారు" నసిగాడతను.

"ఈ మధ్య అధికార్లు ఎవరన్నా వచ్చారా? " ఆత్రంగా అడిగింది.

"ఆ! ఆ మద్దెన ఓ పాలి వచ్చినట్టున్నారు. మా గొట్టెలు నాలుగు కాత్తంత స్తలం చూపించమంటే చూపించాను. ఏవో రాసుకుని వెళ్ళిపోయారు"

అందరికీ విషయం అర్థమయింది. పక్కాగా గూడెం వాళ్ళని నోరెత్తనివ్వకుండా యిరికేంచేశారు.

అడిగితే దొరికిపోయేది వీళ్ళే

ఎంత అమాయకులు వీళ్ళు తమ పేరుతో, తమ అభివృద్ధి పేరుతో ఎంతెంత రాజకీయం జరుగుతుందో తెలుసుకోలేక పోతున్నారు. వంద రూపాయలకు కక్కుర్తిపడి తమ ఎదుగుదలని తామే నాశనం చేసుకుంటున్నారు.

"ఏం చేద్దాం మరి? " ఆరాటంగా అడిగాడు ప్రసాద్.

"ఇపుడు ఏం చేయాలన్నా దొరికిపోయేది మనవాళ్ళే! మనం వెళ్ళి గొడవ పెట్టుకుంటే నష్టమే తప్ప లాభం ఏమీ లేదు. ఇప్పటి వరకూ లోన్లకి వాయిదాలు వాళ్ళే కడుతూ వుండొచ్చు. మనం గట్టిగా మాట్లాడితే ఆ వాయిదాలు వాళ్ళు కట్టడం మానేస్తారు. అవి వీళ్ళ పీకకి చుట్టుకుంటాయి" సాలోచనగా అంది.

ఇన్నాళ్ళుగా తామెంత మోసపోతున్నారో అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్లుగా అర్థమైంది.

"కాస్తంత ఆలోచించి నిర్ణయం తీసుకుందాం" సుజాత లేచింది. అందరూ గుసగుస లాడుకుంటూ కదిలారు.

★ ★ ★

మరియమ్మ, ఏసుపాదం రెండు రోజులుగా తర్జనభర్జనలు పడుతున్నారు. కూతురి గురించి సమస్త వివరాలూ తెలుసుకోవాలని ఉంది. తనంతట తను చెప్పేవరకూ ఏమీ అడగొద్దని చెప్పింది సుజాత. కానీ కూలికి వెళ్ళినపుడు అందరూ సుజాత గురించి అడగడమే! తమకి ఏం తెలుసని చెప్పగలరు? ఆమె శాంతంగా, గంభీరంగా మాట్లాడుతుంటే వాత్సల్యం కన్నా ముందు గౌరవమే కలుగుతుంది. గూడెంలో కూతురు గురించి రెండభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి. కుర్రకారంతా గూడేనికి

మంచిరోజులొచ్చాయని అన్నారు. మరికొం దరు 'మళ్ళీ ఏం ముంచుకొస్తుందో ఏమో' అంటూ ఆందోళన పడ్డారు.

కూతురి రాక మూలంగా మంచిరోజు లొస్తే రావొచ్చు కానీ దానికి ముందే ఎన్ని గొడవలు జరుగుతాయి. ఊరంతా భగ్గున మండుతుంది. ఆ మంటల్లో ఈ సారి ఎవరు సమిధలుగా మారతారోనని ఒకటే దిగులుగావుంది. ఎట్లాగైనా కూతురితో ఈ విషయాలన్నీ మాట్లాడాలి. రాత్రి భోజనాల య్యాక అందరూ బైట కూర్చున్నారు.

"అమ్మా! నీ సదువు అయిపోయిందా? ఇంక ఏం జేద్దావనీ" ఏసుపాదం ఉపోద్ఘా తంగా అన్నాడు.

సుజాతకి వారి ఆరాటం అర్థమయింది. ఇంకా వాళ్ళని సందేహంలో పెట్టడం మంచిది కాదనిపించింది.

"చదువు సంగతి వదిలేయి నాన్నా! ఇక ముందు నేను ఈ ఊళ్ళోనే, ఇక్కడే, మీ మధ్యే వుంటాను. ముందు చిన్న వ్యాపారం ఏదోఒకటి చేసి నిలదొక్కుకుంటే మన గూడెం కోసం ఏమైనా చెయ్యాలనివుంది. ఇంతకు మించి దాపరికం ఏమీ లేదు"

"ఆ! ఈ యాపారాలూ యియ్యన్నీ మన సుంటి వాళ్ళకెందుకు? మెళ్ళో ఆ బొందు కొత్త పడితే చాలదా?" మరియమ్మ అంది. తల్లి అమాయకత్వానికి పెదాల మీద చిరు నవ్వు చిందులేసింది.

"మరి ఎవరికిచ్చి చేస్తావు నన్ను?" చిలి పిగా అంది.

"ఈ బంగారబ్బొమ్మని జేసుకునే అదు రుష్టం ఎవుడికి వుందో వాడే ఎతుక్కుని వత్తాడు" ధీమాగా అంది మరియమ్మ.

'వస్తాడా?' తనలోతనే గొణుక్కుంటూ పరధ్యానంలో పడింది సుజాత కాసేపు. ఆ కబురూ ఈ కబురూ చెప్పి నిద్రాపుకోలేక జోగుతున్నారు మరియమ్మ, ఏసుపాదం.

వాళ్ళని పడుకోమని చెప్పి గుడిసె ముందున్న ఖాళీ స్థలంలో పచార్లు చెయ్య సాగింది.

"అక్కా! ఇక్కడ కాసేపు పడుకో బావుం టది" అంటూ రాజు నులకమంచం తెచ్చి మల్లెపొద పక్కన వేశాడు.

వెల్లకిలా పడుకుని ఆకాశం వంక చూడ సాగింది. నిర్మలంగా ఉన్న ఆకాశంలో అక్క డక్కడా దూదిపింజెల్లా తెల్లమబ్బులు చిలి పిగా గంతులేస్తూ పరుగెడుతున్నాయి. అందమయిన అమ్మాయి కళ్ళ కాంతుల్లా నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి. యిక చందమామ సోయగం వర్ణించ తరమా? ఈ రాత్రికి నేనే రాజునంటూ దర్జా ఒలకబోస్తున్నాడు.

అపుడే విచ్చుకుంటున్న మల్లెల గుభా ళింపు మనసుని ఏవో తెలీనిలోకాల వైపు నడిపిస్తోంది. పైరగాలి అలవోకగా స్పృశిస్తూ సాగిపోతోంది. చిన్నగా కూని రాగం తీస్తూ ప్రకృతిలో లీనమయిపో యింది సుజాత.

"సుజీ!" పిలవలేక పిలవలేక పిలిచినట్లు ఓ స్వరం విన్పించింది.

తిరిగి చూసింది. ప్రసాద్. లేచి కూర్చుని పక్కకి జరిగి "కూర్చో" అంది. ఎదురుగా వున్నరాయి మీద కూర్చుంటూ ఇక్కడ కూచుంటాలే! అన్నాడు.

"అయ్యో! ఎందుకలా?" నొచ్చుకుంది.

"ఫర్లేదులే!" అన్నాడు.

"రాత్రిపూట ఈ పరిసరాలు ఇవన్నీ ఎంతో మనశ్శాంతిని కలిగిస్తాయి" చెప్పింది.

"పడుకుంటున్నట్లున్నావు. నేనొచ్చి కదిలిం చానా?" మొహమాటంగా అన్నాడు.

"అదేం లేదు. నువ్వొస్తే గాఢనిద్రలో వున్న వాళ్ళయినా లేచికూర్చోవాల్సిందే!. ప్రచండ మారుతం లాంటి వాడివి నువ్వు. నువ్వు ఖాళీగా వుండవు. నీ చుట్టు పక్కల వాళ్ళని ఖాళీగా వుంచవు" నవ్వుతూ అంది.

ఆమె మాటల్లోని అర్థాన్ని వెతుక్కుంటూ కాసేపు మౌనం వహించాడు. తర్వాత వున్న ట్టుండి.

"నేను ఏ విషయానికయినా నీకు ఇబ్బంది కలిగిస్తున్నానా? " మెల్లగా అడిగాడు.

"ఏం? " ఆశ్చర్యంగా అంది.

"ఏమో! అలా అనిపిస్తోంది"

"అదేం లేదే? కాకపోతే అనవసరంగా నోరుపారేసుకోవడం నువ్వు మానడం లేదు ఎదుటి వాడు అన్యాయం చేశాడని తెలిస్తే బరస్ట్ అవుతాం ఎవ్వరైనా. అదుగో అలాంటపుడే ఆవేశం మనలోవున్న విచక్షణని చంపేస్తుంది. యిక అలాంటపుడు మనమేం సాధించగలం. అందుకే నిన్ను అపుడపుడూ హెచ్చరిస్తుంటాను తప్ప బాధేమీ లేదు"

కాసేపు ఆలోచిస్తూ వున్నాడు. ఆ తర్వాత "నాకు సుదర్శనం మీద డౌట్‌గా వుంది" అన్నాడు.

"ఏ విషయంలో? ? "

"నీ విషయంలోనే!"

"నా గురించా? నన్నేం చేస్తాడు? " మాట మధ్యలో ఆపేసి మౌనాన్ని ఆశ్రయించింది.

"మనం జాగ్రత్తగా వుండాలి" హెచ్చరికగా అన్నాడు. అవునన్నట్లు తలాడించింది.

"నువ్వెక్కడికి బయల్దేరినా నాకు కబురంపకుండా వెళ్ళకు. నాకు వీలు కాకపోతే మోహనో, ప్రకాశమో వస్తారు"

"ఆడదాన్ననా ఇన్ని జాగ్రత్తలు? " బలహీనంగా నవ్వుతూ అంది.

"అదుగో! అదే వద్దు. నాకా తేడాలు లేవని నీకు తెలుసు. మనిషికి మనిషి తోడని. అదీగాక యిక ఈ సారి నువ్వు మళ్ళీ వూరు విడిచి పెట్టే పరిస్థితి రాకూడదు"

నిట్టూర్చి "ఈ ఆరేళ్ళూ మోడులా బతికాను అనుక్షణం నీ గురించే ఆలోచన. నాకు బాగానమ్మకం. నువ్వొత్తావని. అందాకా ఎట్టాగో బతుకుదాంలేరా! అని అందరికీ నచ్చజెప్పాను. నా మొండితనానికి దడిచి ఈ మధ్యకాలంలో ఎవరూ మనవైపు తొంగి చూడలేదు.

రోజూ పొలానికి పొయ్యేపుడూ, వచ్చేపుడూ రోడ్డు చివరి వరకూ చూస్తూనే వుండేవాడిని నువ్వొత్తావని. నా కోసం కాదు. గూడెం కోసం. నీలో ఏదో శక్తి వుంది. అదేంటో మరి ధైర్యమో, తెలివో, పట్టుదలో ఏదో మొత్తానికి" ఆగాడు.

కళ్ళు చెమర్చాయి సుజాతకి. అతని ఎదురు చూపులో కవిత్వం లేదు. కానీ మనసుని హత్తుకు పోయిందా భావం.

"ప్రసాద్! ఎందుకు నామీద యింత అభిమానం? " ఆప్యాయంగా అంది.

"ఏంటో సుజీ! నువ్వు పక్కన వుంటే ఏదో సాధించాలన్న పట్టుదల వస్తుంది. నీకు గుర్తుందా? చిన్నప్పటి నుంచీ నీమాటంటె శిలాశాసనంలా అమలు పరిచే వాడిని. నీ మాట తీసేయలేక గుళ్ళోకి వెళ్ళాను"

పదేళ్ళకిందటి సంఘటన యిద్దరికీ గుర్తొచ్చింది.

సుజాత అపుడు ఏడో తరగతి చదువుతోంది. ప్రసాద్ పదో తరగతి. చిన్నప్పటి నుంచీ యిద్దరూ ఒకే జట్టు. ఆ రోజు ఇద్దరూ కలిసి స్కూలుకి వెళుతున్నారు. తోవలో రామాలయం వుంటుంది. ప్రతి రోజు స్కూలుకి వెళ్ళేముందు ఆ గుడివంక ఆసక్తిగా చూడటం అలవాటు.

పూజారి మంత్రాలు చదవడం, గూడెం వాళ్ళు తప్పమిగతా వాళ్ళంతా గుళ్ళోకి వెళ్ళి పూజలు చేసుకుని ప్రసాదాలు తింటూ రావడం విచిత్రంగా వుండేది.

అందరూ వెళ్ళే గుడికి తమ గూడెం వాళ్ళే ఎందుకు వెళ్ళకూడదో అర్థమయ్యేది కాదు. ఎంత మందిని అడిగినా సరిగ్గా సమాధానం రాలేదు.

అయితే ఆ రోజూ ఎప్పటిలా గడిచేదేమో కానీ తామిద్దరూ రోడ్డు మీద వెళ్తుంటే గుళ్లోకి వెళ్తూ గోవిందశాస్త్రిగారమ్మాయి అన్న మాటలు మనసుని మెలితిప్పి బాధించాయి.

"ఏమే! సుజాతా? మీరు గుళ్ళోకి రాకూ

డదు. వస్తే గుడి మైల పడిపోతుంది" అని నవ్వుకుంటూ వెళ్ళి పోయింది.

పళ్ళుకొరుకుతూ గుడి ముందున్న చెట్టు కింద కూర్చుండి పోయింది సుజాత. ప్రసాద్ ఎంత బతిమిలాడినా వినలేదు.

"గుడి మైల పడిపోతుందంట. అదేంటో ఓ సారి తెలిస్తే బావుండు"కోపంగా అంది.

"అయ్యన్నీ మనకెందుకు పద" అనున యించాడు. అయినా వదల్లేదు గుళ్ళోకి వెళ్ళి తీరాల్సిందేనని పట్టుబట్టింది. కొడతారని చెప్పినా పట్టువదల లేదు. 'మైలపడటం' అంటే ఏంటో చూడాల్సిందేనంది. చివరికి తెగించాడు ప్రసాద్.

"సరే! నేనే వెళ్ళొస్తా! నువ్విక్కడే వుండు" అంటూ చరచర గుళ్ళోకి అడుగుపెట్టాడు.

అంతే! ఎక్కడ వాళ్ళక్కడ స్తంభీభూతుల య్యారు. హాహాకారాలు మిన్నుముట్టాయి. ఎక్కడెక్కడి జనం పరుగులు తీస్తూ వచ్చి గుడి ముందరి చెట్టుకే ప్రసాద్‌ని కట్టేశారు. పంచామృతాలతో గుడిని శుద్ధి చేశారు. పెద్దలంతా పంచాయితీ పెట్టారు. గూడెం వాళ్ళందరూ చేతులు కట్టుకుని నిలబడ్డారు.

అందరూ చూస్తుండగా ఆలయప్రవేశం చేసినందుకు ఆ శూద్రుడికి కర్రు కాల్చి ఛాతీ మీద వాతలు పెట్టారు. పొరపాటున నిప్పు నితొక్కితేనే బొబ్బలెక్కుతుందే! అంత బాధని పంటిబిగువున ఓర్చుకుంటూ చూపు లతో సుజాతని అభిషేకిస్తూ ఆ ఆలయప్ర వేశాన్ని ఆమెకి అంకిత మిచ్చాడు.

గూడెం అంతా రోదించింది. సుజాత ఏడ వలేదు. ప్రసాద్‌నే చూసింది. చూపుల్తోనే అతనిలోని పౌరుషాన్ని ఎగదోసింది. అందుకే నిలువెల్లా కుదిపేస్తున్న బాధని ఓర్చుకున్నాడు.

ఆ సంఘటన గుర్తు రావడంతోనే ఒక్క నిమిషం పగ, ప్రతీకారాలతో గుండె రగిలి పోయింది. అన్నింటిని దిగమింగింది.

"అవును. నా కోసమే అంత పెద్ద శిక్షని భరించావు"

అభిమానంగా అతని ఛాతీ మీద మచ్చల్ని తడమబోయింది. సంకోచంతో చెయ్యి వెనక్కి వచ్చేసింది.

ప్రసాద్‌కి తమాషాగా అన్పించింది.

"పెద్ద వాళ్లం అయ్యాం కదూ!" చిరున వ్వుతో మొహం వికసిస్తుండగా అన్నాడు.

తల ఊగించింది. మసక వెలుతురులో సిగ్గు తెరలు ఆమె మొహంలో కదలాడటం ప్రపంచ వింతని చూసినట్లు చూశాడు.

కొత్త ఉత్సాహమేదో నరనరానా ఇంజెక్ట్ చేసినట్లనిపించింది. "ఇక లోన్ల విషయం ఏం ఆలోచించావు. నాకయితే రెండే దార్లు కనిపిస్తున్నాయి. ఒకటి ఈ సంవత్సరానికి యింతే!! అవి వదిలేయడం. రెండు అసలు విషయాన్ని పై వరకూ తీసుకు వెళ్లడం"

"వదల కూడదు" సాలోచనగా అంది.

"మరి? ? "

"పై వరకూ వెళ్ళి పోరాడటమే!"

"మన వాళ్లు కలిసి రావాలి కదా!"

"అందుకే ఈ పోరాటం పరోక్షంగా సాగు తుంది. ప్రెస్ ఇంటర్‌ఫియర్ అవుతుంది. మా ఫ్రెండ్ ఒకతను జర్నలిస్ట్‌గా చేస్తు న్నాడు. నేను మేటర్ రాసి తనకి పంపి స్తాను. ఎంత రాజకీయం చేసే వాళ్లయినా మీడియాకి దడవాల్సిందే!" చిరునవ్వుతో అంది. ప్రత్యక్షంగా మనమేమీ కల్పిం చుకోం... వాళ్ళంతట వాళ్ళే బయటపడి మన దగ్గరికి వస్తారు చూడు" హుషారుగా అంది.

"అంత జరుగుతుందంటావా? " ఆశ్చ ర్యంగా అన్నాడు.

"చూద్దాం" తల పంకించింది.

★ ★ ★

వారం రోజుల తర్వాత ఉదయాన్నే రచ్చ బండ దగ్గర దినపత్రిక చదువుతున్న రామ

**మనకున్న కొద్దిపాటిలోనే తృప్తికరంగా జీవించడాన్ని ఆనందం అంటారు.**
– లాంగ్‌ఫెలో

స్వామి ఇంతెత్తున ఎగిరి పడ్డాడు.

"కొంప మునిగిందయ్యా!" గావు కేక పెట్టాడు.

నిమిషాల్లో పెద్దలంతా పంచాయితీ ఆఫీసులో మీటింగ్ పెట్టారు.

"ఇటువైపు ఊహించలేదురా? ఇరికించేసిందయ్యా?" తల పట్టుకుని వాపోయాడు భూషణం. "డైరెక్ట్‌గా మనూరి పేరే వచ్చేసింది. పైగా ఒక ఎమ్మెల్యే అండదండలున్నాయని కూడా రాశారు. ఆ పెద్దాయనతో ఏం మాటొస్తుందో!" జగన్నాథం దిగులుగా అన్నాడు.

ఇంతలోనే ఫోన్ మోగింది.

"తప్పవు అక్షింతలు. ఎమ్మెల్యేగారే అయి ఉంటారు" పార్థ సారథిగెస్ చేశాడు...

జగన్నాథం రిసీవర్ తీసి "ఆ! ఉన్నారయ్యా!" అంటూ మిగతా వాళ్లకి సైగ చేసి సుదర్శనానికి రిసీవర్ ఇచ్చాడు

"నమస్కారం ఎమ్మెల్యేగారూ!" నవ్వుతూ అన్నాడు సుదర్శనం.

"ఆ! నమస్కారాలు పెడుతూనే కొంప ముంచేలా ఉన్నారు గదయ్యా!" ప్రారంభించడమే దండకంతో మొదలైంది.

"ఎవరో గిట్టని వాళ్ళు"

"మనం చేసే ఎదవ పనులకి గిట్టనోడే తప్ప గిట్టేవాడు ఉండడు. జాగ్రత్తగా మానేజ్ చేసుకోవాలి. ఇకిపుడు చేయ గలిగింది లేదు... ఎవడన్నా ఎంక్వయిరీకి వచ్చేలోపు అవి వాళ్లకి పడేయండి. అయినా అంత పొదుగు కోసుకుని పాలు తాగకూడదయ్యా!! రెండో మూడో ఆళ్లకీ ఇవ్వాలి గదా! అయినా ఈ కాలంలో ఆ నా కొడుకులతో పెట్టుకోమని ఎవరు చెప్పారు? ఇంకోసారి నాకు మాట రాకూడదు. చూసుకో మరి. ఆ! చెల్లెమ్మ ఏం చేత్తుంది?

"బాగానే ఉంది" తేరుకుంటూ చెప్పాడు.

"పిల్ల ఏ తరగతికొచ్చింది"

"అయిదో తరగతి కొచ్చింది"

"బాగా సదవమను సరే ఉంటా" ఫోన్ పెట్టేశాడు. సుదర్శనం మొహం మీద చిరు చెమట కమ్ముకుంది. అది చూడగానే అందరికీ విషయం అర్థమయింది.

"ఎవరెవరం వాళ్ళ లోన్లు మింగామో కక్కక తప్పదు." గోవింద శాస్త్రి చేతులూపుతూ అన్నాడు.

"డబ్బు గురించి కాదయ్యా! అవమానం. యింత బతుకూ బతికి యింటెనకాల చచ్చినట్లు ఇపుడు దానికి తల వంచి ఆళ్లకి యాపారాలు ఇచ్చేయాలన్నమాట" పార్థసారథి రోషంగా అన్నాడు.

"తప్పదు" జగన్నాథం తల ఊగించాడు.

"ఇక గూడెం వాళ్లని పట్టలేం. గెలిచామని విర్రవీగుతారేమో! రేపు మాపు పొలానికెళ్లినా ఒక్కోడు ఎదురైనపుడు మొహం ఎక్కడ పెట్టుకోవాలి" భూషణం అన్నాడు.

అప్పటికి విషయం జీర్ణించుకున్న సుదర్శనం తేరుకున్నాడు...

"అవును గెలుపు వాళ్లదే! విర్రవీగనివ్వండి. ఆ మైమరపులో వుండగానే అదును చూసి తొక్కేద్దాం" సుదర్శనం కళ్ళు జ్వలిస్తున్నాయి. జంతువుకోసం మాటువేసిన పులిలా అప్రమత్తంగా కన్పించాడందరికీ.

అయినా అందరూ నిరుత్సాహంగానే వున్నారు. ఏగొడవా లేకుండా చేతులకి మట్టి అంటకుండా యింత సులభంగా వాళ్ళువాళ్ళకి రావాల్సిందాన్ని సాధించుకున్నారంటే నమ్మశక్యంగా లేదు. దిగులుగానే తమ వంతు డబ్బుతాము ఇచ్చేశారు.

సుదర్శనం పాలేరుని పిలిపించి లోన్లు శాంక్షనయిన వాళ్ళ లిస్ట్ పంపించి డబ్బు పట్టుకు వెళ్ళడానికి రమ్మని కబురు పంపాడు.

ఆ తతంగం అంతా చూసి ఓర్చుకునే గుండెధైర్యం లేక ఒక్కొక్కళ్ళూ మెల్లగా జారుకున్నారు. సుదర్శనం కూడా బైలు దేరదామనుకున్నాడు. కానీ అంతరాంతరాళాల్లోంచి ఉబికివచ్చిన ఆశ ఏదో అతని అక్కడ నుంచి కదలనీయలేదు.

సుజాత ఇంటి దగ్గర గుమికూడారు గూడెంలో చాలా మంది. వాళ్ళందరికీ పేపర్‌లో వార్త చదివి వినిపించాడు ప్రసాద్.

"ఓరబ్బా! భలేగైందిరా!" సంతోషపడ్డారు కుర్రకారు.

"గొప్పోరు ఊరుకుంటారా! మళ్లా తగూలు వచ్చేత్తాయి" ఒకతను నిరసనగా అన్నాడు.

"రానియ్‌రా! తగూ రావాలేగానీ అటో యిటో తేలిపోద్ది" మోహన్‌రంగా అన్నాడు.

దూరంగా సర్పంచిగారి పాలేరు రావడం చూశారందరు. క్షణంలో పరిసరాలన్నీ నిశ్శబ్దమయిపోయాయి. ఊపిరి బిగబట్టి చూడసాగారందరూ. ఒకళ్ళతో ఒక్కళ్ళు సైగలే తప్ప మాటలు లేవు.

ఆ పాలేరు సరాసరి ప్రసాద్ దగ్గరికి వచ్చి కాగితం యిచ్చాడు. అందులో వున్న పేర్లన్నీ పైకి గట్టిగా చదివాడు ప్రసాద్.

"ఈ పేరులున్నోళ్ళందరికి లోన్లు వచ్చినయ్యంట. ఆఫీసుకి వచ్చి డబ్బు అట్టుకెళ్ళమన్నారు" నవ్వుకుంటూ చెప్పాడు పాలేరు.

ఆ మాట పూలబాంబులా పేలింది. చప్పట్లు నవ్వులూ కేరింతలతో ఆ పరిసరాలన్నీ దద్దరిల్లి పోయాయి.

చిన్నయ్య భక్తిగా సుజాత ముందుకి వచ్చాడు.

"అమ్మా! ఆ గొడవలేమీ మాకు తెలీవు.. మీ కుర్రకారంతా కలిసి ఆ వ్యాపారాలు చెయ్యండి. ఊరుకోసం, సత్తువలేనోడి కోసం ఏదో ఒకటి చెయ్యండి. యారా? యావంటారు? "

"అంతే! అంతే!" అరిచారందరూ.

వీళ్ళకి శాంక్షనయిన లోన్లు అయిదు గ్రూపులకీ కలిపి ఎంత డబ్బు రావాలో వివరంగా కాగితం మీద లెక్కరాసిచ్చింది సుజాత.

"నువ్వురావా? " ప్రసాద్ అడిగాడు.

"నేను రానులే!"

"సరే! అయితే పదండ్రా! ఈరోజు ఒక్కొక్కడి మొహం చూడాలని మాంచి ఉబలాటంగా వుంది" ప్రసాద్‌కి గాల్లో తేలుతున్నట్లే వుంది కానీ వెనుక నుంచి ఎవరో చెయ్యి పట్టుకుని ఆపేశారు.

తిరిగి చూశాడు. సుజాత!

"నువ్వొద్దులే! మోహన్ వాళ్ళు వెళతారు. మోహన్! జాగ్రత్త. ఎవరినీ హేళన చెయ్యడం లాంటివి చెయ్యొద్దు మన పని చూసుకుని వచ్చేయడమే!" ప్రసాద్ చెయ్యి వదలకుండానే అంది.

సరే నంటూ వెళ్ళిపోయారు వాళ్ళు.

ఎవరి సందడిలో వాళ్ళున్నారు. కొత్త సందడేదో చుట్టు ముట్టింది ప్రసాద్‌ని. పూల దండ చేతిని చుట్టినట్లువుంది.

సుజాత హృదయం ఉద్విగ్నంగా ఉంది. తొలి విజయం ఎంత ప్రశాంతంగా వచ్చేసిందో? . ఆ ఆనందాన్ని ఎవరితో ఎలా పంచుకోవాలో తెలీడం లేదు.

ఇదే సమయంలో ఆ మనిషి తన ఎదుట ఉంటే తనెంత హంగామా చేసి ఉండేది. చిన్న పిల్లలా ఎగిరి గంతులు వేస్తూ అల్లరి చేసేది. ఆలోచనలో పడిపోయింది.

రెండు నిమిషాలకి తేరుకుని చూస్తే తన చేతుల్లో ప్రసాద్ చేయి. తన వంకే చూస్తూ ప్రసాద్!

"సారీ!" నవ్వుతూ చెప్పి వదిలింది.

"ఎప్పటికీ వదలవేమో అని సంతోషిస్తున్నా! పది నిమిషాల్లోనే చెయ్యి వదిలేశావు" నిష్ఠూరంలో నవ్వుని జోడించాడు.

"ఎప్పటికీ నువ్వు, నేనూ ఇక్కడే వుంటాం. నీ ఆసరా లేకపోతే నేనేమీ సాధించలేనేమో అన్పిస్తోంది" మనస్ఫూర్తిగా చెప్పింది.

ఆనందంతో ప్రసాద్ మొహం వికసించింది.

మరో గంటలో మోహన్ వాళ్ళు తిరిగి వచ్చారు. దాదాపు నాలుగు లక్షల కాష్.

"అమ్మో! యింత డబ్బు వాళ్ళ ఇనప్పెట్టెల్లో మూలుగుతుందన్నమాట" ఆశ్చర్యంగా

అన్నాడు ఏసుపాదం.

వాళ్ళ జీవితంలో అన్ని నోట్ల కటల్ని ఎప్పుడూ చూడకపోవడంతో అంతా కళ్ళప్ప గించేశారు.

"మన మీద చాలా భారం ఉందిప్పుడు. శాంక్షనైన లోన్లతో ఏ వ్యాపారాలు మొదలు పెట్టాలి? వాటికి వాయిదాలు కట్టాలి, ఎక్కడ తేడా వచ్చినా ఇరికించడానికి రెడీగా వుంటారు వాళ్ళు"

"అంతా నీదే భారం అమ్మా! నువ్వేది జెపితే మేవది జేత్తాం" చిన్నయ్య అన్నాడు.

మిగతా వాళ్ళందరూ ఏకగ్రీవంగా ఆ బాధ్యత అంతా సుజాతకే అప్పగించారు.

"నేనేం చేయ్యాలన్నా దానికి ప్రసాద్ సహాయం అవసరం. అందుకు తను ఒప్పు కుంటేనే!" అంది సుజాత.

సుజాత మాటలకి ఒళ్ళంతా పొంగింది ప్రసాద్‌కి.

"కానీ మరీ నీ మాట కాదన్నదెప్పుడు? " హుషారుగా అన్నాడు.

ప్రకాశం, మోహన్, సురేఖలకి కూడా ఆ నిర్వహణ బాధ్యతలని అప్పగించారు. పండుబాబు, రాజు కూడా చేదోడు వాదో డుగా ఉండాలని తీర్మానించారు.

రాత్రికి ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయాక సుజాత భోజనం చేసి మంచం మీద నడుం వాల్చింది. నిద్ర పట్టడం లేదు. మనసంతా గమ్మత్తుగా మారిపోయింది.

ఇక్కడికి వచ్చిన మూడు, నాలుగు రోజు ల్లోనే ఎన్నోయుగాలకి సరిపడా సంఘట నలు జరిగినట్లుగా అన్పిస్తోంది. ఈ జరిగి నవన్నీ సింహావలోకనం చేసుకుంటుంటే తనలో వచ్చిన మార్పు తనకే స్పష్టంగా తెలుస్తోంది.

తను చాలా మారింది. నిజమే! కానీ ప్రసాద్ ఏ మాత్రం మారలేదు. అదే ఆవేశం, క్రోధం, పగ, ప్రతీకారం అతని అణువణువులోనూ నిండిపోయాయి. ఈ భావాలు మనిషిని ఎంత రగిలింపచే స్తాయి!!! శరీరమంతా మంటల్లో మాడిపో తున్నట్లుగా అనుక్షణం కుదిపేసే ఈ భావా లను తను ఎలాగో వదుల్చుకోగలిగింది. మరి ప్రసాద్?

ఆలోచిస్తుంటే కడుపు తరుక్కుపోయింది. కానీ ప్రసాద్‌ని తను మార్చుకోవాలి అతని లోని చైతన్యాన్ని, ధైర్యాన్ని, కండబలాన్ని అందరి బాగుకోసం ఉపయోగించాలి. ఆలో చిస్తూనే నిద్రలోకి జారుకుంది సుజాత.

★ ★ ★

తూర్పు దిక్కు తెల్లబడింది. కొల్లేటి కొంగల గుంపు వేళగాని వేళ తోవ వెతు క్కుంటూ ఆకాశంలో సాగిపోతున్నాయి.

చేతికి ఉన్న బాగ్‌ని భుజాన తగిలించు కుని నడుస్తూ పచ్చని చేల నుంచి వచ్చే పైరగాలిని ఇష్టంగా పీల్చింది సుజాత.

పొలంగట్ల మీద నడుస్తుంటే కాలు స్లిప్ప యింది. లేచి నిలబడి చీరకంటిన మట్టిని దులుపుకుంటుండగా ప్రసాద్ ఆదరబా దరాగా వచ్చాడు. "ఏంటి సుజీ ఈ గట్ల వెంబడి నడక? ఊళ్ళోంచి రావొచ్చుగా! అయినా ఎక్కడికి హడావిడి ప్రయాణం? " ఆత్రుతగా అడిగాడు.

నవ్వింది కానీ చెప్పలేదు. కానీ ప్రసాద్ వదలకుండా వెంట నడుస్తూ "ఏంటి? నాకూ చెప్పకూడదా? " చిరుకోపంగా అడి గాడు.

"విజయవాడ వెళ్తున్నాను' ముక్తసరిగా అంది.

"ఎందుకు? " వెంటనే అడిగాడు.

"నేను చెప్పాలనుకున్నదయితే నువ్వడిగే వరకూ ఆగను ప్రసాదూ!" నవ్వుతూనే అంది.

మొహం చిన్న బుచ్చుకుని మాట్లాడ కుండా నడవసాగాడు. ఆ పొలం గట్టు వెంట అలా అరగంట నడవగా రైలు కట్ట దగ్గర పడింది. రైలు పట్టాలు వాటి మధ్య కంకర రెండు వైపులా గేట్లు వాటికి అటూ ఇటూ కాస్త దూరంలో కూర్చోవడానికి అను

వుగా గట్లు అన్నీ చిరపరిచితాలే!

అలుపు తీర్చుకోడానికన్నట్లు ఒక గట్టు మీద కూచుంది. ప్రసాద్ కూడా ఆమెకి కొంతదూరంలో కూర్చున్నాడు.

చుట్టూ కలయ జూసింది సుజాత. దూరంగా ఒక వస్తువు ఆమె దృష్టిని ఆకర్షించింది. గబగబా అటు నడిచింది రైలు పట్టాలకి అటూయిటూ పోసిన కంకరకి దిగువన ఒక పెద్ద రాయి. "ప్రసాద్! ఇది చూడు" గట్టిగా పిలిచింది. ఆమె ఆత్రుతని చూస్తూ ఏమయిందోనని ఆరాటంగా పరుగెత్తుకొచ్చాడు.

"ఆరోజు ఆరోజు గుర్తుందా? సిగ్నల్ లేక ఇక్కడ రైలాగింది. అపుడు మనమిద్దరం. పరుగెత్తుకుంటూ వస్తుంటే ఈ రాయి తగిలి నేను బొక్కబోర్లా పడ్డాను. నా చేతులు చెక్కుకు పోయాయి. ఆమచ్చలు యింకా తగ్గలేదు చూడు" మోచేతులు చూపించింది.

వేళ్ళతో ఆ మచ్చల్ని తడిమాడు చూస్తుండగానే అతని మొహం క్రోధంతో మార్తాండునిలా మారిపోయింది. ఆమె చేతుల్ని విసిరి కొట్టాడు.

"ప్రతి చోటూ, ప్రతి సమయం జరిగిన ఘోరాలని గుర్తుకు తెస్తూనే వుంటాయి. అసలు మరిచిపోయిందెపుడులే! అదుగో చూడు. ఆ తెల్లమారుతి ఏ.సి. కారులో వుంది ఎవరో తెలుసా? ఆ సుదర్శనం గాడు అంటే ఎన్ని అకృత్యాలు చేసినా హాయిగా తిరగొచ్చనే కదా నీ ఉద్దేశం?

నీకు గుర్తుందా? ఓ అర్ధరాత్రి చిమ్మచీకట్లో ప్రాణాలరచేత పట్టుకుని బతకడం కోసం నువ్వు పరుగెత్తిన విషయం? ఇక్కడేగా చిటికలో ఘోరమయిన ప్రమాదం నుంచి తప్పించు కున్నావు. మర్చిపోయావా? " ఆవేశంగా అన్నాడు.

పక్కనే రైలు పట్టాల నుంచి ఏదో శబ్దం వస్తోంది. సుదూరంగా దృష్టి సారించింది. తాచుపాములా మెలికలు తిరుగుతూ వస్తోంది రైలు. పట్టాలపై శబ్దం మరింత ఎక్కువైంది. కొంచెం దూరం జరిగి చెవులు మూసుకుంది.

రైలు పెద్ద శబ్దం చేస్తూ ధనధనా పట్టాల మీదినుంచి సాగిపోయింది.

మనసంతా బరువుగా తయారయింది. గాయం మళ్ళీ రేగుతున్నట్లుగా వుంది.

"బస్సొచ్చింది పద!" కాసేపటికి సంభాళించుకుని ప్రసాదే చెప్పాడు.

కలలోలానడిచి బస్కెక్కింది. ప్రసాద్ చెయ్యూపుతుంటే యాంత్రికంగా తనూ చెయ్యూపింది కానీ మనసంతా రైలు చుట్టూ తానే పరిభ్రమించడం మొదలయింది.

★ ★ ★

"ఇప్పుడెట్లా సుజీ!" ఇరవైఏళ్ళ ప్రసాద్ గొంతు కంగారుగా ధ్వనించింది.

"ఎక్కడికో పోతా!" కరుకుగా వచ్చింది స్వరం. చీకట్లో కనిపించడం లేదు కానీ ఆమె మొహంలోని భావాలు ఆమె మాటల్లో స్పష్టంగా గ్రహించగలిగాడు.

"అదీ గాదు సుజీ! నాతో ఒక్కమాట చెప్పి వున్నా ఏదోరకంగా ఆలోచించేవాళ్ళం. ఇపుడు ఊరి పెద్దోరికి యిన్ని లక్షల నష్టం నువ్వు చేశావని తెలిసింది. నిన్ను బతకనిస్తారా? " ఆవేదనగా అన్నాడు.

పరుగెడుతున్నదల్లా ఆగి ఖాండ్రించి ఉమ్మింది సుజాత. "మీరంతా మీ గూడెపు మగోరంతా గాజులమలారం వాడి దగ్గర గాజులేయించుకున్నార్రా! అందుకే నా అవమానానికి నేనే ప్రతీకారం తీర్చుకున్నాను. కానీ యింకా చాలదు. ఒక్కొక్కడినీ చంపేయాలి. చంపేస్తాను. తప్పకుండా. మీకు ఎవరికీ నాకు జరిగిన అవమానం ముఖ్యం గాదు. మీరు పిరిగ్గొడ్లు. ఫోండిరా అవతలికి" ప్రసాద్ చేతిని విదిలించింది సుజాత.

దూరంగా రెండు మూడు ట్రాక్టర్లు

వాటిలో మనుషులు టార్చిలైట్లతో రావడం కనిపించింది. మరోవైపు లంకాదహనం జరిగినట్లు కుప్పలను తగలబెడుతూ ఎర్రని మంటలు ఆకాశాన్ని తాకుతున్నాయి.

'ఏం చెయ్యాలి?' ప్రసాద్‌లో ఆందోళన అధికమౌతోంది.

ఆయాసంలో ఒగరుస్తున్నా పరుగు ఆపలేదిద్దరు. రైల్వే గేటు కింద నుంచి దూరి రైలు కట్ట దాటుతుండగా దూరంగా రైలు కూత విన్పించింది. తలలు తిప్పి చూశారు. సిగ్నల్ లేకపోవడంతో పాసింజర్ రైలు ఆగి వుంది.

"రైలెక్కేస్తావా?" అడిగాడు

సమాధానం చెప్పలేదు అటువైపు పరుగు ప్రారంభించింది సుజాత. ఆ చీకట్లో తోవతెలియని చోటులో పరుగెడుతుండగానే బండరాయి తగిలి బొక్కబోర్లా పడింది. దూరంగా రైలు కదలడమే కన్పిస్తోంది. ఎక్కడ దెబ్బలు తగిలాయో చూసుకునే ఓర్పు, సమయం లేవు. దూరంగా అప్పుడే కదులుతున్న రైలే కన్పిస్తోంది.

ఒకటే పరుగు. వెనక ముంచుకొస్తున్న మృత్యువు ముందు అందీ అందకుండా రైలు.

"నేనూ నీతో వచ్చేత్తా" పరుగెడుతూ అన్నాడు ప్రసాద్.

"వద్దు" స్థిరంగా అంది.

"ఏం?"

"ఇద్దరినీ కలిపికట్టి మాట్టాడతారు. నాకిష్టం లేదు. అయినా మంచంలో వున్న మీ అయ్యకి నువ్వే ఆధారం" చెప్పింది. రైలు వేగం పుంజుకుంటోంది.

అతికష్టం మీద మెట్ల దగ్గర కడ్డీ చేతికందింది. వెనకనుంచి పరుగెడుతూనే ప్రసాద్ సాయం చేశాడు. చెయ్యి పట్టుజారబోయి ఆఖరి నిమిషంలో కూడదీసుకుని తలుపు దగ్గర కూర్చుండి పోయింది.

ప్రసాద్ పరుగెడుతూనే ఉన్నాడు. ఎక్కాలో వద్దో నిర్ణయించుకోలేకపోతున్నాడు.

సుజాత మనసు చలించిపోయింది. తన కోసం అంత తపన పడుతున్న తన చిన్ననాటి స్నేహితుడిని చూస్తూ

"ప్రసాదూ! గూడెం జాగ్రత్త! నువ్వూ జాగ్రత్త. నేను మళ్ళీ వస్తా! అప్పటి వరకూ ఆవేశం వద్దు. ఏం జరిగినా చూస్తా వూరుకో! నువ్వొక్కడివే ఏం చేయలేవు. నాకు మాటివ్వు" చెయ్యి చాపింది. కాళ్ళ వేగం మరింత పెంచి ఆమె చేతిని స్పృశించాడు.

రైలు అందుకోలేని వేగం పెరిగింది. చూస్తుండగానే ప్రసాద్ కనుమరుగయ్యాడు. కాసేపు అచేతనంగా నిలబడే వుంది.

రైలెక్కడం అదే తొలిసారి. దూరం నుంచి రైలుని చూస్తుండేదిదివరలో. ఎంతో ఆశ్చర్యంగా, ఓ అద్భుతాన్ని చూసినట్లుండేది. అలాంటిది రైలును తనెక్కింది. బస్‌లోలాగా రైల్లో టికెట్లు ఇవ్వరు. స్టేషన్‌లో తీసుకోవాలి. మరి తన దగ్గర టికెట్ లేదు. ఇపుడేం జరుగుతుంది?. తనని రైల్లో వెళ్ళనిస్తారా?

కనుచూపుమేరా ఎర్రటి మంటలు కన్పిస్తూనే వున్నాయి. అభావంగా చూస్తూ నిలబడింది. రైలు వేగం పుంజుకోగానే చీకటి మరింత చిక్కనైంది.

బెరుగ్గా కంపార్ట్‌మెంట్‌లోకి తొంగిచూసింది. చాలామంది నిద్రలో జోగుతూ కన్పించారు. ఒక్కళ్ళిద్దరు తనవంకే చూస్తూ కన్పించారు.

మెల్లగా వచ్చి ఖాళీగా వున్న చోట్లో కూర్చుంది. భవిష్యత్ అంతా అగమ్యగోచరంగా వుంది.

ఎక్కడికి వెళ్ళాలీ?

ఏం చేయాలీ?

మనసంతా మంచు ముక్కల మధ్య పెట్టినట్లు బండబారిపోయింది. చేతిలో పైసా లేదు. తెలిసిన వాళ్ళు ఎవరూ లేరు. ఈ

రాత్రి ఇలా గడిచిపోవచ్చు. మరి రేపు ఉదయం నుంచి ఎలా?

అంతకన్నా ముందు టికెట్ కలెక్టర్ వస్తే! ఎదురుగా కునికిపాట్లు పడుతున్న చర్చిఫాదర్. ఎందుకో కళ్ళు తెరిచిచూశారు. సుజాతని చూడగానే ఆయన నొసలు ముడి పడింది. హఠాత్తుగా ముందుకు వంగి "ఏమ యిందమ్మా! ఆ గాయం ఏంటి? " కరుణ వర్షిస్తున్న కంఠంతో అడిగాడు.

అప్పుడు చూసుకుంది సుజాత మోచేతు లకి తగిలిన దెబ్బలను వాటి నుంచి కారు తున్న రక్తాన్ని నొప్పి అన్పించడం లేదు. ఎందుకంటే హృదయానికి తగిలిన గాయం మరింత బలంగా వుండటంచేత.

ఫాదర్ ఫిలిప్ కర్చీఫ్ తీసి నీళ్ళలో తడిపి దెబ్బలని శుభ్రం చేశారు. ఆయన అలా సేవలు చేస్తుంటే చాలా విచిత్రంగా అన్పిం చింది.

సుజాతని చూసి ఏదో జరిగిందనీ, ఆమె ఇంట్లోంచి పారిపోయి వస్తోందని అర్థ మైంది.

"నాతో వస్తావా? " ఆత్మీయంగా అడిగా డాయన. విస్మయంగా చూసింది సుజాత.

"అందరికీ ఆ యేసు ప్రభువే రక్ష. ఏం జరిగిందని నేను అడగను. నాతో వచ్చి ప్రభువు సేవలో నిమగ్నమవ్వు" అనున యంగా అన్నారాయన.

మండుతున్న హృదయం మీద ఓ చుక్క పన్నీరు జల్లినట్లు ఉంది. 'వస్తాను' అన్నట్లు తలూపింది.

విజయవాడ స్టేషన్‌లో దిగారిద్దరూ. ఆ తెల్లవారుఝామున ఫాదర్‌తో కలిసి ఆటోలో వెళ్తుంటే ఏదో కొత్తలోకంలోకి వచ్చి పడినట్లుగా ఉంది.

అరగంట ప్రయాణించి సిటీ అవుట్ స్కర్ట్స్‌లో ఉన్న చర్చిముందు ఆగింది ఆటో. ఆ చర్చి ఆవరణని ఆనుకునే చిన్న యిల్లు ఉంది. యింట్లో అడుగుపెట్టగానే ఆయన బాత్‌రూం చూపిస్తూ "స్నానం చేసిరా! ఈలోపు నీకు తినడానికి ఏమయినా తయారుచేస్తాను" చెప్పాడు.

స్నానం చేసి వచ్చేసరికి ఫ్రిజ్‌లోంచి పాలు తీసి వేడి చేసి బ్రెడ్‌ని కాల్చి రడీ చేసి వుంచారు. జడ వేసుకుంటూ ఆయన దగ్గ రికి వచ్చింది.

"పాలా? " విచిత్రంగా అడిగింది.

"వూ నీకే తాగు"

"వుహూ! నేనెపుడూ తాగలేదు. నాకు ఆ వాసనే వికారం." మొహం అదోలా పెట్టు కుని అంది.

ఫాదర్ ఫిలిప్‌కి కొంచెం నవ్వొచ్చింది. "మరేం తింటావు? " అడిగారు.

"ఇంత చద్దన్నం. కొరివికాయం తింటే మజా!" తలెగరేస్తూ అంది.

పకపకా నవ్వాడాయన. "నీ కోసం రేపటి నుంచే తయారుచేస్తాలే! ఇప్పటికి వీటితో సరిపెట్టుకో" అనగానే అయిష్టంగానే పాలు తాగి బ్రెడ్ తింది. నిద్రతో ఒళ్ళుతూలు తోంది. ఆయన లోపలి గదిలోని మంచం చూపించి "ధైర్యంగా పడుకో" అని చెప్పి తలుపు చేరేసి వెళ్ళిపోయారు.

ఎంతసేపు నిద్రపోయిందో తెలీదు కానీ మెలుకువ వచ్చేసరికి పడమటి సూర్యుని కిరణాలు ఏటవాలుగా పడుతున్నాయి.

గబుక్కున లేచి కూర్చుంది. ఓ నిమిషం ఏమీ అర్థం కాలేదు. మంచం మీద బాసిం పట్టు వేసుకుని కూర్చుని ఆలోచిస్తుండగా సిస్టర్ ఒకామె వచ్చింది.

"మెలుకువ వచ్చిందా? " ఆమె కంఠం లోనూ దయ, కరుణే!

"వూ!"

"ఈ రోజు నుంచి నా గదిలో వుంటావా? " అడిగిందామె.

"మరి ఫాదర్? " ప్రశ్నార్థకంగా అంది సుజాత. మన గది ఈ పక్కనే! ఇక్కడే ఫాదర్ ఉంటారు" చెప్పిందామె.

వినగానే చటుక్కున నిల్చుంది సుజాత సిస్టర్ నవ్వి ముందుకి సాగగా ఆమెని అను



## దేవుడు ఆ పార్టీ సభ్యుడా?

రాజాజీది స్వతంత్రపార్టీ. ఆయన ప్రభుత్వాన్ని విమర్శిస్తూ చీటికిమాటికి దేవుడి ప్రస్తావన తెచ్చేవారు. ఓరోజు నెహ్రూకు ఒళ్లుమండి..

'మాటిమాటికి దేవుణ్ని తలచుకుంటున్నారు.. కొంపదీసి దేవుడు మీ పార్టీ సీనియర్ సభ్యుడా ఏంటి?' అన్నారు వ్యంగ్యంగా.

'కొందరు భజనపరులను చుట్టూపెట్టుకుని.. వాళ్ల మెదళ్లు తనవద్ద తాకట్టు పెట్టుకుని తనే దేవుడని అనుకుంటున్నట్లున్నారు నెహ్రూజీ.. పాపం' అంటూ తిప్పికొట్టారు రాజాజీ.

సరించింది.

"ఎన్ని కష్టాలొచ్చినా అవన్నీ యేసే మన నుంచి తీసుకుంటాడు. మన పని క్రీస్తునామాన్ని ప్రచారం చెయ్యడమే! రేపటినుంచీ నువ్వు చర్చికి రా! క్రైస్తవ గీతాలు నేర్చుకో! నలుగురికీ నేర్పించు" చెప్పిందావిడ.

తలూపింది సుజాత

★ ★ ★

సుజాత దినచర్య అంతా ఆమె ప్రమేయం లేకుండానే నియమబద్ధంగా మారిపోయింది. ఉదయం అయిదుగంటలకి లేచి స్నానాదికాలు ముగించుకుని చర్చి ఆవరణలో ప్రార్థనలు చేస్తారు. తొమ్మిదింటికల్లా టిఫిన్ చేసేసి కారెజీలు పట్టుకుని అక్కడికి పదిహేను కిలోమీటర్ల దూరంలో ఉన్న ఫుల్‌గోస్పెల్ చర్చికి వెళ్ళేవారు. ప్రతిరోజూ అక్కడ సువార్తకూటములు జరుగుతుండేవి.

అయితే ఈ కార్యక్రమాలేవీ సుజాతలోని అగ్నిగుండాన్ని ఆర్పలేకపోయాయి. శరీరం అక్కడ ఉన్నా మనసు ఊరి చుట్టూ తిరుగుతుండేది.

ఇక ముందు ఏంటీ తన జీవితం? యిలా సాగిపోవాల్సిందేనా? ఇట్లా ఈ మత ప్రచారం చేస్తూ జీవితమంతా ఇలా గడపగలదా?

అసలు జరిగిన విషయాలు మర్చిపోవడం ఎలా? ఆ సుదర్శనం గాడు అణువణువునా క్రూరత్వం నింపుకున్న ఆ మృగం తనని ఎట్లా అవమానించాడూ? అంతేనా? చిన్నప్పటినుంచీ తను పొందిన అవమానాలూ, కష్టాలూ అన్నీ మర్చి పోయి ఏమీ జరగనట్లు తన క్షేమం తను చూసుకోగలదా? అక్కడ తన గూడెం వాళ్లూ ప్రసాదూ అందరూ తనకోసం ఎదురు చూస్తూంటారుగా!

ఏదో చెయ్యాలి! అందరికన్నా గొప్పగా మారి తనని కష్టపెట్టిన వాళ్ల భరతం పట్టాలి అందుకొకటే మార్గం. తను కలెక్టర్ కావాలి. అందుకు ముందు బాగా చదవాలి. ఇక్కడ చదువుకునే అవకాశం చాలా తక్కువ. ఏం తోచనట్లుగా ఉంది.

చర్చి ఆవరణలో గట్టు మీద దిగాలుగా కూచుని ఉన్న సుజాతని చూశారు ఫాదర్ ఫిలప్. పని మీద వెళ్తున్నాయన ఆగి సుజాతవైపు వచ్చారు.

ఫాదర్‌ని చూసి చిరునవ్వు నవ్వింది. ఆది కళావిహీనమై ఉండటం ఆయన కనిపెట్టారు.

*బాగా ఆలోచించి, బాగా పనిని చేయడం అన్నదే అన్నిటి కంటే వివేకమైనది, ఉత్తమమైనది.* — మాక్‌టి. హెండర్సన్



"ఏమ్మా! ఇల్లు గుర్తొచ్చిందా? " ఆత్మీయంగా అడిగారు.

"ఊహూ!" తలాడించింది.

"మరి? " ప్రశ్నార్థకంగా చూశారు ఫాదర్.

"నేను బాగా చదువుకోవాలి. ఎలాగైనా పెద్ద పదవిని పొందాలి. ఆ తర్వాత చేయాల్సిన పనులు చాలా వున్నాయి" పట్టుదలగా అంది.

ఆ కంఠంలో ధ్వనించిన ప్రతీకారం ఏదో ఫాదర్ ఫిలప్ గుండెని పిండేసింది.

"మనుషుల్ని జాలి, దయ, కరుణతో బతకమని ప్రభువు ఆదేశించాడమ్మా!" అనునయింపుగా అన్నారు ఫాదర్.

"అందరూ అలాగే ఉండాలి కదా! మరి కొందరిలో క్రౌర్యాన్ని కలిగిస్తాడెందుకు దేవుడు? " అంది సుజాత.

"ఆ క్రౌర్యం దాని తాలూకు ఫలితం ప్రభువే మోస్తాడు. అదే మనిషిలో పశ్చాత్తాపాన్ని కలిగిస్తుంది" చెప్పారు ఫాదర్.

ఆ చర్చ మనసుకి స్వాంతన కలిగించలేదు. అప్పటికే తాను తీసుకున్న నిర్ణయం మూలంగా ఇంకా వాదించదల్చుకోలేదు.

"నేను రేపు హైదరాబాద్ వెళ్లాలనుకుంటున్నాను. నాకు ఛార్జిలకి డబ్బులు యివ్వగలరా? " అడిగింది.

ఫాదర్ మొహంలో చిన్న నిరాశా పూరిత రేఖ. "నీ ప్రతిభతో క్రీస్తు నామాన్ని ఊరూరా ప్రచారం చేస్తావనుకున్నాను" అన్నాడు.

"దేవుడంటూ ఉంటే ఆయన నాకు అప్పగించిన బాధ్యతలు ఇంకా నెరవేర్చాలి. మనుషుల కష్టాలు కళ్లముందు కదులుతుంటే ప్రభువు గురించి ఆలోచించలేను" నిర్భయంగా అంది సుజాత.

కాసేపు ఏమీ మాట్లాడలేదు ఫాదర్. తర్వాత లోపలికి వెళ్లి సిస్టర్‌తో అయిదువందలు పంపించారు.

ఆ డబ్బు చేతితో పడగానే చిత్రమయిన భావన కలిగింది. ఈ డబ్బే తన జీవిత గమనాన్ని నిర్దేశిస్తుంది. ఎంతో అపురూప మైన వస్తువులా ఆ కాగితాలను హృదయా నికి హత్తుకుంది సుజాత.

★ ★ ★

హైదరాబాద్ ...

చీకట్ల మేలి ముసుగును సవరించుకొని నగరం జీవన పోరాటానికి ఆయత్తమౌ తోంది. రైల్వేస్టేషన్ నుంచి బయటకి వచ్చింది సుజాత.

రకరకాల రోడ్లు, బస్సులూ, వాహనాలూ అంతా అయోమయంగా కలగాపులగంగా ఉంది. చాలా సేపు కళ్లు విప్పార్చుకుని చూస్తూ ఉండిపోయింది.

చివరికి తెగించి పక్కనే వెళ్తున్నతన్ని ఆపి "ఎస్సీ, ఎస్టీ బాలికల సంక్షేమ గృహం ఎక్కడుందో తెలుసా? " తను పేపర్‌లో చదివిన పేరును పొల్లుపోకుండా గుర్తు పెట్టుకొని అడిగింది.

అతను చెయ్యి అడ్డంగా ఆడిస్తూ 'మాలూ మ్నై..." అంటూ వెళ్లిపోయాడు. కాసేపు అక్కడే తారట్లాడి ఇద్దరు ముగ్గుర్ని అడిగాక ఎటువైపు వెళితే ఆ ఏరియాకి వెళ్లే బస్ వస్తుందో చెప్పారు. బస్ నంబర్ వెతు క్కుంటూ వెళ్లింది. అయిదు నిముషాల్లో బస్ వచ్చింది. గబగబ బస్సెక్కుతున్న ఆమెని ఒకరిద్దరు విచిత్రంగా చూశారు.

కండక్టర్ రాగానే కర్చీఫ్‌కి ఉన్న ముడిని జాగ్రత్తగా విప్పదీసి అందులోంచి చిల్లర డబ్బుల్ని లెక్కబెట్టి ఇచ్చింది. ఆ తతంగా న్నంతా ఓపికగా పరీక్షించిన కండక్టర్ చివ రికి గొణుక్కుంటూ చిల్లర తీసుకొని టికెట్ కట్ చేసి యిచ్చాడు.

ఆ తర్వాత కిటికీలోంచి వెనక్కిపరుగెత్తే వాహనాలను, బిల్డింగ్స్‌ని చూస్తూ కూర్చుంది. ఇంత పెద్ద నగరంలో రయ్యిన దూసుకుపోయే ఈ బస్సులో తను కూర్చుని ఉండటం ఎంతో గొప్పగా తోచింది. ఈ లెక్కన తను తన గూడెం వాళ్ల కన్నా కొంచెం ఎదిగినట్లే అనుకోగానే ఇసుమంత గర్వం కలిగింది.

కండక్టర్‌కి ముందే చెప్పి ఉంచడం మూలంగా తను దిగాల్సిన చోటు రాగానే చెప్పాడు. పరిసరాలు చూస్తూ దిగింది సుజాత. తనని వదిలేసి బస్సు వెళ్లిపో తుంటే ఎందుకో దాని వంక దిగాలుగా చూసింది.

ఎదురుగా కన్పిస్తున్న భవనాన్ని చూస్తూ కాసేపు అలాగే నిలబడింది. మరీ అంత పెద్దగా లేదు కానీ పైకి మాత్రం రాతి కట్టడం మూలంగా దృఢంగా కన్పిస్తోంది.

బిల్డింగ్ బయట చాలా మంది అమ్మా యిలు కనిపిస్తున్నారు. బ్రష్‌లు నోట్లో పెట్టుకుని పళ్ళుతోముకుంటూ రోడ్డు మీద వచ్చీపోయే వాళ్ళని చూస్తూ వున్నారు.

అందరూ పద్దెనిమిదేళ్ళ లోపు వాళ్ళే! గేటు బయట తటపటాయిస్తూ నిలబడిన సుజాతని విచిత్రంగా చూస్తున్నారు.

లోపలికి వెళ్ళి ఎవరిని కలవాలో ఏమని అడగాలో తెలీదు. అంతలోనే తన లక్ష్యం గుర్తొచ్చింది. తన అవమానాలు గుర్తొ చ్చాయి. తనిక దేనికి జంకాలి? ఎవరికి జంకాలి? .

ధైర్యంగా ముందుకు అడుగేసింది. తన వంకే చూస్తున్న ఆడపిల్లల దగ్గరికి వెళ్ళి.

"సార్ వున్నారా? " అడిగింది.

"ఏ సార్? " ఎదురు ప్రశ్నించారు వాళ్ళు.

ఏం చెప్పాలో తోచలేదు. ఏ సారో తనకి తెలిస్తేగా! ఒక నిమిషం ఆగి "నేను ఇక్కడ చేరాలి అందుకు ఎవరిని అడగాలి? " సూటిగా ప్రశ్నించింది.

"వార్డెన్ ఉంటుందిగా. ఆవిడని అడగాలి' చెప్పారు వాళ్ళు.

"ఆవిడ వున్నారా? " ఆత్రంగా అడిగింది.

"వూ! ఉండకేం చేత్తది. ఈ తలికి మెస్‌లో గూటడం మొదలెట్టి ఉంటుంది" అందరి

లోకి ఎత్తుగా ఉన్నమ్మాయి అనగానే మిగతా వాళ్ళు ఘొల్లున నవ్వారు.

ఇంతలోకి వార్డెనే అక్కడకి రావడం చూసి అందరూ పిల్లుల్లా వంచిన తలలు ఎత్తకుండా తమ పని చూసుకోసాగారు.

ఆమె పరీక్షగా అందరినీ చూస్తూ తొందరగా తెమిలి స్కూళ్ళకీ, కాలేజీలకి వెళ్ళమని గదమాయించ సాగింది. అందరినీ చూస్తూ వస్తున్న ఆమె చూపు చివరికి సుజాత మీద పడింది.

"ఎవరు? " మొహం చిట్లిస్తూ అడిగింది వార్డెన్. ఆ ప్రశ్నని అంత అసహ్యం కలిగే విధంగా అడగొచ్చని తెలీని సుజాత తెల్ల మొహం వేసిందో క్షణం.

"నా పేరు సుజాత" చెప్పింది.

"అయితే! నువ్వేమన్నా ప్రైమ్మినిస్టర్‌వా? పేరు చెప్పగానే తెలియడానికి? ఏం పని మీద వచ్చావే? " చిరాకుగా అడిగింది.

"నేను యిక్కడ చేరాలని వచ్చాను" మనసు మండిపోతున్నా నిబ్బరంగా అంది.

"ఆహా! ఏం దర్జా! నిన్ను చేర్చుకోడానికే ఈ హాస్టల్ గేట్లు తెరిచి వుంచాం" వెటకారంగా అంది వార్డెన్.

అప్పుడే డ్యూటీ మారి వచ్చిన వాచ్‌మాన్ కిసుక్కున నవ్వాడు.

అతని వంక తీవ్రంగా చూసింది సుజాత.. కానీ అతని చూపు మాత్రం ఆమె వంటి మీద తారట్లాడుతోంది. కంపరంగా తలతిప్పుకుని...

"నాకు ఎవరూ లేరు.. నేను చదువుకోవడం కోసం ఇక్కడికి వచ్చాను. పేదవాళ్ళకి యిక్కడ ప్రభుత్వం ఉచితంగా తిండి, బట్ట యిచ్చి చదువు చెప్పిస్తుందని పేపర్‌లో చదివాను. మీరు నన్ను ఎందుకు చేర్చుకోరు? " నిర్భయంగా ప్రశ్నిస్తున్న సుజాతని చూసేసరికి వార్డెన్‌కి ఒంటి మీద గొంగళి పురుగులు పాకినట్లు అయింది.

"దేశంలో చాలా మంది పేదవాళ్ళువున్నారు. నీలాగా వచ్చిపడిపోతే ఈ హాస్టల్ ఏమూలకీ? " నిరసనగా అంది. ఇంతలో ఆ హాస్టల్‌లో అవకతవకలని గురించి చూచాయగా తెలుసుకున్న ఓ ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ ఆ పరిసరాల్లోనే తచ్చట్లాడుతున్నాడు.

దూరం నుంచి వాళ్ళిద్దరి వాగ్వివాదం విని దగ్గరగా వచ్చాడు. అతన్ని ఎవరూ పట్టించుకోలేదు.

"అవన్నీ అనవసరం. హాస్టల్లో ఖాళీ వుందో లేదో చెప్పండి" ఆ అమ్మాయి అనడం విని ఆకంఠంలోని పట్టుదలకూ నిబ్బరానికి ఆశ్చర్యపోయి ఆమెవంక చూశాడు. పదహారు, పదిహేడు సంవత్సరాలు వుండొచ్చు. కానీ పోషకాహార లేమి ఆమె శరీరంలో కన్పిస్తోంది.

జాలిగా చూశాడు అతను.

"అసలు నువ్వెవరు ఇవ్వన్నీ అడగడానికి? చూడపోతే ఎవడితోనో లేచొచ్చిన బాపతులా ఉన్నావు. మోజు దీరాక వాడి దోవన వాడు పోయి వుంటాడు. నువ్విలా రోడ్డున పడ్డావు" ఎద్దేవగా అంది వార్డెన్.

అంతే! ఆ మాటకి సుజాతకి నరనరానా ఆవేశం ఉప్పొంగింది. రివ్వున పరుగెత్తి వార్డెన్ మీద కలబడి ఆమె జుత్తు పట్టుకుని ఎడాపెడా కాళ్ళతో తన్నసాగింది.

అతను ఆశ్చర్యపోయాడు. అతను చూసిన ప్రపంచం వేరు. అందులో ఆడ వాళ్ళు వినయంగా ఒదిగొదిగి ఉండటం భర్త, తండ్రుల మాటకి ఎదురాడక పోవడమే తెలుసు తప్ప తనని నిష్కారణంగా అవమానించిన వాళ్ళ మీద తిరగబడటాన్ని ఊహించలేదు.

అతనికి చాలా నవ్వు తెప్పించిందా సంఘటన. వాచ్‌మాన్ ఇతర పిల్లలు కలిసి విడదీశారు.

"దాన్ని బయటకి గెంటండి" రొప్పుతూ ఆదేశించింది వార్డెన్. వాచ్‌మాన్ ఈడ్చుకుంటూ వెళ్తుంటే చేపపిల్లలా అతని చేతుల నుంచి జారి మళ్ళీ వార్డెన్ మీద దూకబో

తుంటే ఆపడానికి విశ్వప్రయత్నం చేయాల్సి వచ్చింది.

ఆడపిల్లలందరూ మొహాలు పక్కకి తిప్పుకుని సరదాగా, ఆనందంగా నవ్వేసుకుని మళ్లీ ఏమీ ఎరుగనట్లు బాధగా మొహాలు పెట్టారు.

చిరిగిపోయిన జాకెట్టు ఊడిపోయిన జుట్టుతో వార్డెన్ రూపం చూసి ఆ జర్నలిస్ట్‌కి నవ్వాగలేదు.

ఎందుకైనా మంచిదని ఆ సీన్‌ని రెండు ఫోటోలు కూడా తీశాడు. ఫ్లాష్ మీద పడగానే ఎలర్టయింది వార్డెన్.

గభాలున లోపలకి వెళ్లిపోయింది.

వాచ్‌మాన్ సుజాతని బైటకి ఈడ్చుకు వెళ్లి గేటు బయటకి తోసి తాళం వేశాడు.

చేతిలో బాగ్‌ని పట్టుకుని అలాగే చెట్టుకింద నిల్చుంది. ఆమె మొహంలో రోషం, ఉక్రోషం తారట్లాడుతున్నాయి.

అతనలాగే కాసేపు ఆ అమ్మాయి వంక దీర్ఘంగా చూశాడు.



వాచ్‌మాన్ గద్దించడంతో ఆడపిల్లలంతా ఎక్కడివాళ్లు అక్కడ సర్దుకున్నారు.

ఆ జర్నలిస్ట్ ఆఫీస్‌రూంకి వెళ్లి వార్డెన్ టేబిల్ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

కాసేపటికి చిరిగిపోయిన బట్టలు మార్చుకుని మొహం గంటుపెట్టుకుని వార్డెన్ వచ్చింది.

తన సీట్లో కూర్చుంటూ "ఎవరు మీరు? ఫోటో తీశారెందుకు? " కోపంగా అడిగింది.

అతను మౌనంగా తన అయిడెంటిటీ కార్డు చూపించాడు. ఓ ప్రముఖ ఆంగ్ల దినపత్రికకి అతను ఫ్రీలాన్స్ జర్నలిస్ట్.

"ఏంటి చెప్పండి" కార్డు అతనికిచ్చేస్తూ ముభావంగా అంది.

"మీ హాస్టల్లో వేకెన్సీలు లేవా? " సూటిగా అడిగాడు.

"అవన్నీ మా పైఅధికారులకి తప్ప మేం ఎవరికీ చెప్పకూడదు" బింకంగా అంది.

అతను ఆ హాస్టల్‌లో జరుగుతున్న అవకతవకల మీద తను సర్వే చేసి సేకరించిన వివరాలు తీసి ఆమె ముందుకి నెట్టాడు.

ఆ పని చేస్తున్నప్పుడు అతని మనసు ఓ క్షణం బాధపడింది. కానీ చెట్టుకింద నిల్చున్న మ్మాయి గుర్తొచ్చి దానిని మర్చిపోయాడు.

అవన్నీ చదివిన ఆవిడ మొహం పాలిపోయింది! "ఏం చెయ్యాలో చెప్పండి" హీనస్వరంతో అంది.

"తక్షణం ఇలాంటి పనులకి స్వస్తి చెప్పండి. వేకెన్సీని ఫిలప్ చెయ్యండి... కాగితాల్లో చూపించడం కాదు. నిజంగానే మనుషులకి మేలు చెయ్యండి" చెప్పాడతను.

ఆవిడ బెల్‌కొట్టి వాచ్‌మాన్‌ని పిలిచి సుజాతని పిలవమని చెప్పింది.

అతను లేచి వెళ్లడానికి నిలబడి "ఆ అమ్మాయి మీద కక్షసాధింపు చర్యలు చేపడతారేమో! నేను నిరంతరం నిఘాలోనే ఉంటాను" హెచ్చరికగా అన్నాడు.

అలా చెయ్యనన్నట్లు తలూపిందామె.

అతను గుమ్మం దాటుతుండగా తలెత్తి ధీమాగా నడుస్తూ వస్తున్న సుజాతని చూసుకోకుండా ఢీ కొన్నాడు.

"ఒళ్లు దగ్గరపెట్టుకుని నడవండి" పెళుసుగా అని లోపలికి అడుగేసిందామె.

నవ్వుకుంటూ బయటకి నడిచాడతను.

★ ★ ★

ఆ హాస్టల్‌లో చేరిన మరుక్షణంలోనే సుజాత లీడరైంది. వార్డెన్‌ని కొట్టిమరీ హాస్టల్‌లో సీటు సంపాదించినందుకు అందరూ ఎవరి మార్గాల్లో వాళ్లు అభినందించారు.

తనకి కేటాయించిన గదిలోకి వెళ్లిన సుజాత ఆ గది అవతారాన్ని చూసి అవాక్కయింది.

గోడలన్నీ పెచ్చులూడిపోయి అసహ్యంగా ఉన్నాయి. ఆ గోడల మీదే కాటుక మరకలూ, తిలకం మరకలూ కన్పిస్తున్నాయి. చాలా ఇరుకుగా వెంటిలేషన్ లేకుండా ఉంది. ఆ గదికి ఉన్న ఒకే ఒక కిటికీ కోసం అమ్మాయిలంతా పోట్లాడుకుంటారని రూమ్మేట్స్ చెప్పారు.

ఆ అతిచిన్న గదిలో మొత్తం పదిమంది ఉండాలి. కాళ్లుచాపి స్వేచ్ఛగా పడుకోడానికి కూడా వీలులేదు.

"ఇక్కడ ఫ్యాన్లు పనిచేయవు. వేసంగిలో ఆరుబైట పడుకుంటాం" ఓ అమ్మాయి చెప్పింది.

ఆ అమ్మాయి చెప్పిన చోటునూ చూసి వచ్చింది. పక్కనే యథేచ్ఛగా పారుతున్న మురుగు దాని మీద జుయ్యిన ఎగురుతున్న దోమలు.

అక్కడికి రాగానే ముక్కు మూసుకుంది సుజాత. "ఓయబ్బా! సుతారం! ఈ మాత్రం దిక్కులేకనే కదా ఇక్కడికి వచ్చి పడ్డావు" ఓ అమ్మాయి అక్కసుగా అంది.

సుజాత ఏమీ మాట్లాడలేదు. తమ గూడెంలో తమది హీనమయిన బతుకే కావచ్చు భవనాలూ సౌకర్యాలూ లేకపోవచ్చు పూరి గుడిసె అయినా అలికి ముగ్గులు పెడితే ఎంత ముద్దొస్తూ వుండేది? గుడిసె నుంచి అలా బైటికి రాగానే పచ్చదనం, చల్లదనం చుట్టుముట్టేవి...

ఆలోచనలు మళ్ళీ ఊరి మీదకి వెళ్ళిపోయాయి. ఆమెని అక్కడ వదిలేసి మిగతా పిల్లలు స్కూళ్ళకీ కాలేజీలకి వెళ్ళిపోయారు.

ఇంతలో వార్డెన్ పిలుస్తోందని కబురు వచ్చింది. వెళ్లేసరికి ఆవిడ యింత లావు బౌండు పుస్తకం ముందేసుకుని కూర్చునుంది.

"నీ సరిఫికెట్లు పట్రా!" సుజాతని కొరకొరా చూస్తూ అంది.

"ఎందుకూ? "

"ఎందుకేంటి? . నీ వయసు నిర్ధారించుకోవాలి"

"వయసుతో సంబంధమేంటి" అనుమానంగా అడిగింది.

"నీకు పద్దెనిమిదేళ్ళు నిండితే నువ్విక్కడ ఉండటానికి వీలవదు. ఇన్ని సదుపాయాలూ మేజరయ్యాక యిస్తారనుకుంటున్నావా? " కొట్టినట్లే అడిగింది.

మనసులోనే గబగబా లెక్కలు వేసుకుంది. తనకిపుడు పదిహేడు సంవత్సరాలు నిండాయి. తను డిగ్రీ ఫస్టియర్‌లో జాయిన వ్వాలనుకుంటోంది.

ఆ సంగతినే వార్డెన్‌తో చెప్పింది. అది వినగానే వార్డెన్‌కి సగం బరువు తగ్గినట్లయింది. "ఒక్క సంవత్సరం కళ్ళు మూసుకుంటే దీని పీడ విరగడవుతుంది" సంతోషంగా అనుకుంది.

సంవత్సరం తర్వాత పరిస్థితి ఏంటి? తల్చుకోగానే దిగులు మేఘం కమ్మింది సుజాతకి. కానీ ఒక తల విదిలింపుతో దాన్ని చెల్లాచెదురు చేసి ముందుకడుగేసింది.

తనిపుడు డిగ్రీలో జాయినవ్వడానికి కాలేజి వెతుక్కోవాలి. ఈ మహాపట్టణంలో అదెక్కడ వుందో!!

వార్డెన్‌నే అడగక తప్పదు.

"గవర్నమెంట్ డిగ్రీ కాలేజి ఎక్కడ వుందో చెప్పగలరా? ..." అభ్యర్థనగా అడిగింది సుజాత.

ఏ కళనుందో వెంటనే వివరాలు

చెప్పింది. "అడ్మిషన్లు ఇచ్చేస్తున్నారు. రేపెళ్ళి ప్రిన్సిపాల్ సార్‌ని కలువు. నేను ఫోన్ చేసి చెప్తాలే!" ఉదారంగా అంది.

"చాలా థాంక్స్" మనస్ఫూర్తిగా చెప్పింది సుజాత. అప్పటికే వార్డెన్ మెదడులో పగిలిన తేలు పొట్టలోంచి బిలబిల్లాడుతూ బైట కొచ్చే తేలు పిల్లల్లా ఆలోచనలు ముసురు కుంటున్నాయి.

గిడసబారిన సుజాత శరీరంలో అగ్నిజ్వాలలేవో కన్పించసాగాయి. పొగరుబోతు గుర్రాలనూ ఆడవాళ్ళనూ ఒక గాటన కట్టి వాళ్ళను లొంగదీయడం ద్వారా తమ మగతనాన్ని ప్రదర్శించుకునే రసికాగ్రేసరులు వార్డెన్ మనసులో మెదలసాగారు.

★ ★ ★

అది ప్రభుత్వ డిగ్రీ కళాశాల!

అప్పటికి వారం నుంచీ క్లాసులు ప్రారంభమయ్యాయి. పుస్తకాలు, బట్టలూ అన్నీ సమకూర్చుకునేసరికి ఆలస్యమైంది సుజాతకి. ఆరోజే కొత్తగా క్లాసులో అడుగుపెట్టింది. క్లాసు నిండుగా వుంది. రూం చిన్నది కావడంతో నలభై మందికే అది చాలా ఇరుగ్గా కన్పిస్తోంది.

ఆమె క్లాస్ రూంలో అడుగుపెట్టగానే అందరి కళ్ళూ ఆమె వైపే తిరిగాయి. ఆమె క్లాస్‌కి అరగంట లేటుగా రావడం ఆ చూపులకి కారణం.

ఆమెని చూడగానే చాలా మంది మొహాల్లో వెటకారం తొంగిచూసింది.

పాతబడిపోయిన లంగా, ఓణీ వేసుకుని, పోషణలేమిని తెలిపే ఎర్రని జుట్టుతో, కాగిపోయిన ఒంటి రంగుతో వున్న ఆమెని చూడగానే ఏదో అర్థమైనట్లయింది. ఆమె మొహాన బొట్టు లేకపోవడం కూడా వాళ్ళ ఊహలని మరింత పెంచింది. జూనియర్స్‌ని ఏడిపించడం కోసం క్లాసులో అందరితోపాటు కలిసిపోయి కూర్చున్న సీనియర్స్‌కి ఆమె ఎవరో వార్తాప్రసారం జరిగిపోయింది.

చేదెక్కిపోయాయి వారి వదనాలు.

"తులసివనంలో గంజాయి మొక్కలా ఎక్కడ దాపురించిందిరా! రేయ్! మావా! రోజూ దీని మొహం చూడాలి కాబోలు" ఒకడు నిట్టూర్చాడు.

లెక్చరర్ అనుమతితో లోనికి వచ్చింది సుజాత... ముందు ఖాళీ లేకపోవడంతో వెనక బెంచీలో కూర్చుంది.

అమ్మాయిల బెంచీలకి, అబ్బాయిల బెంచీలకి పెద్దగా ఎడం లేకపోవడంతో పక్కన కూర్చున్నవాడు కాలు ఇటు వైపు జరపడం ప్రారంభించాడు.

ముందు సుజాత చూసుకోలేదు. తను మధ్యలో రావడం చేత లెక్చరర్ చెప్పేది అర్థం చేసుకోవడానికి ప్రయత్నించసాగింది.

కాసేపటికి కాలు మీద ఏవో పాకుతున్నట్లయి చిన్నగా అరిచి కాలు విసిరింది. ఆ దెబ్బకి పక్క బెంచీలో కూర్చుని ఈ భాగోతం నడిపిస్తున్నతని కాలు వెళ్ళి బెంచీకి కొట్టుకుంది.

కుయ్యో మొర్రోమంటూ లేచి సుజాత వంక తీక్షణంగా చూడసాగాడు.

అతనికి ఏమయిందో తన వంక ఎందుకు కోపంగా చూస్తున్నాడో అర్థం కాలేదు సుజాతకి.

క్లాసులో సగం మందికి అతని పరాభవం అర్థమయింది. ముసిముసిగా నవ్వుకున్నారు. అతని ఫ్రెండ్స్ కూడా బాగా నవ్వడంతో అతనికి రోషం వచ్చింది.

"అది మన జూనియర్‌రా!" తన ఫ్రెండ్స్‌తో రోషంగా అన్నాడు.

అపుడు అందరికీ గుర్తొచ్చింది. ఆమెని ఏడిపించి తీరాలని సమయం కోసం కాచుకుని కూర్చున్నారు వాళ్ళు.

ఇంతలో పిరియడ్ ముగిసిన సూచనగా బెల్ మోగింది. ఆ లెక్చరర్ వెళ్ళిపోయి ఇంకో కుర్ర లెక్చరర్ వచ్చాడు. అతను ఫిజిక్స్ చెప్తాడంట. ఈ సంవత్సరమే

కొత్తగా ఎపాయింట్ అయ్యాడని అమ్మాయిలు చెవులు కొరుక్కుంటుంటే వింది సుజాత.

ఎక్కడో, ఎపుడో చూసినట్లనిపించింది ఆలోచించినా గుర్తు రాలేదు పోనీలే ఎవ రైతే నాకేంటి అని వదిలేసింది.

అతను రాగానే చిరునవ్వుతో క్లాసు పరిశీ లించాడు. "చాలా మంది కొత్తవాళ్ళు చేరిన ట్లున్నారే!" కలయజూస్తూ అన్నాడు.

సీనియర్స్ గమ్మున ఉండిపోయారు. సుజాత లేచి నిల్చుంది.

"నేను ఈ రోజే వచ్చాను సార్!" చెప్పింది.

"ఆ! ఆ! వచ్చింది మిస్ వరల్డ్" సీనియర్ ఒకతను స్టూడెంట్స్‌కి మాత్రమే వినబడేలా అన్నాడు.

అందరూ ఘొల్లున నవ్వారు.

మాస్టారుకి ఏమీ అర్థం కాలేదు. అదీకాక ఆ అమ్మాయిని చూడటంతోనే అతనికి కొద్ది పాటి ఆశ్చర్యం కలిగింది. మొత్తానికి అను కున్నది సాధించింది ఈ అమ్మాయి.

తలెగరేసి ఆమె నిల్చున్న తీరూ, ఆ మొహంలో పొగరు అతనికి ముచ్చటేసింది.

"ఓ.కే కూర్చో సుజాతా!" నవ్వుతూ అన్నాడు మాస్టారు.

ఆశ్చర్యంగా చూసింది సుజాత. తన పేరు ఇతనికి ఎలా తెలుసు? ఆమె ముఖం లోని ప్రశ్నని చూసి చిన్నగా నవ్వుకున్నాడ తను.

క్లాసంతా కూడా మాస్టారి వంక చూసింది. ఈ అమ్మాయి పేరు ఆయనకి ఎలా తెలుసా అని.

ఇంతలో అటెండర్ అటెండెన్స్ రిజిస్టర్ పట్టుకుని వచ్చాడు. మాస్టారు రవికిరణ్ అటెండెన్స్ వేస్తూ "సుజాతా! నీ రోల్ నంబర్ తెలుసా? " అని అడిగాడు.

ఆమె లేచి సమాధానం చెప్పేలోపు "ముప్పైయారు సర్" వెనకనుండి ఒకడు అరిచాడు. క్లాసంతా ఓ క్షణం స్తంభించింది తర్వాత మగపిల్లలు చాలా మంది బెంచీలు చరచి మరీ తమ హర్షాన్ని ప్రకటించారు.

రవికిరణ్ కుతూహలంగా సుజాత వంక చూశాడు. ఆమె మొహం అవమానంతో కందగడ్డలా మారింది. ఆ అవమానం కేవలం ఆమెదే కాదు. ఆమె కులానిది కూడా! అందుకే రవికిరణ్ కుతూహలంగా చూశాడు.

సుజాత లేచి ఆ మాట అన్నవాడి వైపు తిరిగి "మేము సరిగా మాట్లాడలేమని, మాకు భాష రాదని నీ ఉద్దేశమే అయితే నేను నీకు ఓ షాక్ ఇవ్వబోతున్నాను" అంటూ ఓ క్షణం ఆగి

"భూభృద్భిత్కరి కరిభి
ద్భూభృద్భృచ్ఛయన శేష భూభృత్త హిభృ
ద్భూ భృద్భూ భృద్భిద్ధయ
భూభృద్భి ద్రూప కీర్తి భూషణుడితడా"

సుజాత స్వరం ఖంగున క్లాసంతా మార్మో గింది.

విద్యార్థులంతా నిశ్చేష్టులయ్యారు. చాలా మందికి ఆమె మీద అమాంతం గౌరవం పెరిగిపోయింది.

రవికిరణ్ నమ్మలేనట్లు ఆశ్చర్యంగా చూశాడు. ఈ అమ్మాయిలో అసాధార ణత్వం ఏదో వుంది. నిప్పుకణికలా భగభగ లాడుతూ కన్పిస్తున్న ఆమెని చూస్తుంటే అతనికి కూడా గౌరవం కలిగింది.

కానీ సీనియర్స్ పరాభవాన్ని తట్టుకోలేక పోతున్నారు. ఎలాగైనా ఆమెను అవమా నించాలి. క్లాసులో రవికిరణ్ లేకపోతే ఈపాటికి ఆమె అంతు చూసి ఉండేవాళ్ళ మని పళ్ళు నూరుకున్నారు వాళ్ళు.

"వెరీగుడ్!" మెచ్చుకున్నాడు రవికిరణ్.

"ఎక్కడ నేర్చిందిరా ఈ కారుకూతలు? " ఒకడు ఉక్రోషంగా అన్నాడు.

రవికిరణ్‌కి వినబడటంలేదు కానీ సుజా తకి వినబడుతున్నాయి.

వినీ విననట్లు వదిలేసింది...



## ఆడపిల్ల గొడుగు

మద్రాస్ ప్రొవిన్షియల్ అసెంబ్లీలో అద్భుతమైన ప్రసంగమిచ్చారు శ్రీనివాస శాస్త్రి.

దానిపై రాజాజీవ్యాఖ్య: 'ఆడపిల్ల గొడుగు అందంగా చూడడానికి బాగానే ఉంటుంది. రంగు రంగుల గుడ్డ.. చక్కని రూపం అన్నీబాగానే ఉంటాయి. కానీ ఎండ, వాన, గాలి వేటినుంచీ రక్షించలేదు.. శాస్త్రి ఉపన్యాసమూ అంతే.

"ఇయ్యన్నీ కుర్ర పంతుల్ని బుట్టలో ఎయ్యడానికి రా మావా!" ఒకడు వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

ఇకాగలేక పోయింది సుజాత. టక్కున లేచి నిలబడింది. విసవిసా నడిచి ఆ మాటన్న వాడి ముందు నిలబడింది.

క్లాసంతా మాస్టారితో సహా నోరు తెరుచు కుని చూస్తున్నారు. "ఏంటి అంటున్నావ్?" కరుకుగా అంది సుజాత.

"ఏంటే నీ బోడి గొప్ప! ఇందాకటి నుంచీ చూస్తున్నాను" అతనూ మీద మీదకి వస్తూ అన్నాడు.

రవికిరణ్ నొసలు ముడివడింది.

"ఏంటి క్లాసులో న్యూసెన్స్! ఎవరి ప్లేస్‌లో వాళ్ళు కూర్చోండి" గట్టిగా చెప్పాడు.

ఇద్దరూ వినలేదు.

"ఇందాక ఏంటి పేలుతున్నావ్?"

"ఇంకా అంటానే!" అని గొంతు తగ్గించి "సార్‌నే కాదు. అందర్నీ బుట్టలో ఎయ్యా లనే!" అన్నాడు.

ఆ మాట వినగానే ఒక్క ఊపున అతని షర్ట్ కాలర్ పట్టుకుంది.

అప్పటి వరకూ బీరాలు పోయిన వాడు తత్తర పడ్డాడు.

"హే!... ఏయ్!... ఏంటిది వదులు!" గింజుకున్నాడు.

అతని పరిధిలో ఇంత వరకూ అతనేడి పించిన అమ్మాయిల్లో చాలా మంది తల వంచుకుని వెళ్లిపోగా కొందరు ఎదురు తిరి గారు. అదీ మాటలతోనే. అందులోనూ తనకి ధీటుగా రాలేక వెళ్లిపోయారు.

మొట్టమొదటిసారి తనని ఎదిరిస్తూ తన మీద చెయ్యేసింది అందులోనూ ఈ అమ్మాయి. వెంటనే ఎలా రియాక్టవ్వాలో తెలీలేదు.

ఈలోపే సుజాత అతన్ని షర్ట్ కాలర్‌ని పట్టుకుని ఊపేస్తూ "ఏరా! చదువుకునేది ఎవరినీ బుట్టలో ఎయ్యడానికి కాదురా! అది మీయమ్మ మీయక్క చేసే పనేమో!" అంటూ విసురుగా తోసేసింది.

వాడు వెళ్ళి బెంచీమీద కూర్చున్న వాళ్ల మీద పడ్డాడు. అమ్మాయిలు కెవ్వుమంటూ అరిచారు.

సుజాత కొంగు నడుం చుట్టు తిప్పి వాడి మీద కలబడడానికి సిద్ధమయింది.

సీనియర్స్ అబ్బాయిలు క్రూరంగా చూస్తూ లేచి నిలబడుతున్నారు.

'బాప్‌రే!' అనుకుంటూ కలగజేసుకున్నాడు రవికిరణ్. సుజాత చెయ్యి పట్టి వెనక్కి లాగి "నువ్వాగు!" చెప్పాడు.

అపుడొచ్చింది అతనికి అనుమానం. ఈ గలాటాకి కారణమైన వాళ్ళ వంక చూస్తూ "మీరు ఫ్రెషర్సేనా?" అడిగాడు.

మాట్లాడలేదు వాళ్ళు. వాళ్ళ చూపు సుజాత మీదే! "ర్యాగింగా?" తీవ్రంగా చూస్తూ అడిగాడు రవికిరణ్. పొగరుగా "అవును" అన్నాడొకడు.

"పోలీసులకి ఫోన్ చెయ్యనా? ర్యాగింగ్ కేసు కింద బుక్ చేయించాలా? వాళ్ళు మిమ్మల్ని బట్టలూడదీసి రోడ్డుమీద తన్ను కుంటూ తీసుకు వెళుతుంటే పేపర్లో న్యూస్ రాసి ఫోటో వేయించనా? " కరుగ్గా అడిగాడు. రవికిరణ్ మాటలు వినగానే వెనక్కి తగ్గి క్లాస్ నుంచి బైటకి వెళ్లిపోయారు.

'ఉఫ్'మని నిట్టూర్చి నుదుటికి పట్టిన చెమటని ఖర్చీఫ్‌తో తుడుచుకుంటూ సుజాత వంక చూశాడు.

తన ప్లేస్‌లో ధీమాగా కూర్చుని బోర్డ్ వంక చూస్తోంది. "మైగాడ్! కలకత్తా కాళిక" మనసులోనే అనుకున్నాడు.

"సుజాతా! క్లాసులయ్యాక కలువు" చెప్పాడు రవికిరణ్ తలూపింది.

అమ్మాయిలు ఈర్ష్యగా సుజాత వంక చూశారు.

★ ★ ★

క్లాసులయ్యేసరికి నాలుగున్నరయింది. ఉదయం తను బస్ దిగినచోటుని గుర్తు చేసుకుంటూ కారిడార్‌లో నడుస్తుండగా గుర్తొచ్చింది. క్లాసులయిపోయాక రవికిరణ్ సార్ తనని కలవమని చెప్పిన సంగతి.

ఓ క్షణం అటూ ఇటూ చూసింది. అంత పెద్ద భవంతిలో ఆయనెక్కడుంటాడో తెలీదు.

పక్కన వెళుతున్న అమ్మాయిని ఆపి అడిగింది. ఆ అమ్మాయి ఫైనలియర్. సుజాతని ఎగాదిగా చూసింది కానీ సమాధానం చెప్పలేదు.

విసుగనిపించింది సుజాతకి. ఇంతకీ సార్ ఎందుకు రమ్మన్నాడో తెలీదు. బహుశా ఉదయం జరిగిన గొడవకి క్లాసు తియ్యడానికేమో! అంత ఓపిక లేదు బాబోయ్! అనుకుంటూ ముందుకు అడుగేసింది.

హాస్టల్‌కి వెళ్లేసరికి అయిదుం పావు అయింది. వెళ్లగానే తన గదిలో పదిలంగా దాచుకున్న అర బకెట్ నీళ్లలోంచి ఒక మగ్ నీరు తీసుకొని కాళ్ళూ చేతులూ మొహం కడుక్కుంది. ఆ పని చేసేటపుడు ఊరు గుర్తొచ్చింది. భూషణంగారి బోరు నీళ్ళలో చేపపిల్లలు ఈదులాడటం గుర్తొచ్చింది.

ఈ హైదరాబాద్ నగరంలో నీటికి ఇంత కటకట అని తమకెవరికీ తెలీదు. రాష్ట్ర రాజధాని అని ఎంతో గొప్పగా ఊహించుకునేది తను. వాస్తవం వేరుగా వుంది. ఒక బకెట్ నీళ్ళతో రోజంతా గడపాలి. యిది ఎంతో నరకం.

బట్టలు మార్చుకుని వెళ్ళేసరికి అందరూ గాజుగ్లాసుల్లో పల్చగా ఎర్రనీళ్ళలా ఉన్న టీలో బన్ను ముంచుకుని తింటున్నారు.

ఈ టీలు, బన్నులూ, మేకుల్లాంటి అన్నం మెతుకులు, పప్పు ఎక్కడవుందో కనపడని సాంబారు. వీటితో తిండి అసలు ఎక్కడం లేదు. అయిష్టంగానే తిని కాలే కడుపుని, జోకొడుతూ తనగదిలోకి వచ్చి చదవడానికి పుస్తకాలు తీసింది.

"ఓ యబ్బో! రాంగానే చదువా? " రూమ్మేట్ వెక్కిరింపుగా అంది.

ఆమాట వినగానే నషాళానికి అంటింది.

"నీకెందుకు నా ఊసు? నీ పని నువ్వు జూసుకో!" కోపంగా అంది సుజాత.

ఆ అమ్మాయి ఓరగా చూసి వంకర నవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. వెళ్ళిందల్లా అయిదు నిమిషాల్లో బాచ్‌ని వెంట బెట్టుకుని వచ్చింది.

అందరూ కలిసి కూర్చుని నవ్వులూ, కేరింతలూ. వాళ్ళందరూ ఇంటర్ చదువుతున్నారంట. వయసు చూస్తే తనకన్నా పెద్దవాళ్ళలా వున్నారు. వాళ్ళందరినీ వార్డెన్ ఎలా హాస్టల్లో వుంచుతోంది? తనకేమో రూల్స్ చెప్పింది. యిందులో ఏదో మతలబు ఉందని ఆమె మనసు పసిగట్టింది.

వాళ్ళు మగవాళ్ళ గురించి అసభ్యంగా మాట్లాడుకోవడం విని ఆమె మనసు జుగు

ష్టతో నిండిపోయింది.

"ఈ కబుర్లన్నీ ఏంటి? చదువుకోనివ్వకుండా? " కోపంగా అంది.

"నీకేంటమ్మా! దొరబాబు లాంటోడిని పట్టావ్!" ఓ అమ్మాయి మూతివిరుస్తూ అంది.

"నేనా? " కళ్ళు పెద్దవి చేసి అడిగింది సుజాత.

"అవును. అతని మూలంగానేగా నీకు ఇక్కడ సీటు వచ్చింది. గెంటేసిన దాన్ని వూరికే పిలిచి చేర్చుకున్నారనుకున్నావా? "

"ఎవరతను? " అయోమయంగా అడిగింది.

"అబ్బ! ఏం ఎరగనట్టు? ఆ రోజు ఓ జర్నలిస్ట్ రాలేదూ! మీ కాలేజిలో ఫిజిక్స్ చెబుతాడంటగా! మరియ చెప్పిందిలే!"

"ఎవరూ రవికిరణ్ సారా? " ఆశ్చర్యంగా అంది.

"అవును మీ సారే" పక్కవాళ్ళకి కన్నుగిలిపి ముసిముసిగా నవ్వుతూ అంది ఆ అమ్మాయి

సుజాతకి ఏదో అర్థమైనట్లయింది. తను వార్డెన్‌తో కలబడుతున్నపుడు అక్కడ నిలబడి చోద్యం చూశాడూ! తర్వాత ఫోటోలు తీశాడు. తను వార్డెన్‌ని కలవడానికి వెళ్తుంటే చూసుకోకుండా తనని గుద్దుకున్నాడు ఈ సారేనా? అయితే సార్ మూలంగానే తనకి సీటు వచ్చిందన్నమాట" ఆలోచనల నుంచి తేరుకునేసరికి మిగతా వాళ్ళు సైగలు చేసుకుంటూ నవ్వుకుంటున్నారు.

"అదేంటో మరి నాకు తెలవదు" పెళుసుగా సమాధానం చెప్పింది.

"ఆ!ఆ! తెలవదు. తెలిసే రోజు వస్తుందిలే! ఎంతో దూరం లేదు. ఉట్టినే సాయం జేస్తారా? ఏదో వుందిలే! అయినా దీన్లో ఏం చూశాడో!" అనగానే అందరూ ఫకాలున నవ్వారు



తెలిసీ తెలియనట్లుగా వుంది. వాళ్ళమాటల్లో ఏదో గూఢార్థం వుంది. యిక వాళ్ళతో వాదించకుండా తనపని తను చేసుకోసాగింది. కానీ మధ్యమధ్య వాళ్ళ మాటలు చెవులబడుతూనే వున్నాయి.

ఇంతలో వాచ్‌మాన్ వచ్చి "రత్నా! వార్డెన్ మేడమ్ పిలుస్తున్నారు. తొరగా ఎల్లుమరీ!" వెకిలిగా నవ్వుతూ తొందర చేశాడు.

"ఆ! ఈరోజు పంట పండిందిలే! డైరక్ట్‌గా ఎల్లిపోకుండా ఏదో షాపులో జొరబడు" ఓ అమ్మాయి సలహా యిచ్చింది.

అందరూ కలిసి రకరకాల హాస్యాలు చేసి మరీ రత్నని సాగనంపారు!

చదవడం మర్చిపోయి మరీ మతిపోయినట్లుగా వాళ్ళ మాటలు వింటోంది సుజాత.

ఇంతకీ రత్న ఎక్కడికి వెళుతోంది? పంట పండటం ఏంటి? ఆలోచిస్తుండగానే మిగతావాళ్ళందరూ కూడా రత్న కోసం వచ్చినవాళ్ళని చూడటం కోసం ఎగబడసాగారు.

రూమ్ ఖాళీ అయిపోయింది. అప్పటివరకూ వాళ్ళమాటలూ, నవ్వులతో మార్మోగిపోయిన గదిలో ఒక్కసారిగా నిశ్శబ్దం అలుముకుంది.

రూం మధ్యలో చలనం లేనట్లు నిల్చుంది సుజాత. ఆమె మెదడులో ఒకే ఒక ప్రశ్న సుడులు తిరుగుతోంది.

"ఏం జరుగుతోందిక్కడ? " అప్రయత్నంగా ఆమె నోటినుండి వచ్చిందా ప్రశ్న.

కాసేపు నిశ్శబ్దం.

ఆ తర్వాత గుండెలు జలదరించేలా రూంలో ఓ మూల నుంచి సన్నగా మొదలయిన రోదన స్వరం క్రమంగా ఉధృతమవసాగింది.

ఉలిక్కిపడి అటు చూసింది సుజాత. ఓ మూలన కూర్చుని ఉందో అమ్మాయి. పదహారేళ్లుంటాయేమో! రెండు చేతులూ మొహాన కప్పుకుని కుళ్లికుళ్లి ఏడుస్తోంది.

గుండెలు పిండేసినట్లయింది. ఒక్కక్షణం

కూడా రూంలో నిలవలేకపోయింది. పుస్త కాలు పట్టుకుని వరండాలోకి వచ్చి మన సుని నలిబిలి చేసే ఆలోచనలను వదిలిం చుకునే ప్రయత్నం చేయసాగింది సుజాత.

★ ★ ★

మర్నాడు ఉదయం సుజాత లేచేసరికే రత్న రూమ్‌లో ఉంది. ఎలా వచ్చింది అలాగే పడుకున్నట్లుగా ఉంది. వంటిమీ దున్న చుడిదార్ నలిగిపోయివున్నా దాని కొత్తదనం కంటికి తెలుస్తూనే ఉంది.

మనసుకి విషయం తడుతూనే ఉంది. కానీ కన్‌ఫాం చేసుకోడానికి మనసు నిర్ఘాం తపోతోంది.

ఇక్కడ జరుగుతున్నదంతా వార్డెన్‌కి తెలుసా? తెలియకుండా ఎలా ఉంటుందిలే! వాచ్‌మాన్ వచ్చి వార్డెన్ మేడమ్ పిలుస్తుం దని చెప్పాకేగా రత్న కులుక్కుంటూ వెళ్లింది.

అమ్మో! వచ్చి వచ్చి ఎలాంటి నరక కూపంలో పడింది! ఇష్టం లేకపోయినా ఇలాంటి పాపపు పనులు చేయిస్తారా?

నిన్న సాయంత్రం అందరూ వెళ్లిపోయాక రూంలో అమ్మాయి ఏడ్చిన ఏడ్పు చెవుల్లో మార్మోగింది. మనసు కలుక్కుమంది...

రత్న ఒళ్లు విరుచుకుంటూ లేచింది. చప్పున చూపు మరల్చుకుంది సుజాత. ఆమె వంక చూడాలంటే బెరుగ్గా అన్పిం చింది.

గబగబా తయారయి మెస్‌లో వాళ్లు పెట్టిందేదో తిని ఇంత ఉడికీ ఉడుకని అన్నాన్ని తోటకూర పులుసుని బాక్స్‌లో వేసుకుని పుస్తకాలు పట్టుకుని కాలేజీకి బయలుదేరింది.

ఆఫీసు గది దాటేటపుడు అప్రయత్నంగా చూపు లోపలికి ప్రసరించింది.

వార్డెన్ కూర్చుని ఉంది. చప్పుడుకి తలెత్తి సుజాతని చూసి సమ్మోహనంగా చిరునవ్వు విసిరింది.

గుండెలు దడదడ లాడుతుండగా ప్రతిగా నవ్వనుకూడా నవ్వకుండా గబగబా ముందుకు నడిచింది.

కాలేజీకి వెళ్లేవరకూ దోవపొడుగునా ఆలోచనలే. వార్డెన్ తనని గెంటేస్తే రవికి రణ్ సార్ ఏదో మాట్లాడి తనని హాస్టల్లో చేర్పించాడు. ఎందుకు? అతనికి ఏంటి అవసరం? . అతనూ ఇలాంటి వాడేనా?

తనమీద దురుద్దేశం పెట్టుకున్నాడా? ఆ ఊహకి కాళ్లు వణికినట్లయ్యాయి.

అందుకనే తనని క్లాసయ్యాక కలవమని చెప్పాడా? ఇంకానయం తను వెళ్లి కలి సింది కాదు.

తనని తాను సమాధాన పర్చుకుంటూ క్లాసుకి వెళ్లికూర్చుంది. మొదటి పిరియడ్ అన్యమనస్కంగానే గడిపింది. బెల్ మోగం గానే మనసులో కూడా ప్రమాద ఘంటికలు మోగాయి.

రవికిరణ్ చిరునవ్వుతో లోనికి ప్రవేశిం చాడు. అపుడు పరిశీలనగా చూసిందతన్ని. తెల్లగా, పొడవుగా, సన్నగా ఉన్నాడు. నిన్న క్లాసులో అమ్మాయిలు అంటున్నారు 'స్మార్ట్' అని యిలా ఉంటే స్మార్ట్ కాబోలు.

ఇతను కావాలంటే ప్రేమలో పడటానికి క్లాసులో చాలామంది అమ్మాయిలు సిద్ధంగా ఉన్నారు. అలాంటపుడు తన మీద దృష్టి ఎందుకు పెట్టినట్లు?

సార్ క్లాసులోకి రాగానే కించిత్ ఆత్రు తతో అందరివంకా చూడటం తను కనపడ గానే అతని ముఖంలో మరింత పెరిగిన వెలుగు అయోమయానికి గురిచేశాయి.

ఈ రోజు క్లాసులో సీనియర్స్ ఎవరూలేరు. పాఠం సజావుగా సాగిపో యింది.

అతను పాఠం చెప్పేతీరు వినసొంపుగా ఉంది. ఎంత క్లిష్టమయిన విషయాన్న

**అపజయం వల్ల నిరాశకు గురి కావచ్చు. కానీ మళ్లీ ప్రయత్నం చేయకపోతే పతనం తప్పదు.** –బెవర్లీ సిల్స్

యినా అర్థమయ్యేలా విడమర్చి చెపుతున్నాడు... తనకి తెలీకుండానే పాఠంలో లీనమయిపోయింది.

పాఠం మధ్యలో తను చెప్పిన దానిమీద అతను ప్రశ్నలు కూడా అడుగుతూ ఉండటంతో అబ్బాయిలు కూడా శ్రద్ధగానే వింటున్నారు.

అందరినీ అడిగినట్లే తననీ ప్రశ్న అడిగాడు సార్. కానీ అడిగినపుడు అతనిలో మరింత ప్రస్ఫుటమవుతున్న చైతన్యం ఆలోచనల్లో పడేస్తోంది.

సమాధానం తెలిసినా పెంకిగా తప్పు చెప్పింది. అయినా అతను చిరునవ్వు మాయని మొహంతో ఆమెని కరెక్ట్ చేశాడు. క్లాసయ్యి అతను వెళ్ళిపోయేముందు "నిన్న ఎందుకు కలవలేదు" అని అడుగుతాడనిపించింది.

కానీ అదేమీ లేకుండానే అతను మామూలుగానే వెళ్ళిపోయాడు.

సాయంత్రం హాస్టల్ కి వచ్చేముందు బస్టాప్‌లో సీనియర్స్ ముగ్గురు నిలబడి ఉన్నారు. అల్లరి పెడతారేమోనని భయం వేసింది. కానీ పోలీస్ కానిస్టేబుల్స్ ఇద్దరు ఈ పనిమీదే అక్కడ కాపలా వుండటంతో అదేమీ జరగలేదు.

★ ★ ★

పల్లెలో ఉన్నప్పుడు ఎప్పుడూ జిర్రున చీది ఎరుగని సుజాతకి తరచుగా జలుబు, రొంపా పీడించేవి. అప్పుడప్పుడూ విరోచనాలు అవుతుండేవి. కడుపులో నులినెప్పిలా వుండేది.

తనకే కాదు. హాస్టల్లో చిన్నపిల్లలకి కూడా ఇలాగే వుండేది. తనతోటి వాళ్ళలో కూడా చాలామంది బాధపడుతున్నారు.

మిగతా వాళ్ళు ఎలా వున్నా, రత్న, ఆమెతో కలిసికట్టుగా తిరిగే అమ్మాయిలు ఎప్పుడూ ఏ బాధలూ లేనట్లుగా వుండేవారు.

వాచ్‌మాన్‌కి డబ్బులిచ్చి ఎప్పుడూ బిర్యానీ పొట్లాలో, పకోడీలో, సమోసాలో ఏవో తెప్పించుకుని తింటుండేవారు.

వాళ్లకి అంత డబ్బు ఎక్కడి నుంచి వస్తోందో, ఆ డబ్బే వుంటే ఇక్కడెందుకు చేరారో ఎవరూ అడగరేమిటని ఉక్రోషం వచ్చేది.

మెస్‌లో వంటలు వేడి మీద ఉన్నప్పుడు తింటే అందులో రుచీ పచీ తెలిసేది కాదు. కొంచెం చల్లారాక తింటే ఇక అంతే సంగతులు. పాచివాసన వెయ్యటమో, ఇంకోటేదో ఉండేది.

భోజనాలప్పుడు అందరూ కలిసి పెద్ద హాల్లో రాతి బల్లల మీద కూర్చుని అన్నాలు తినేవారు. ఆ పరిసరాలన్నీ మురికి ఓడుతూ ఉండేవి.

ఆ గదిని వారానికోసారన్నా శుభ్రం చేస్తారా అన్న అనుమానం వచ్చేది.

ఆ రోజు కాలేజీకి వెళ్ళే తొందరలో ఉంది. ఇంకా అన్నం అవలేదు. ఆయాని కనుక్కుందామని కిచెన్‌లోకి అడుగుపెట్టింది.

అక్కడి వాతావరణం చూడగానే ఒక్కసారిగా రోతపుట్టింది.

తనకి తరచుగా అనారోగ్యం ఎందుకు కలుగుతోందో అర్థమయింది. గదంతా మసి నాలుగంగుళాల మందాన పేరుకుంది. ఆ గదిలో బూజులకి కూడా మసి పట్టి నల్ల పీలికల్లా వేలాడుతున్నాయి.

కింద నేలంతా బురదగా ఉంది. ఆ నేల మీదే కూరగాయలు పడేసి కోస్తున్నారు. ఆ కూరలు కడిగే నీళ్ళు చూడగానే కళ్ళు తిరిగాయి. అంత నల్లగా ఉన్నాయవి.

వంట చేస్తున్న వాళ్ళు చెమటలు చేత్తో తుడుచుకుంటూనే అదే చేత్తో అతి లాఘవంగా వంట చేసి పడేస్తున్నారు. ఇంతలో ఇంకో దృశ్యం కళ్ళబడింది. కళ వెళా ఉడుకుతున్న అన్నం డేగిశాలో రాత్రి మిగిలిపోయిన అన్నాన్ని కూడా వేస్తున్నారు.

"ఏంటది" కళ్ళు పెద్దవి చేస్తూ అడిగింది.

చప్పుడుకి తిరిగి చూసిన ఆయా సుజా తని చూసి మొహం చిట్లిస్తూ "నీకిడ ఏం పని? " కొట్టినట్లే అడిగింది.

ఆ మాట వినిపించుకోలేదు సుజాత.

"రాత్రి అన్నాన్ని అందులో వేస్తున్నా రేంటి? మళ్ళీ ఆ మిగిలిపోయిన అన్నాన్ని రాత్రికి వండే అన్నంలో కలుపుతారా? " కోపంగా అడిగింది.

వంటతను ఎగాదిగా చూశాడు. బకెట్‌లోని సాంబారుని చూపిస్తూ "ఇవిగో! ఇవి రాత్రి మిగిలినవే! ఈ రోజు వండేదాన్లో పోస్తున్నా చూడు" అంటూ మరుగుతున్న సాంబారులో ఇవీ పోసి

"ఎల్లెల్లవమ్మా! మా చెప్పొచ్చావు.... అన్నీ ఫ్రీగా ఇస్తంటే తిని కూచోక ఆరాలు" గట్టిగా అన్నాడు.

చేసే తప్పుడు పనులు చేసేది కాక అదేం టని అడిగితే తననే గదమాయిస్తున్నాడే!

"ఏఁ? నువ్వేమన్నా ఫ్రీగా ఇస్తున్నావా? " వెటకారంగా అడిగింది.

"ఆహా! అంతవరకొచ్చిందా? " పైనుంచి కిందికి విచిత్రంగా చూస్తూ అన్నాడు.

"గవర్నమెంట్ మాకోసం, మా డెవ లప్‌మెంట్ కోసం డబ్బులిచ్చి, మా సదుపా యాలు చూడటం కోసం మిమ్మల్ని నియ మించింది. అంతేకానీ పాచిపోయిన వంటల్ని మాకు పెట్టమని కాదు. ఇలాగైతే తనిఖీ ఇన్‌స్పెక్టర్ వచ్చినప్పుడు అన్నీ చెప్పాల్సి ఉంటుంది" బెదిరింపుగా అంది.

ఇలాంటి విషయాల్లో వాదనలు చెయ్యవ ద్దని వార్డెన్ స్ట్రిక్ట్‌గా చెప్పడం చేత 'నీలాంటి వాళ్ళని చాలామందిని చూశానని" మన సులో అనుకుని ఊరుకున్నాడు. ఎవరూ ఇక మాట్లాడలేదు. వాళ్ల పనుల్లో నిమగ్న మయ్యారు.

"అవన్నీ తీసేసి మళ్ళీ వండండి" గట్టిగా చెప్పింది సుజాత.

"వెళ్ళి వార్డెనమ్మతో చెప్పమ్మా. మాతో జగడం ఎందుకు? ఆయమ్మ చెప్పినట్టు మేం చేత్తన్నం" ముసలావిడ అంది.

"సరే! ఆవిడనే అడుగుతా" అదే ఊపున ఆఫీసు గదిలోకి వచ్చి పడింది. అక్కడ వార్డెన్ వారపత్రికలో సినిమా యాక్టర్ల మీద ఇచ్చే బాక్స్ అయిటమ్స్ చదవడంలో లీనమయి ఉంది.

"మేడమ్!" చిన్నగా పిల్చింది సుజాత.

మధ్యలో డిస్టర్బ్ చేసినందుకు విసుక్కుంటూ తలెత్తి సుజాతని చూసి సాధ్యమయినంత వరకూ మొహాన్ని ప్రసన్నంగా ఉంచడానికి ట్రై చేస్తూ "ఏంటీ? ' ' అంది.

"మీరొకసారి కిచెన్‌వైపు వెళతారా? " ఆవే శాన్ని అణచుకుంటూ అంది.

"ఎందుకు? "

"కిచెన్ శుభ్రంగా లేదు. పాచివంటలు ఇప్పుడు వండే దాన్లో కలుపుతున్నారు. మాకెవరికీ ఆరోగ్యాలు సరిగ్గా ఉండటం లేదు" గబగబా చెప్పింది.

"సరే! నే చూస్తాలే. నువ్వెళ్ళు" తాపీగా అందామె.

"మీరిప్పుడే వెళ్ళాలి. ఆ వంటే మళ్ళీ మాకు వడ్డిస్తారు" కంఠస్వరంలో కరకు దనం.

"నేను చూస్తానన్నాగా!" ఈసారి వార్డెన్ స్వరంలో కరకుదనం.

"మేమా తిండి తినం" పంతంగా అంది సుజాత.

"ఏంటే! ఊరుకున్నకొద్దీ పేలుతున్నావ్. నీ దిక్కున్నచోట చెప్పుకో!" భీకరంగా అరి చింది వార్డెన్.

ఒక్క క్షణం ఉలిక్కిపడింది మళ్ళీ తేరు కుని.

"నేను ప్రభుత్వానికి ఫిర్యాదు చేస్తా!" గట్టిగా అంది సుజాత.

"చేసుకో! ఇక్కడ నుంచి ఫో ముందు" అరిచింది వార్డెన్.

రోషంతో బుసలు కొడుతూ బయటికి వచ్చింది సుజాత. మెస్ హాల్లో పిల్లలు ఆవు

రావురుమంటూ పుల్లటి ఇడ్లీలలో ఆ సాంబారు వేసుకుని తింటుంటే ఒంట్లో తిప్పేసింది.

అశక్తతతో టిఫిన్ బాక్స్ నేలకేసి కొట్టింది. ఖంగ్‌మన్న శబ్దంతో అది నేలపై పడింది. అందరూ ఆమెకేసి విచిత్రంగా చూసి తలలు తిప్పుకున్నారు.

విసవిసా నడుస్తూ బస్టాప్‌కొచ్చింది. ఆకలీ, అవమానాలతో ఒళ్ళు దహించుకుపోతోంది. ఎలా కాలేజీకి వచ్చి పడిందో తెలీదు.

క్లాసులు ప్రారంభమయ్యాక కాస్తంత మెరుగ్గా అనిపించింది. ఎప్పుడూ చలాకీగానూ, పెంకిగానూ, మొండిగానూ కన్పించే సుజాత క్లాస్‌లో మూడీగా ఉండటం రవికిరణ్‌కి ఆశ్చర్యాన్ని కలిగించింది కానీ అతను బైటకి ఎక్స్‌ప్రెస్ చెయ్యలేదు.

సాయంత్రం బస్టాప్‌లో బస్‌కోసం ఎదురు చూస్తుండగా రవికిరణ్ కూడా వచ్చాడు.

సుజాతని చూసి పలకరింపుగా నవ్వాడు. విష్ చేసింది సుజాత.

"హాస్టల్లో ఎలా ఉంది? " మృదువుగా అన్నాడు. టక్‌మని బల్బు వెలిగింది సుజాతకి. ఇతనికి ఏదో పరపతి ఉండే ఉంటుంది. లేకపోతే తనని గెంటించిన వార్డెన్ ఎలా జాయిన్ చేసుకుంది? అక్కడ జరుగుతున్నవి ఇతనికి చెప్తే? "

"ఏం బావోలేదు సార్!" నిర్మొహమాటంగా, నిర్భయంగా అంది.

ఆ సమాధానానికి నవ్వొచ్చిందతనికి.

"ఏం? "

"పాచిపోయిన వంటలు పెడుతున్నారు. గదులన్నీ కిచెన్‌తో సహా మురిగ్గా ఉన్నాయి. ఇంకా... ఇంకా" రత్న వాళ్ళ గురించి ఏం చెప్పాలో తెలీక మౌనం వహించింది.

ఆ 'ఇంకా' మీద రవికిరణ్‌కి కూడా డౌటుంది. సుజాత సేఫ్టీ గురించి అతని మనసు ఓ క్షణం మధనపడినా ఈ అమ్మాయి జోలికి వచ్చే ధైర్యం చేయరనుకుని సమాధానపడ్డాడు.

"మరి ఏం చెయ్యాలనుకుంటున్నావు? "

"ప్రభుత్వానికి చెపుతా!" రాజకీయ నాయకురాలిలా అంది.

"ఆ చెప్పేముందు నువ్వు చేయగలిగింది ఏమైనా ఉందేమో ఆలోచించు" చెప్పాడు.

"నేనా? నేనేం చెయ్యగలను? " అందే కానీ తీవ్రంగా ఆలోచిస్తోందనడానికి చిహ్నంగా నొసలు ముడిపడింది.

"నీ పని నువ్వు చెయ్యి. తర్వాత జరగాల్సింది అదే జరుగుతుంది" చెప్పి అతను వెళ్లాల్సిన బస్ రావడంతో వెళ్ళిపోయాడు.

ఆ రోజంతా ఆలోచించింది. రెండు రోజులయ్యాక తనేం చెయ్యాలో బోధపడింది.

ఆ రోజు ఆదివారం. ఉదయాన్నే నిద్రలేచింది. సుజాత హాస్టల్‌లో పిల్లలందరినీ లేపింది. రత్నా వాళ్ళు లేవలేదు. సుజాత మీద విసుక్కుని మళ్ళీ పడుకున్నారు.

పిల్లలందర్నీ సమావేశపర్చి ఎవరెవరు ఏమేం పనులు చెయ్యాలో చెప్పింది. వింతగా విన్నారు పిల్లలు. తర్వాత చప్పట్లు చరిచి మరీ తమ ఆనందాన్ని ప్రకటించారు.

అంతా కలిసి చేతికి దొరికిన చీపుర్లు, చాటలు పట్టుకుని బూజు మీద దండయాత్ర ప్రారంభించారు.

ముందుగా కిచెన్‌లో జొరబడ్డారు. అక్కడ ఇంకా పొయ్యి వెలిగించలేదు. పీలికలుగా వేలాడుతున్న బూజుని లాగేశారు గానీ గోడలకి ఉన్న మసిని ఎలా పోగొట్టాలో తెలీక తెల్లమొహం వేశారు.

అక్కడికి ఆ గదిని వదిలేసి మెస్ హాలుని శుభ్రంగా తుడిచేసి ఒక్కొక్కరూ ఒక్కో మగ్ నీరు త్యాగం చేసుకుని గదులన్నీ తడిగుడ్డలు పెట్టితుడిచేశారు.

"గోడలకి సున్నం వెయ్యాలి" సుజాత ప్రకటించగానే 'వేసేద్దాం వేసేద్దాం' పిల్లలు ఉత్సాహంగా తొందరపడ్డారు.

"సున్నం ఎక్కడ? " అనగానే స్టోర్ రూం చూపించింది ఓ అమ్మాయి.

స్టోర్ రూంలో అపుడే వంటతను వంట సామాగ్రి తీస్తున్నాడు. గది బయట కలకలం విని కంగారుగా బైటకి వచ్చి "ఏంటీ? " కసురుతూ అన్నాడు.

"సున్నం కావాలి" పిల్లలు కోరస్‌గా అరిచారు.

"సున్నం లేదూ అన్నం లేదూ పోండవతలికి" కోపంగా ఉరిమి చూశాడతను. అందరూ నిలబడిపోయారు. ఓ బుడత మాత్రం తలుపుకీ అతనికీ ఉన్న సందులోంచి దూరిపోయి లోపల వెతకడం మొదలుపెట్టింది. ఉంకో నలుగురు పిల్లలు ఆ అమ్మాయిని అనుసరించారు.

రెండు నిమిషాల్లో సున్నం బాగులు మోసుకొచ్చి బయటపడేశారు.

వార్డెన్ నిద్రలేచి ఆవులిస్తూ బయటకి వచ్చేసరికి బుసబుసా పొంగుతున్న సున్నం బకెట్లతో పిల్లలు కన్పించారు.

"ఏయ్! ఏం చేస్తున్నారు? " కంగారుగా అడిగింది "హాస్టలంతా శుభ్రం చేసి సున్నం వేస్తున్నాం" చెప్పారంతా క్షణంలో మనసులో లాభనష్టాలు బేరీజు వేసుకుని నష్టం ఏమీ లేదని తేలడంతో మొహం ప్రసన్నంగా పెట్టి "వెయ్యండి మంచిదే" చిరునవ్వుతో అంది.

ఆ మాట వినగానే అందరిలో మరింత హుషారు వచ్చింది. నవ్వులూ, కేరింతలతో మధ్యాహ్నం అయ్యేసరికి హాస్టల్ గోడలన్నింటినీ తెల్లగా మెరిపించేశారు.

రత్నా, ఆమె స్నేహితురాళ్ళు మాత్రం సెలవు రోజున నిద్రని వృధా చేసిందని సుజాతని తిట్టుకుంటూ బయటకి వెళ్ళిపోయారు.

శుభ్రం చేశాక భవనం ఓ మాదిరిగా తయారయింది. బీడువారిన పొలాల మీద నాలుగు వాన చుక్కలు పడినట్లుగా వుంది.

మధ్యాహ్నం భోజనాలు ప్రారంభమయ్యాయి. యధావిధిగా అవే పాచివంటలు. నోట్లో పెట్టుకోవాలంటే భయం వేస్తోంది. కానీ ఎన్నాళ్ళు తినకుండా. వుండాలి?

సార్ తనతో ఇన్‌డైరక్ట్‌గా తనేం చెయ్యాలో చెప్పాడు. తను అలాగే చేసింది. కానీ జరగాల్సినవి అవే జరుగుతాయన్నాడు. కానీ ఏ అద్భుతాలూ జరగలేదే? . ఎవరూ వచ్చి తమ కష్టాలు తీర్చలేదే!. సుజాత యిలా ఆలోచిస్తుండగానే హాస్టల్ ముందు జీపు వచ్చి ఆగింది. అందులోంచి ఓ వ్యక్తి ముందు దిగాడు. వెనుక సీట్లోంచి దిగిన మరో యిద్దరు అతన్ని అనుసరించారు.

వాళ్ళ బూట్ల చప్పుడు కారిడార్లో ప్రతిధ్వనించాయి వాళ్ళు భోజనాల హాల్లోకి రాగానే అందరూ తినడం ఆపి వాళ్ళవంకే చూశారు.

వంటతను, ఆయా వంటగదిలో హడావిడి పడటం గమనించింది సుజాత. రవికిరణ్ సార్ మాటలు గుర్తొచ్చాయి. వీళ్ళని ఎంక్వయిరీకి పంపి వుంటారు అన్న ఆలోచన రాగానే మొహం వికసించింది.

అతను రావడంతోనే అటూ యిటూ కలయచూసి "వార్డెన్ మేడమ్ ఎక్కడ? " అడిగాడు.

అప్పటికే అతని రాకని గమనించి తాపీగా నడుచుకుంటూ వచ్చిందామె.

"తనిఖీచెయ్యమని ఆర్డర్స్" ముసిముసిగా నవ్వుతూ అన్నాడతను సుజాత అతని వంక విస్తుపోయి చూసింది.

"తణిఖీలు చెయ్యడం మీకలవాటేగా చెయ్యండి" వార్డెన్ మూతి ముడుస్తూ అంది.

మిగతా పిల్లలు తమకిదంతా అలవాటేనన్నట్లు మొహాలు దించుకుని భోజనాలు చెయ్యసాగారు. సుజాత మాత్రం లేచి నిలబడి "మాకిక్కడ భోజనాలు బాగోలేవు సార్!" అంది.

క్షణం కాలం సూదిపడినా వినబడేంత నిశ్శబ్దం ఆవరించింది. ఎందుకంటే యింతకుముందు ఎవరూ ఇలా అనే సాహసం

చేయలేకపోయారు.

"ఈజిట్? " అతను సుజాత వైపు చూసి అన్నాడు "అవును కావాలంటే మీరూ తిని చూడండి" నిర్భయంగా అంది. వార్డెన్ కోపంగా ఏదో అనబోతే ఆమెని వారించి అతను కూడా పిల్లల పక్కన భోజనానికి కూర్చున్నాడు.

ఆ అధికారికి కూడా భోజనం వడ్డించారు. వంట తను, ఆయా చాలా నిర్వికారంగా వున్నారు. వారి మొహాల్లోని భావాలను పసి గట్టడం చాలా కష్టంగా వుంది.

వేడి వేడి అన్నం, సాంబారు వడ్డించారు. అతను నాలుగు ముద్దలు తిని లేచాడు.

అతని రియాక్షన్ కోసం అంతా ఆతృతగా ఎదురుచూస్తున్నారు. ఏమీ మాట్లాడకుండా నాప్‌కిన్‌తో చేతులు తుడుచుకున్నాడు. వార్డెన్ అతన్ని ఆఫీసు గదిలోకి తీసుకువెళ్ళ బోతుండగా అడ్డం వచ్చింది సుజాత.

"మాకిక్కడ చాలా సమస్యలు వున్నాయి" ధైర్యంగా అంది వార్డెన్ ఉరిమి చూసింది. లెక్కచెయ్యలేదామె. ఆ అధికారి తప్పనిసర న్నట్లు ఆగి "ఏంటవి? " అడిగాడు.

"ఇక్కడ పరిశుభ్రత లేదు. మాకు ఆరోగ్య కరమైన, వంటలు లేవు. ఆదరణ లేదు. సరయిన బట్టలు యివ్వడం లేదు" ఆమె ఏకరువు పెడుతుంటే అతను చెయ్యెత్తి వారించి

"ఈ హాస్టలంతా సున్నాలు వేసి పరిశు భ్రంగా ఉంది. భోజనం నేనిప్పుడే తిన్నాను బావుంది. ఇక బట్టలంటావా సినిమా యాక్టర్లలా తయారవ్వాలంటే ప్రభుత్వం మాత్రం ఎక్కడని భరించగలదు? " అతను వ్యంగ్యంగా అంటుంటే సుజాతతో సహా అందరూ తెల్లబోయి విన్నారు.

వాళ్ళు ఆ షాక్ నుంచి తేరుకునే లోపే వాళ్ళిద్దరూ ఆఫీసు రూంలోకి వెళ్ళిపో యారు.

సుజాతకి మొదటిసారిగా రవికిరణ్ మీద కోపం వచ్చింది. అతనేదో చేస్తాడని నమ్మితే చివరికి ఇలాంటి అధికారిని పంపాడు. ఇక ఇక్కడ జరుగుతున్న అన్యాయాలను సరి చేసే వాళ్ళు ఎవరూ లేరా? . అయినా ఆశ వీడనట్లు ఆఫీస్ రూం వైపు నడిచింది సుజాత. అక్కడ వార్డెన్, ఆ అధికారి నవ్వుతూ తుళ్ళుతూ కబుర్లు చెప్పుకుంటు న్నారు. ఆ అధికారి ముందు స్వీటు, హాటు, కూల్‌డ్రింక్ సీసా కన్పించాయి.

"వాంతి వచ్చేస్తుందనుకున్నాను. ఎలాగో ఆపుకున్నాను. నాకీ తిప్పలేంటి? " కుర్చీలో వెనక్కి వాలుతూ పెదాల మీద చిరునవ్వు చిందులేస్తుండగా అంటున్నాడతను.

"నా కోసమా తిప్పలు? వాటా కోస మేగా!" అతని మాటల్ని తిప్పికొడుతూ అంది వార్డెన్ పకపకా నవ్వాడతను! "అంత ఉడుకు మోత్తనం ఎందుకు? ఉన్న మాటేగా అన్నాను" అతను మళ్ళీ అన్నాడు.

గుమ్మం పక్కన నిలబడి వింటున్న సుజా తలో ఆవేశం పొంగింది. రూపానికి దొర కని అనుమానాలు అల్లిబిల్లిగా అల్లుకుంటు న్నాయి.

హాస్టల్ గేటు దగ్గర ఏవో వాహనాలు ఆగిన చప్పుడు. గుమ్మం బైట చెవులు రిక్కించింది సుజాత.

గదిలో కూర్చున్న ఆ అధికారీ సందే హంగా చూస్తూ ఆ చప్పుడుని ఆలకించాడు.

"కారేదో ఆగినట్లుంది? " వార్డెన్‌తో అన్నా డతను. విరగబడి నవ్వింది వార్డెన్ "యింత భయస్థులేంటండీ! మీరు తనిఖీకి వచ్చాక ఇంక ఎవరు వస్తారు? " ధీమాగా అంది అప్పటికి అతనికి తన దర్పం గుర్తొచ్చింది. కుర్చీలో మరింత విలాస భంగిమలో కూర్చుని కాలాడిస్తూ కూల్‌డ్రింక్ సిప్ చెయ్యసాగాడు.

వరండా చివర టకటక బూట్ల చప్పుడు విన్పించింది. చప్పున తల తిప్పి చూసింది సుజాత. ఎదురుగా చకచక నడుస్తూ వస్తు న్నాడు ఓ అధికారి. ఆయన నడకలోనే ఆ సంగతి తెలిసిపోతోంది. చుట్టూ నలుగురైై

దుగురు మనుషులు, వాళ్ళ చేతుల్లో కెమెరాలూ, పుస్తకాలూ, పెన్నులూ చూడగానే విలేఖరులని అర్థమవుతోంది.

వాళ్ళ మధ్యలో కన్పించాడు రవికిరణ్ సార్. చుక్కల్లో చంద్రుడిలా అన్పించాడో క్షణం.

పిల్లలంతా నోరు తెరుచుకుని చూసి ఏదో అనబోతుంటే 'ఉష్' మంటూ వాళ్ళకి సైగ చేసి. నాలుగడుగులు వెనక్కి వేసి, వార్డెన్ ఉన్న రూంని వాళ్ళకి చేతితో చూపించింది.

రెడ్‌హాండెడ్‌గా తనపై అధికారి చేతిలో దొరికిపోయాడతను. అతను తనిఖీ చేసిన వివరాలూ, రిపోర్ట్లూ అడిగితే నీళ్ళు నమిలాడతను.

పిల్లల కంప్లయింట్స్ గురించి అడిగితే గోడలు సున్నంతో తెల్లగా నిగనిగలాడుతున్నాయన్న ధైర్యంతో ఏమీ లేవనేశాడు.

"మాకు సమస్యలున్నాయి" పిల్లలంతా కేకలు పెట్టారు. వార్డెన్ బిత్తరపోయి చూస్తోంది. ఈ పరిణామం ఆమె ఊహించలేనిది. మొదట వచ్చిన అధికారి లేచి నిలబడి దిక్కులు చూస్తున్నాడు. అతని మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్క లేనట్లుగా పాలిపోయింది.

"మీ బాధలేంటో చెప్పండి" పిల్లల మధ్యలోకి వెళ్ళి అడిగాడు ఎస్సీ, ఎస్టీ సంక్షేమ శాఖ జిల్లా అధికారి.

సుజాతతోసహా పిల్లలు తమ కష్టాలు చెప్పడంతోపాటు ఆ రోజు ఉదయం నుండీ జరిగిందంతా చెప్పారు.

"నిజమేనా? " వార్డెన్ వంక చూస్తూ అడిగాడతను. "అదేం లేదు సార్! నేను పిల్లల్ని ఎంత ప్రేమగా చూసుకుంటానో కనీసం నా సొంత పిల్లల విషయాలు కూడా ఏమీ పట్టించుకోకుండా వీళ్ళ మీదే ప్రాణాలు పెట్టి బతుకుతుంటే వీళ్ళిలా నన్ను" అంటూ కళ్ళబొల్లి ఏడుపులు ప్రారంభించింది.

"అంతా అబద్ధం" సుజాత అరిచింది. పిల్లలంతా గోలగోలగా వార్డెన్ తమని పెట్టే కష్టాలని ఏకరువు పెట్టసాగారు. విలేఖరులు కెమెరా ఫ్లాష్‌లు టపటపా వెలిగాయి. వివరాలని వాళ్ళు నోట్ చేసుకోసాగారు.

రత్నావాళ్ళ బాచే దూరంగా నిలబడి వినోదం చూస్తూ వున్నారు. అక్కడ వున్న మగవాళ్ళనుద్దేశించి ఏవో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళని చూడగానే వార్డెన్‌కి పైప్రాణాలు పైనే పోయాయి. వాళ్ళని బయటికి వెళ్ళమని కళ్ళతో సైగ చేస్తోంది గానీ వాళ్ళ దృష్టి వార్డెన్ మీద లేదు.

అది గమనించింది సుజాత. రవికిరణ్‌కి వాళ్ళని చూపించి వాళ్ళిక్కడ మెంబర్సేనా కాదో కనుక్కోమని చెప్పింది. రవికిరణ్ ఆ విషయాన్ని అధికారి దృష్టికి తెచ్చాడు.

ఎంక్వయిరీలో వాళ్ళు ఇక్కడ ఉండాల్సిన గడువు దాటి రెండేళ్ళయిందని తేలింది.

వారం రోజుల్లోగా హాస్టల్ వెకేట్ చెయ్యమని గట్టిగా చెప్పాడతను. అప్పటివరకూ ఉల్లాసంగా నిలబడిన రత్నావాళ్ళ మొహాలు వెలాతెలా పోయాయి.

వాళ్ళు వార్డెన్ వైపు బిక్కమొహాలు వేసుకుని చూస్తుండిపోయారు. పిల్లల అభిప్రాయాలను రికార్డ్ చేసి, సంతకాలు పెట్టించాడు జిల్లా అధికారి.

అక్కడికక్కడే రిపోర్ట్స్ తయారయిపోయాయి. వార్డెన్, తనిఖీ అధికారులకి సస్పెన్షన్‌కి రంగం సిద్ధమయిపోయింది.

విలేఖరులు జరిగిందంతా రాసుకున్నారు. మరుసటి రోజు పేపర్లకి వార్తలు సిద్ధమయిపోతున్నాయి. రవికిరణ్ తన దగ్గరున్న సమాచారాన్ని కూడా వివరిస్తుంటే వార్డెన్ తన మనసులో ఉన్న ద్వేషాన్ని అణిచిపెట్టుకోడానికి విపరీతంగా ప్రయత్నించసాగింది.

రత్నావాళ్ళు, వార్డెన్ తన వంక చూసే చూపుల్ని లక్ష్యపెట్టనట్లు తలెగరేసి నిల్చుంది సుజాత. ఎంత హడావిడిగా వచ్చారో అంత హడావిడిగానూ ఇన్స్పెక్షన్ ముగించి బయల్దేరి పోయారు వాళ్ళు.

వెళ్ళబోయిన వాడల్లా రవికిరణ్ వెనక్కి

తిరిగి సుజాత దగ్గరకి వచ్చాడు.

"ఏమీ జరగదనుకున్నావా? " మనోహరంగా నవ్వుతూ అన్నాడు. ఆ నవ్వు చూసి జీవితంలో మొదటిసారిగా హృదయం లయ తప్పింది. ఆకర్షణీయంగా, ఆహ్లాదంగా కన్పిస్తున్న అతని మొహాన్ని వదిలి వెనక్కి రానంటోంది చూపు. తనెప్పుడూ ఎరుగని ఈ కొత్త భావం. తప్పేమో అన్న ఆలోచన రావడంతో మొహం తిప్పుకుంది.

చైతన్యాన్నంతా వెంట తీసుకుని అతను వెళ్ళిపోయాడు. చూస్తూ నిలబడిపోయింది సుజాత.

మరుసటి రోజు ప్రముఖ దినపత్రికల్లో ఈ అవినీతి భాగోతం పతాక శీర్షికలకెక్కింది. వార్డెన్‌ని పది రోజులు సస్పెండ్ చేశారు. ఆమె స్థానంలో యింకో కొత్త వార్డెన్ తాత్కాలికంగా నియమించబడింది. తనిఖీ అధికారికి మెమో ఇచ్చారు. హాస్టల్లో కొన్ని సంస్కరణలు జరిగాయి. భోజనం కొంచెం మెరుగుపడింది. శుభ్రత విషయంలోనూ శ్రద్ధ వహిస్తున్నారు.

కాలపరిమితి దాటిన రత్నావాళ్ళు హాస్టల్ ఖాళీ చేసినా అక్కడికి దగ్గర్లోనే రూం తీసుకుని ఉంటున్నారు. వార్డెనే వాళ్ళకి ఆ సలహా ఇచ్చిందని పుకారు.

రెండు రోజుల్లోనే హాస్టలంతా ప్రశాంతత వ్యాపించింది. డాక్టర్లు వచ్చి చెక్ చేసి మందులు కూడా ఇవ్వడంతో ఆరోగ్యం కూడా కుదుట పడుతోంది. పిల్లల్లో కూడా చదువు మీద, ఆటపాటల మీదా శ్రద్ధ పెరిగింది. దీనికంతటికీ కారణం రవికిరణ్ సార్ అనుకోగానే మండుతున్న గాయం మీద చల్లని పూత పూసినట్లుగా వుంది.

రెండు రోజుల శెలవుల అనంతరం కాలేజీకి వెళ్ళింది సుజాత సెకండ్ పిరియడ్ కోసం తనకి తెలీకుండానే ఎదురు చూడసాగింది. సుజాత వాళ్ళ హాస్టల్లో జరిగిన విషయం పేపర్లో రావడంతో కాలేజిలో కూడా చాలా మందికి తెలిసింది. టి.వి. ఛానెళ్ళు ప్రసారం చేసిన ఇంటర్వ్యూలలో సుజాత ధైర్యంగా సమాధానాలు చెప్పిన తీరుకి అంతా అభినందించారు. కొంత మంది ఆమెకి దూరంగా జరిగారు. దేనికీ చలించలేదు. ఎప్పటిలాగే వుంది సుజాత.

ఈ అవినీతి భాగోతాల వెనుక చాలా మంది పెద్దవాళ్ళ హస్తముంటుందని 'ముందుంది ముసళ్ళ పండగ' అని చాలా మంది హెచ్చరించారు. ఆ వయసుకి, ఆ ఉద్రేకానికి ఆ మాటలు రుచించలేదు.

మొదటి పిరియడ్ అయిపోయింది. సార్ వెళ్ళిపోయారు. గాప్‌లో అందరూ కలగాపులగంగా మాట్లాడుకుంటుంటే ఆమె మాత్రం గుమ్మం వైపు చూస్తూ కూర్చుంది. "నవ్వడైతే చాలు ప్రభూ! రివ్వున స్మరశరం దూసుకుపోతుంది" అన్నట్లుగా. మనశ్శరీరాలు రెండూ కేంద్రీకృతమయ్యాయి. ఉచ్ఛ్వాశ నిశ్వాసాల వేగం పెరిగింది. తనేనా యిలా ఎదురు చూసేది!!! ఒకటే ఆశ్చర్యం. ఏదో అయోమయం. మనసులో తీయని గందరగోళం. చూస్తుండగానే అతనొచ్చేశాడు ఎప్పటిలాగే చిన్నగా నవ్వుతూ. అందరూ లేచి నిలబడుతుంటే తనూ నిల్చుంది. అందర్నీ కూర్చోమని చెప్పాడు. ఎప్పటిలాగా అతని చూపు ఆఖరి బెంచీవైపు ఆత్రంగా తిరగలేదు. రవికిరణ్ సార్ పాఠం ప్రారంభించాడు. బోర్డ్‌వర్క్ చేస్తూ ఎక్స్‌ప్లెయిన్ చేస్తున్నాడు. అసలు తనవైపే చూడటం లేదు. ఎవరెవరినో ప్రశ్నలు అడుగుతున్నాడు. కానీ తనని అడగడం లేదు. ఉక్రోషంగా ఉంది. అసహనంగా ఉంది. చూసి చూసి చివరికి తనే ఏదో డౌట్ కల్పించుకుని అడిగింది. అతను అందరివైపు చూస్తూ సమాధానం చెప్పాడు. ఆవిషయం బాధ కలిగించింది. ఎందుకు

**ప్రపంచమే నాదేశం - మంచితనమే నా మతం.** –థామస్ పేన్

బాధ పడాలో అర్థం కాలేదు. అయినా ఒకటే బాధ. క్లాసయిపోయింది. సార్ వెళ్ళి పోతున్నాడు. తనవైపు చూడనుకూడా లేదు. అంతే! ఒక్కసారిగా ఆకాశాన్ని నల్లమ బ్బులు కమ్మినట్లుగా హృదయాన్ని శూన్యం ఆవరించింది.

వారం రోజులు ఇలాగే గడిచిపోయాయి. పిచ్చెక్కినట్లుగా ఉంది. ఎందుకు ఇదివరకటి లాగా మాట్లాడటం లేదు? ఆ ఆదరణ ఎందుకు కరువైందో తెలియడం లేదు. ఎదు రుగా వెళ్ళి అడిగేయాలని వుంది.

ఆ విపరీతమైన ఇష్టంలోంచే విపరీతమైన కోపం, ద్వేషం పుట్టుకొస్తోంది. ఆ నిరాద రణ తట్టుకోవడం చాలా కష్టంగా వుంది. చదువు మీద శ్రద్ధ తగ్గుతోంది. నిరంతరం ఏవో ఆలోచనలు చుట్టుముడుతున్నాయి. రవికిరణ్ సార్ ఎప్పటిలాగే పాఠం చెప్పు కుంటూ పోతున్నా ఇదివరకటిలా జోవియ ల్‌గా వుండటం లేదు. ఆవిషయం చాలా మంది కనిపెట్టలేదు కానీ తను గమనించు కోగల్గింది.

పదిరోజులు గడిచాక వార్డెన్ డ్యూటీలోకి వచ్చింది. ప్రజలు, ప్రభుత్వం, పత్రికలు క్రమంగా ఈ విషయం మర్చిపోయాయి. ఎందుకంటే వాళ్ళకి ఇదొక్కటే సమస్య కాదు కనుక.

వార్డెన్ వచ్చిన రోజే రత్నవాళ్ళు విజిట ర్స్‌లా వచ్చి ఆమెని కలిశారు. అంతా కలిసి బాతాఖానీ వేసుకుని కూర్చున్నారు.

కాలేజీ నుంచి వచ్చి తన రూం వైపు వెళుతూ యధాలాపంగా ఆ రూం వైపు చూసింది. ఆ రూంలో వున్నవాళ్ళని చూసి మనసులో ఓ క్షణం బెరుకు కలిగింది. తను రూం దాటగానే హేళనగా గట్టిగా, నవ్వులూ, మాటలూ వినబడ్డాయి.

నిరుత్సాహంగా ఉంది. గదిలోకి వెళ్ళికూ ర్చుంది. రత్నావాళ్ళు ఖాళీ చేశాక ఆ రూంలో మరో అమ్మాయి తనే మిగిలారు. చెప్పులు విప్పి మూలకి పెట్టింది. పుస్తకాలు బల్లమీద పెట్టి ఆ అమ్మాయి వైపు చూసింది.

కనుచీకట్లు పడుతున్నాయి. గదిలో ఉక్క పోతగా వుంది. ఫాన్ కూడా సరిగా తిర గడం లేదు. ఆ అమ్మాయి చాప మీద వెల్ల కిలా పడుకుని గది మూలల్లోకి చూస్తోంది.

"ఈ సమయంలో పడుకుని ఉంటావెం దుకు? . కాసేపు చదువుకోవచ్చుగా? ఈ రోజు స్కూలుకి వెళ్ళావా? . ఈ సంవత్సరం టెంత్ పాసయితేనే భవిష్యత్తు బావుం టుంది. ఎపుడూ అలా మొహం వేలాడేసు కుని నీరసంగా ఉండక పోతే కాస్తంత హుషారుగా వుండొచ్చుగా!" మందలిస్తున్న ట్లుగా అంది సుజాత.

ఆ అమ్మాయి ఓ సారి తల తిప్పి సుజాత వంక చూసింది. ఆ చూపులో నిర్వచనం లేని భావాలెన్నో.

ఒళ్ళు జలదరించింది సుజాతకి. ఎప్పుడూ ఎవరిని చూసినా కలుగని జాలి ఈ అమ్మా యిని చూస్తే కలుగుతుంది. ఎప్పటిలా ఆ అమ్మాయి నుంచి తప్పించుకుని పారిపోవా లని అనిపించలేదు.

దగ్గరగా వెళ్ళి ఆమె పక్కనే కూర్చుని "రూపా! ఏంటి నీ సమస్య? నాతో చెప్పు" అనునయంగా అంది సుజాత.

రూప మొహం తిప్పుకుంది.

"ఒంట్లో బాగాలేదా? .." అడిగింది సుజాత.

"......" సమాధానం లేదు.

"నీ బాధేంటో చెపితే నేను చేయగలిగిన సహాయం చేస్తాను" మెల్లని స్వరంతో అంది.

రూపలో చిన్న కదలిక ఇటు వైపు తిరి గింది. సుజాత మొహం వికసించింది. "నిజం" ఆమె చేతిని తన చేతిలోకి తీసు కుంటూ అంది.

రూప కనుకొలుకుల నుంచి కన్నీరు కిందికి జారింది. చేత్తో మృదువుగా తుడుస్తూ, "దేన్నికైనా ధైర్యంగా ఉండాలి.

ఏడిస్తే ఏమీ జరగదుగా!"

నోరు విప్పింది రూప.

"మూడు నెలల నుంచీ బయటవుండటం లేదక్కా. భయంగా ఉంది" బావురుమంటూ అంది.

తెల్లమొహం వేసి వింది సుజాత "పిరియడ్స్ రావడం లేదా? " తను విన్నది కన్ఫాం చేసుకోడానికి అడిగింది.. తలూపింది రూప.

"హెల్త్ ప్రాబ్లమ్ ఉండి ఉంటుంది. దానికి భయం ఎందుకు? వార్డెన్‌కి చెప్పి హస్పిటల్ కి వెళ్దాం పద" లేవబోయింది సుజాత. రూప ఆమె చెయ్యి పట్టుకుని ఆపేసింది.

అర్థంకానట్లు చూసింది సుజాత. ఆ రూప మొహం వేదనా భరితంగా వుంది. ఆ పసిదాని చూపులు భయ విహ్వలంగా వున్నాయి. శరీరం జుగుప్సతో వణికిపోతోంది. దగ్గరగా తీసుకుంది సుజాత. "నాతో చెప్పు. అర్థమయ్యేలా చెప్పు? " మెల్లగా అడిగింది.

"ఆ మధ్య నాగదిలో ఎవరూ లేనప్పుడు వార్డెన్ ఓ మనిషిని పంపేది. అతను నాతో చెడ్డ పని చేసేవాడు. నేను వద్దంటే వార్డెనూ అతనూ కలిపి కొట్టారు. ఒప్పుకోకపోతే చంపేస్తామని బెదిరించారు. ఎవరికైనా చెపితే నన్ను ఇక్కడ ఉండనివ్వమని ముష్టివాళ్ళకి అమ్మేస్తామనీ బెదిరించారు. భయపెట్టారు. నేను ఎక్కడికెనా పారిపోదామంటే నాకెవ్వరూ లేరు." వెక్కుతూ అంది రూప.

నిర్ఘాంత పోతూ వింది సుజాత. అభం శుభం తెలియని ఇంత చిన్నపిల్లల మీద కూడా అత్యాచారం చేయిస్తోంది ఆ వార్డెన్. వీళ్ళకి ఎవరూ లేరని, ఏం చేసినా పట్టించుకునేవాళ్ళు వుండరనీ ఆమె ధైర్యం. రక్తం సలసలా మరుగుతోంది సుజాతకి.

గది బయట చీకటిలో ఏదో అలికిడి భయంగా తల తిప్పిచూసింది రూప. ఏదో ఆకారం మెల్లగా కదిలి వెళ్ళిపోతోంది.

"వార్డన్ అనుకుంటా!" భయంగా అంది రూప. సాలోచనగా తలూపింది సుజాత. ఆమె మనసులో ఎన్నో సందేహాలు. అయితే ఇప్పుడు రూప కడుపుతో వుందా? . అయోమయంగా ఆమె వంక చూసింది. ఏం చెప్పడానికైనా ఆమె అనుభవం వయసు ఎంతని? .

"నువ్వేం భయపడకు రేపు నేను మా సార్‌తో మాట్లాడతాను. ఆ తర్వాత ఏం చెయ్యాలో చూద్దాం" సర్దిచెపుతూ అంది. కానీ మనసులో ఏదో గుబులు ప్రారంభమైంది. తన చుట్టూకూడా ఏదో చీకటి వల సిద్ధగా వున్నట్లనిపిస్తోంది. తనకి వున్న సమస్యలకి తోడు మళ్ళీ ఇక్కడ కూడా పోరాటమేనా? రాత్రంతా కలత నిద్రతో గడిపింది.

తెల్లారి లేచి కాస్త ముందు తయారయి కాలేజికి వెళ్ళి రవికిరణ్ సార్ కోసం స్టాఫ్ రూంకి వెళ్ళింది. "మీ సార్ రెండు రోజులు లీవ్!" మీ సార్ అన్న మాట ఒత్తిపలుకుతూ అన్నారు మ్యాథ్స్ లెక్చరర్. ఏంటోగా అన్పించింది సుజాతకి. ఇంకేమీ అడగ బుద్ధికాలేదు. కాళ్ళీడ్చుకుంటూ క్లాస్‌కి వచ్చింది. మ్యాథ్స్ సార్ వచ్చారు. ఏదో చెపుతున్నారు. ఆ మాస్టారు ఏం చెపుతున్నారో తలకెక్కడం లేదు. మాటిమాటికీ కళ్ళ ముందు రూప మెదుల్తోంది. లీవ్ పెట్టిన రవి కిరణ్ సార్ మీద ఉధృతంగా కోపం వస్తోంది. ఎందుకో తెలీదు. అయినా సార్ తప్పేముంది? . సాధ్యమైనంత వరకూ ఆయన తనకి హెల్ప్ చేస్తూనే వున్నారు. తనే ఎందుకో స్వార్థంగా ఆలోచిస్తోంది.

సెకండ్ పిరియడ్ స్టార్టయిన పావుగంట వరకూ గుమ్మం వంక చూస్తూనే వుంది. ఏదో మాయ జరిగి సార్ వచ్చేస్తారని నమ్మకం. ఆయన రాలేదు. క్లాస్ ముగిసింది. సాయంత్రం వరకూ ఎలా గడిపిందో తనకే తెలీదు.

తల బద్దలయ్యేంత నొప్పిగా వుంది. ఏదో నిరుత్సాహం. రేపు కూడా సార్ రారు. రూప పరిస్థితి ఏంటి? తను రోజురోజుకీ అనుభవించే మానసిక క్షోభ నుంచి విముక్తి కలిగించే మార్గం ఏదీ? ఆలోచనలతో రగిలిపోతూ హాస్టల్ కి వచ్చింది.

రూంలో రూప లేదు. బట్టలు మార్చుకుని మొహం కడుక్కొని హాస్టల్లో యిచ్చిన టీ తాగి బిస్కట్లు తింటూ రూంలోకి వచ్చింది. అప్పటికి కూడా తను రాలేదు. ఆమె నొసలు ముడిపడింది. పక్క రూం వాళ్లని అడిగింది. వాళ్లు కూడా అపుడే స్కూళ్ల నుంచి వచ్చామని తమకు తెలియదని అన్నారు.

హాస్టలంతా వెతికింది. ఎక్కడా కనిపించ లేదు. ఇంకా స్కూలు నుంచి రాలేదేమోనని ఆరు గంటల వరకూ ఎదురు చూసింది. రాలేదు. ఏమైంది రూప? గుండె దడదడ లాడింది. అమాయకమయిన ఆమె పసి మొహం కళ్ల ముందు కదలాడింది. 'హాస్పిటల్ వెళ్లుండొచ్చేమోనన్న' అనుమానం రావడంతో వార్డెన్ గదికి వెళ్లింది. అప్పటికే రత్న వాళ్లు అక్కడ చేరారు. సుజాతని కొరకొరా చూడసాగారు.

"మేడమ్ రూప ఏది?" వార్డెన్ని అడిగింది.

వార్డెన్ మొహంలో క్షణకాలం కదిలిన తత్తరపాటుని సుజాత పసిగట్టింది. వెంటనే తేరుకుంది వార్డెన్.

"నీ పని నువ్వు చూసుకో!." కోపంగా అంది వార్డెన్. సుజాతలో అనుమానం మెల్లగా విస్తరిస్తోంది.

"రూప ఎక్కడ ఉందో చెప్పండి" తనూ అదే టోన్‌లో అంది. "నీ కనవసరమయిన విషయాల్లో తల దూర్చకు" హెచ్చరికగా అంది వార్డెన్. రత్న వాళ్లు సుజాత ధైర్యానికి విస్తుపోయి చూస్తున్నారు.

"రూప ఎక్కడ ఉందో చెప్పకపోతే మా సార్‌తో చెప్పి కనపడటం లేదని పోలీస్ కంప్లయింట్ యిప్పిస్తాను." బెదిరింపుగా అంది సుజాత. వార్డెన్‌కి గుండెల్లో రాయి పడినట్లయింది. పైకి ఏమీ వ్యక్తపరచకుండా.

"నీ బెదిరింపులు ఏంటి? రూపని వాళ్ళ చిన్నాన్న వచ్చి తీసుకుని వెళ్లారు" అంది వార్డెన్.

"చిన్నాన్నా?" నమ్మలేనట్లుగా అడిగింది సుజాత. తనకెవరూ లేరని రూప చెప్పింది. మళ్ళీ ఇపుడు ఎవరీ చిన్నాన్న? రూపని ఎక్కడికి తీసుకుని వెళ్ళాడు?.

"ఎక్కడికి తీసుకు వెళ్లారు?" అప్రయత్నంగా అడిగింది. "వాళ్ళ ఊరు తీసుకెళ్లారు. పై ఆఫీసు నుంచి వాళ్ళు పర్మిషన్ తెచ్చుకున్నారు. వాళ్లే చదివించి పెళ్లి చేస్తారంట" రుసరుసలాడుతున్నా ఇన్ఫర్మేషన్ అంతా చెప్పింది.

"రూప వెళ్లిందా?"

"ఏం? వెళ్లక ఏం చేస్తుంది? చాలా సంతోషంగా వెళ్లింది" అంది వార్డెన్.

ఆమె మాటలు నమ్మబుద్ధి కావడం లేదు. రాత్రి వరకూ తనకెవరూ లేరని చెప్పిన మనిషికి తెల్లారేసరికి చుట్టం ప్రత్యక్షమై వచ్చి తీసుకుని వెళ్లాడు. అందులోనూ రూప కడుపుతో ఉందని సందేహంగానూ ఉంది. ఇంకా ఏం అడగాలో తెలీక అక్కడే కాసేపు తచ్చట్లాడింది...

అంతసేపూ వార్డెన్, మిగతా వాళ్లతో మాట్లాడుతున్నా ఓరగా సుజాత వైపు చూస్తూనే ఉంది. ఆ కళ్లలో ఏదో కలవరం దోబూచులాడుతోంది.

చూసి చూసి కాళ్లీడ్చుకుంటూ రూంకి వచ్చింది. రూప ఎపుడూ పడుకునే వైపు చూస్తుంటే గుండె జల్లుమంటోంది. వెలుతురు ఉంటే అటు చూడాల్సి వస్తుందని లైటన్నా వేసుకోకుండా పడుకుంది.

రాత్రి భోజనం చేయబుద్ధి కాలేదు. వచ్చి పిలిచే వాళ్లూ లేరు. అర్ధరాత్రయినా కంటి మీద కునుకు రావడం లేదు. ఒకటే ఆలోచ

నలు. తల బద్దలైపోయేలా ఉంది.

తెల్లవారుఝామున ఓ గంటో గడియో నిద్ర పట్టింది. లేచాక వార్డెన్‌కి తెలీకుండా మళ్ళీ అందరినీ యధాలాపంగా అడిగినట్లు రూప గురించి అడిగింది. రూప బయటికి వెళ్ళడాన్ని ఎవరూ చూడలేదు. ఎందుకంటే ఆ సమయంలో ఎవరూ హాస్టల్లో లేరు.

నిరుత్సాహంగానే కాలేజీకి వెళ్ళింది. ఈ రోజు కూడా 'రవి కిరణ్ సార్ లీవ్' అని నిన్న మ్యాథ్స్ సార్ చెప్పారు. క్లాస్‌లో డల్‌గా కూర్చొని ఉంది. అంతా ఆమె మీద జోక్ చేసుకొని నవ్వుకుంటున్నారు. అదేమీ పట్టించుకునే స్టేజ్‌లో లేదు సుజాత. మన సంతా ఎవరిమీదో కక్షగా క్రోధంగా ఉంది!. కానీ ఏమీ చేయలేని నిస్సహాయతతో కదిలి పోతోంది.

ఫస్ట్ పీరియడ్ అవగానే బెంచీ మీద తల వాల్చి పడుకుంది. రాత్రంతా నిద్రలేమితో బాధ పడటం చేత మగతగా ఉంది. ఎవరివో కలగా పులగంగా మాటలు వినిపిస్తున్నాయి కానీ అలాగే నిద్ర పోవాలని ఉంది.

ఇంతలో తన పక్కన కూర్చున్నమ్మాయి తట్టి లేపుతూ "సార్ వచ్చాడులే!." గాభరాగా అంది.

ఏ లోకంలో ఉన్నా ఆ మాట కోసమే కాచుకుని ఉన్నట్లుగా దాహంతో అలమటించి పోతున్న సమయంలో చల్లటి నీరు దొరికినట్లుగా, చెవులకింపుగా ఆ మాట వినబడేసరికి చటుక్కున లేచి నిల్చుంది.

మగతతో తేలి పోతున్న కళ్ళకి మసగ్గా రవి కిరణ్ సార్ కన్పిస్తున్నారు. తన వంకే నవ్వుతూ చూస్తున్నారు. ఎన్ని రోజుల తర్వాత తనని చూస్తూ నవ్వుతున్నారు. మనసంతా చెప్పలేని ఉద్వేగంతో నిండి ఉంది.

"కూర్చో సుజాతా!" సార్ అన్నాక తేరుకుని చుట్టూ చూసింది. అప్పటికే అందరూ కూర్చుని ఉన్నారు. గబుక్కున కూర్చుంది. ఒక్క రోజుకే ఎన్నో యుగాలయినట్లు ఉంది. అతను పాఠం చెపుతుంటే తదేకంగా అతడినే చూస్తూ కూర్చుంది.

క్లాసయి అతను వెళ్లిపోతుంటే గబగబా ఆయన వెనకాలే వెళ్ళింది. వెనక్కి తిరిగి చూసి 'ఏంటన్నట్లు? ' కళ్లెగరేశాడు.

"మీతో మాట్లాడాలి" అంది.

"చెప్పు? " ప్రశాంతంగా అన్నాడు రవికిరణ్.

"నాకు క్లాస్ ఉంది. సాయంత్రం బస్టాప్‌లో కలుస్తాను." చెప్పి వడివడిగా వెళ్లిపోయింది. సాలోచనగా ఆమె వెళ్లే వైపే చూస్తూ ఉండిపోయాడు రవి కిరణ్.

సాయంత్రం క్లాసులయ్యాక బస్టాప్‌లో వెయిట్ చేస్తుంటే సార్ వచ్చి కలిశాడు. అతను బస్ కోసం ఎదురు చూడకుండా "పద నడుస్తూ మాట్లాడుకుందాం" అంటూ ముందుకి దారి తీశాడు. మౌనంగా అతన్ని అనుసరించింది.

"ఎలా ఉంది హాస్టల్లో? " అడిగాడు.

"చాలా భయంగా ఉంది" టక్కున చెప్పింది.

ఎదుటి వారిని భయపెట్టడమే తప్ప భయపడటం ఎరుగని అమ్మాయికి భయమా? .

"ఏం జరిగింది? " అడిగాడు.

రూప గురించి తను అనుకున్నదంతా చెప్పింది. రూప హాస్టల్ నుంచి మాయం కావడం గురించి కూడా చెప్పింది. ఎపుడూ నవ్వులు జాలువారే అతని మొహాన్ని మబ్బులు కమ్మేశాయి.

కాసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు రవి కిరణ్ "నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి" అన్నాడు చివరికి.

"ఎందుకు? " అనుమానంగా అడిగింది.

"ఏమో! చెప్పాలనిపిస్తోంది. రాత్రిళ్ళు గదిలో తలుపేసుకుని పడుకో! ఒక్క దానివే ఉండకు. ఎవరితోనూ వాదం పెట్టుకోకు. ఎట్‌లీస్ట్ కొన్నాళ్ళు. శత్రువు చాలా పెద్ద

వాడు. ఒకరు కాదు. ఒక వ్యవస్థనే మనం ఢీకొన్నాం. యికనుంచీ మనం వేసే ప్రతి అడుగూ ఆచితూచి వెయ్యాలి" అతను చెప్పుకు పోతుంటే అయోమయంగా వింది.

మాటల్లో పడి నడుస్తూనే హాస్టల్ కి చేరు కున్నారు. సుజాతని అక్కడ దింపి ఆ భవ నాన్ని పరిశీలనగా చూసి వెనక్కి తిరిగి వచ్చేశాడు రవి కిరణ్.

రూంకి వెళ్లబుద్ధి కాలేదు. రాత్రి పది గంటల వరకూ అస్థిమితంగా అటూ ఇటూ తిరుగుతూనే ఉన్నాడు. పదింటికి మెస్‌లో భోజనం చేసి కాళ్ళీడ్చుకుంటూ రూంకి తిరిగి వస్తున్నాడు.

ఆ ప్రదేశం అంతా నిర్మానుష్యంగా ఉంది. వీధి దీపాలు రోడ్డుని పట్ట పగల్లా మార్చేశాయి. తల వంచుకుని ఫ్యాంట్ జేబుల్లో చేతులు పెట్టుకుని నడుస్తున్నాడ తను.

వెనకాల వాహనం వస్తున్న చప్పుడయి పక్కకు జరిగి నడుస్తున్నాడు. కానీ ఆ వాహనం తన మీదకే వస్తున్నట్లనిపించ డంతో ఎగిరి పేవ్‌మెంట్ మీదకి దూకాడు.

కీచుమన్న శబ్దంతో పేవ్‌మెంట్‌ని గుద్దు కుని ఆగింది టాటా సుమో. బిలబిల్లా డుతూ అందులోంచి దిగారు నలుగురైదు గురు మనుషులు. రవికిరణ్ అంతరంగ మంతా ఆందోళనకి గురయింది. తన అజా గ్రత్తకి తననే నిందించుకున్నాడు.

జరిగేదాన్ని ఎదుర్కోవడం తప్ప తను చేయగలిగింది ఏమీ లేదు.

ముగ్గురు దృఢకాయులు అతన్ని సమీపిం చారు.

"ఏరా బతకాలని లేదా? " ఓ వ్యక్తి బొంగురు గొంతుతో అన్నాడు. "మీరె వరు? " అడిగాడు రవికిరణ్. అడగడంతోనే తన ప్రశ్న ఎంత ఫూలిష్‌గా ఉందో అర్థమ యింది. వారి నుంచి సమాధానం చేతల్లో వచ్చింది. వారిలో ఓ వ్యక్తి చెయ్యి విసి రాడు. వేగంగా తప్పుకోవడంతో మొహానికి తగలాల్సిన ఆ సంచి భుజానికి తగిలింది. నిరంతరం వ్యాయామం చేస్తున్న శరీరం కావడంతో దానిని తట్టుకోగలిగాడు.

"మీకూ నాకూ సంబంధం లేదు. ఓ జర్న లిస్ట్ మీదే మీరు చేయి చేసుకుంటున్నారంటే చాలా గొడవలవుతాయి" తర్జనితో బెది రిస్తూ అన్నాడు.

ముగ్గురూ అతన్ని కమ్మేశారు. శాయశ క్తులా అతను వాళ్లనుంచి కాచుకుంటు న్నాడు. అతను ఓ దెబ్బ విసిరే లోపు వాళ్లు నాలుగు దెబ్బలు కొడుతున్నారు. పెదవి ఇంత లావున పొంగింది. ముక్కు నుంచి రక్తం కారుతోంది.

ఇంతలో దూరంలో ఏదో వాహనం వస్తున్న చప్పుడయ్యే సరికి వాళ్లు రవికి రణ్‌ని వదిలేసి సుమో ఎక్కి వెళ్లిపోయారు.

రోడ్డుకి అడ్డంగా వెళ్ళి వస్తున్న కారుని ఆపబోయాడు. కారు స్లో అయినట్లే అయి మళ్ళీ 'ఎందుకొచ్చిన తంటా! అన్నట్లుగా ముందుకెళ్లి పోయింది. అయిదు నిమి షాలు పేవ్‌మెంట్ మీదే కూలబడ్డాడు. తన కేమీ కాలేదని పదే పదే మనసుకి సజెషన్స్ ఇచ్చుకున్నాడు.

కర్చీఫ్‌తో ముక్కునీ, పెదాల్నీ తుడుచుకు న్నాడు. ఒళ్లంతా హూనమై పోయినట్లుగా ఉంది.

ఎవరు వీళ్లు? తన మీద ఎందుకు కక్ష? రెండు నిమిషాలు ఆలోచించగానే సమస్య విడిపోయింది. ఎవరై ఉండొచ్చో ఊహించాక అతని అంతరంగమంతా మరింత ఆందోళనకి గురయింది.

'మైగాడ్!! సుజాత!!' ఆమె గుర్తుకు రాగానే క్షణం ఆగలేదు. సత్తువ కూడదీసు కుని పరిగెత్తడం ప్రారంభించాడు.

★ ★ ★

రవికిరణ్ సార్‌ను చూసి అతనితో తను చెప్పాల్సిన విషయం చెప్పేశాక మనసు ప్రశాంతంగా మారింది. ఇన్ని రోజుల

నుంచీ అనుభవించిన నిద్రలేమి మటుమాయం అయ్యింది. కళ్ళ నిండుగా నిద్ర ముంచుకు వస్తోంటే భోజనం చేసి తన రూంకి వెళ్లింది. రూప వెళ్ళిపోయాక ఇంకా తన గదిలో ఎవరినీ ఎలాట్ చెయ్యలేదు. పక్క గదిలో ఉన్న ఎనిమిదేళ్ల అమ్మాయిని తోడు పడుకోబెట్టుకుంది. సార్ చెప్పినట్లే తలుపు గడియ వేసుకుని పడుకుంది. పదిన్నర కల్లా నిద్రలోకి జారుకుంది.

పది నిమిషాలకే ఎవరో తట్టి లేపినట్లు మెలుకువ వచ్చింది. కళ్ళు విప్పి చూసింది. కాసేపు ఏమీ అర్థం కాలేదు. తలుపు మీద టక్ టక్ మన్న చప్పుడు వినిపిస్తోంది.

పక్కన పడుకున్న పిల్ల వంక చూసింది.. 'సుజాతా!' పిలుస్తున్నారెవరో!. వార్డెన్ గొంతులా ఉందది. భయంతో నాలుక పిడచగట్టుకుపోతోంది. పక్కనున్న పిల్లని కుదిపి లేపింది. ఆ అమ్మాయి నిద్రతో వేలాడి పోతోంది.

ధైర్యం చేసి తలుపు వరకూ వెళ్ళి 'ఎవరూ?' అడిగింది. "నేను వార్డెన్‌ని. మీ సార్ ఫోన్ చేశాడు. అర్జంట్‌గా మాట్లాడాలంట" చెప్పింది.

'సార్ చేశాడా?' ఎందుకు? గబుక్కున తలుపు తీసింది. వార్డెన్ లోపలికి వచ్చి లైటేసింది... నవ్వుతూ నిలబడిన వార్డెన్‌ని అయోమయంగా చూసింది.

వెనకే ప్రత్యక్షమయింది ఓ శాల్తీ. నలభై అయిదేళ్ల వయసు ఉండొచ్చు లాల్చీ పైజామాలో పూల రంగడిలా ఉన్నాడు. సుజాతని అనుకుని నిద్ర పోతున్న పిల్లని లాగి బయట వరండాలో ఓ వారగా పడుకోబెట్టింది.

"ఎవరితను?. ఏంటీ రాత్రిపూట?." కోపంగా అంది సుజాత.

"చెపుతాగా!." అతను నెమ్మదిగా తలుపేశాడు.

ఆమెలో భయాందోళనలు ముసురుకుంటున్నా లెక్క చేయకుండా "తలుపు తియ్యి ముందు." అతన్ని తప్పించుకుని ముందుకడుగేస్తూ గట్టిగా అరిచింది.

"ఎక్కడికి వెళ్తావే!" సుజాత చెయ్యి పట్టుకుంటూ అంది వార్డెన్. వెంటనే రియాక్టయ్యింది సుజాత. చెయ్యి విదిలించి బలాన్నంతా చేతుల్లోకి తెచ్చుకుని ఓ తోపు తోసింది. ఊహించక పోవడంతో వెల్లకిలా పడింది వార్డెన్. నడుం కలుక్కుమంది. బూతులు తిడుతూ లేచి నిలబడింది.

ఆమెతో వచ్చిన వ్యక్తి రెండు చేతులతో ఒడిసి పట్టుకున్నాడు. జుగుప్సతో ఒళ్లంతా కంపించగా కాలు వంచి అతని పొట్టలో గుద్దింది. పట్టు సడలించాడతను. రివ్వున తలుపు దగ్గరికి పరిగెత్తింది.

ఈ లోపు లేచి నిలబడిన వార్డెన్ సుజాత జడ పట్టుకుని బలంగా లాగింది. జుట్టు కుదుళ్లకంటా ఊడొచ్చినంత నొప్పి కలిగింది. వెనక్కి విరుచుకుపడింది. తల గోడకి కొట్టుకుని కళ్లు బైర్లు కమ్మాయి.

మళ్లీ వచ్చి మీద పడ్డాడతను. కాళ్ళూ చేతులూ గుడ్డిగా, విసురుగా గాల్లో ఆడిస్తోంది. ఆ దెబ్బలకి మరింత రెచ్చిపోయారు వాళ్లు. అతను ఆమె పెడరెక్కలు విరిచి గట్టిగా పట్టుకోగా వార్డెన్ ఆమె చెంపలను ఎడా పెడా వాయించింది. తట్టుకోలేనంత నొప్పితో మెడ వాల్చేసింది. నోటి చివర రక్తం ధారలు కట్టింది. చెంపలు బుసబుసా పొంగాయి. తైల సంస్కారం లేని జుట్టు ఊడి మొహమంతా పరుచుకుంది.

బాటిల్ లోంచి నీళ్లు తీసి మొహం మీద విసురుగా చల్లింది వార్డెన్. ఉలిక్కి పడి తేరుకుంది సుజాత.

ఆమెని కింద చాప మీద పడేశాడతను. అతని మొహంలో పైశాచికమైన ఆనందం చిందులు వేస్తోంది. అడుగులో అడుగు వేసుకుంటూ ఆమెని సమీపిస్తుంటే అంత రంగమంతా కక్ష క్రోధాలతో నిండిపోగా నిస్సహాయమైన తన స్థితిని తిట్టుకుంటూ



కళ్లు మూసుకుంది సుజాత.

★ ★ ★

హాస్టల్‌కి రెండు వీధులవతల ఆటో దిగాడు రవికిరణ్. త్వరగా నడుస్తూ హాస్టల్ భవనాన్ని సమీపించాడు. ఓ క్షణం గేటు దగ్గర ఆగి పరిశీలనగా చూశాడు. ఎక్కి సులభంగా దూకేంత చిన్న గేటు అది. దానికి తాళం వేసి ఉంది. అటు వైపు వాచ్‌మాన్ కూర్చునే స్టూలు కన్పిస్తోంది కానీ దాని మీద అతను లేడు.

వరండాలో చాప పరుచుకొని పడుకుని గుర్రు పెట్టి నిద్ర పోతున్నాడు. గేటు ఎక్కి దూకాడు రవి కిరణ్. వాచ్‌మాన్ లేవలేదు. వరండా దాటుకుని కారిడార్‌లో నడుచుకుంటూ ఒక్కో గది ముందూ ఆగి చూసుకుంటూ వెళ్తున్నాడు. తను మరీ అనుమానిస్తున్నాడేమో! సుజాతకి ఏ అపాయమూ లేదేమో! తననిక్కడ ఈ సమయంలో ఎవరైనా చూస్తే అది ఆమెకీ, తనకీ ఇద్దరికీ సమస్యే! అతని మనసులో అనుమానాలు అల్లిబిల్లిగా అల్లుకుంటున్నాయి.

నడుస్తూ వెళుతుంటే ఓ గదిలో ఏవో అస్పష్టంగా మాటలూ, నవ్వులూ విన్పిస్తున్నాయి. ఈ సమయంలో పడుకోకుండా ఎవరు మాట్లాడుకుంటున్నారు? ఆ గది దగ్గరే నిలబడి తలుపుకి చెవి ఆనించి వినసాగాడు.

ఎవరిదో మగ గొంతు వికటాట్టహాసం చేస్తూ వినబడింది. రవికిరణ్ గుండె దడదడలాడింది. ఆ వెంటనే సుజాత అరుపులు వినబడ్డాయి. రవికిరణ్ శరీరం బిగదీసిన ఉక్కు కడ్డీలా మారింది. కళ్ళు రక్త వర్ణాన్ని నింపుకున్నాయి.

లోపల జరగకూడనిది ఏదో జరుగుతోంది. దాన్ని ఆపాలి. ఈ మురికి కూపం నుంచి ఈ అమాయకురాలిని రక్షించాలి.

ఓ నిమిషం ఆలోచించి ఓ నిశ్చయానికి

వచ్చి తలుపు టకటక కొట్టాడు. కాసేపు లోపల నిశ్శబ్దం మళ్లీ తలుపు కొట్టాడు.

"ఎవరూ?" వార్డెన్ కంఠం వినబడింది.

"నేనమ్మా! వాచ్‌మాన్‌ని" అన్నాడు గొంతు మార్చి చెప్పాడు తలుపు ఓరగా తెరిచింది వార్డెన్. క్షణం ఆగలేదు రవికిరణ్ తలుపు విసురుగా తోసేసి గదిలోకి దూసుకు పోయాడు. ఓ మూలకి ముడుచుకుంటున్న కుక్క పిల్లలా ఉన్న సుజాత దగ్గరికి వెళ్ళాడు.

"ఏయ్! ఎవర్నువ్వు?" అతన్ని అడ్డగించ బోయాడు ఆ గదిలోని వ్యక్తి. ఆవేశంగా వెనక్కి తిరిగాడు రవికిరణ్. తనని ప్రశ్నించిన వ్యక్తికి తర్జని చూపిస్తూ ఏదో అనబోయాడు. అప్పటికే అతన్ని గుర్తించిన మెదడు స్తంభించి పోయింది. నోట్లోంచి రాబోయిన మాటలని జాగ్రత్తగా ఆపుకున్నాడు. క్షణంలో మాటని తిప్పేసుకుని "బయట పోలీసులు" అని చెప్పి వాళ్ళకి అర్థమయ్యేలోపే సుజాత చెయ్యి పట్టుకుని బరబర బైటకి లాక్కువచ్చాడు.

అడ్డు పడబోయిన వార్డెన్‌ని ఓ తోపు తోశాడు. కారిడార్‌లో పరిగెత్తుతూనే "గేటు దూకి పారిపోవాలి మనం." చెప్పాడు. వార్డెన్, ఆ వ్యక్తి వెంట బడ్డారు. వాళ్లకి దొరక్కుండా అతి లాఘవంగా గేటు దూకి రోడ్డు మీద సంధించి విడిచిన బాణాల్లా పరిగెత్తడం ప్రారంభించారు.

వార్డెన్, ఆ వ్యక్తి నిలబడిపోయి సాలోచనగా ఒకరి మొహాలు మరొకరు చూసుకున్నారు.

"ఏం జరగదులే!" అతను తేలిగ్గా అన్నాడు.

"ఏమో! ఇది వరకు ఇలాగే చిక్కుల్లో పడ్డాను" వార్డెన్ అంది.

"ఏం వచ్చినా నేనున్నానుగా! పద లోపలికి. ఎవత్తినో పిలువు. మూడంతా ఖరాబయింది" విసుగ్గా అన్నాడు ఆ వ్యక్తి. సణుక్కుంటూ లోపలికి వెళ్లింది వార్డెన్.

★ ★ ★

బస్టాండ్‌లో కూర్చున్నారు రవికిరణ్, సుజాత. సమయం రాత్రి ఒంటి గంట అవుతోంది. హాస్టల్ నుంచి సరాసరి తన రూంకి తీసుకు వచ్చాడు రవికిరణ్. కానీ తెరిచి ఉన్న తన గది తలుపుల్ని చూసేసరికి సందేహం వచ్చింది. ఆ చీకట్లో అర గంట సేపు నక్కి. ఇక అక్కడ ఎవరూ లేరని నిశ్చయించుకున్నాక అపుడు గదిలోకి వెళ్ళాడు. అప్పటికే గదంతా చిందర వందరగా ఉంది.

ఎవరో గదిలోని సామాన్లన్నింటినీ నాశనం చేశారు. పెద్దగా బాధపడలేదు రవి కిరణ్. తను సీక్రెట్‌గా దాచుకున్న తన ఫైల్స్, కెమెరా, డబ్బు, కొన్ని దుస్తులు తీసుకుని ఒక సూట్‌కేసులో సర్ది బయటికి వచ్చాడు. తన పరిస్థితి ఏంటో బోధపడింది. కాబట్టి క్షణాల్లో నిర్ణయం తీసుకున్నాడతను.

తనీ ఊళ్ళో ఉండటానికి వీలవదు. ఎట్ లీస్ట్ కొన్ని సంవత్సరాల పాటు. మనసుని కఠిన పర్చుకున్నాక చకచకా కిందికి దిగి వచ్చాడు. సుజాతని తీసుకుని బస్టాండ్‌కి వచ్చాడు. ఒణికి పోతూ కూర్చుంది సుజాత. సూట్‌కేస్‌లో ఉన్న టవల్ తీసి కప్పాడు.

బస్టాండ్‌లో మెలకువగా ఉన్న ఒకరిద్దరు విచిత్రంగా చూశారు. పావు గంటలో విజయవాడ వెళ్లే డీలక్స్ బస్ రావడంతో ఎక్కి కూర్చున్నారు...

కిటికీ పక్క సీట్లో కూర్చుని విండోకి తలానించింది సుజాత. అంత వరకూ ఒక్క ముక్క కూడా మాట్లాడలేదామె.

కాసేపటికి ఏదో కలలో ఉన్న దానిలా అతని వైపు తల తిప్పి చూసింది. మొహం

**తక్కువ వాగ్దానాలు చేసే వ్యక్తికే ఓటు వెయ్యాలి. ఎందుకంటే అతను మనల్ని ఎక్కువ నిరుత్సాహపరచడు.** —బెర్నార్డ్ బరూచ్

మీద ప్రస్ఫుటంగా కన్పిస్తున్న గాయాలు. "ఏమైంది? " పూర్తిగా అతని వైపు తిరిగి అంది. చేత్తో పెదాలు తడుముకుని నవ్వబోయాడు. నవ్వు రాలేదు. పెదాలు నొప్పెట్టాయి. కాసేపు చూసి "ఎక్కడికి వెళ్తున్నాం? " అడిగింది సుజాత.

"విజయవాడ వెళ్ళి అక్కడి నుంచి కాకినాడ వెళ్దాం" చెప్పాడు రవికిరణ్.

"ఎందుకు? "

గట్టిగా నిట్టూర్చాడు రవికిరణ్. "శత్రువు మనం ఊహించిన దానికన్నా చాలా పెద్దవాడు. మన శక్తి సరిపోదు. యింకా సమయం కావాలి." అతను చెపుతుండగానే సుజాత ఖాండ్రించి కిటికీలోంచి బయటికి ఉమ్మింది.

రవి కిరణ్ మొహం కోపంతో ఓ క్షణం ఎర్రబడింది. అతను తమాయించుకున్నాడు. వెనక్కి తలాన్చి నిద్ర పోవడానికి ప్రయత్నించసాగాడు.

మండుతున్న అగ్ని జ్వాలలమీద ఆజ్యం పోసినట్లుగా ఈ హైదరాబాద్ కూడా తనకి పగనీ ప్రతీకారాల్నే యిచ్చింది. ఒళ్ళంతా భగభగా మండుతున్నట్లుగా, నిప్పుల కొలిమిలా ఉంది. విజయవాడ చేరే వరకూ అలా చూస్తూనే కూర్చుంది.

బస్టాండ్‌లోని వెయిటింగ్ రూంలో కాలకృత్యాలు తీర్చుకుని మొహం కడుక్కుని బయటికి వచ్చాక కాస్తంత ఫ్రెష్ అయినట్లుగా ఉంది. కాంటిన్‌లో టిఫిన్ చేశారిద్దరూ.

వెంటనే కాకినాడ వెళ్లే బస్సెక్కారు. మూడు గంటలకల్లా కాకినాడ బస్టాండ్‌కి చేరింది బస్. అక్కడనుంచి ఆటో ఎక్కి విద్యుత్ నగర్ చేరారు. ఆ కాలనీ చివర చుట్టూ ఉన్న చెట్ల మధ్య ఉంది ఓ ఇల్లు. చాలా చిన్నది. కింద మూడు గదుల పైన దాబా. చుట్టూ తీగలు, మొక్కలు ఎండిపోయి కన్పిస్తున్నాయి. ఆవరణలో ఉన్న సపోటా, జామ, మామిడి, ఉసిరి చెట్లు కూడా నిస్తేజంగా ఉన్నాయి.

"ఎవరిది ఈ ఇల్లు? " అడిగింది సుజాత.

"నాదీ, మా ఫ్రెండ్‌దీ!" చెప్పాడు.

ఆమె మొహంలోని ప్రశ్నార్థకాన్ని గమనించి "నేను నా పదో ఏటనుంచే పని చేస్తూ చదువుకున్నాను. పని చేసినపుడు నాకు దక్కిన ప్రతిఫలంతో నేను ఏ జల్సాలూ చేయలేదు. ఈ స్థలం కొన్నాను. రోజుకి నాలుగ్గంటలే పడుకున్నాను. నాలుగ్గంటలే చదివాను. మిగతా సమయమంతా కష్టపడ్డాను. ఈ రవి కిరణ్ గాడికి ఓ అడ్రస్ ఉండాలంటే ఇల్లు కట్టుకోవాలని కోరిక ఉండేది. అదృష్ట వశాత్తూ నాలాంటి ఫ్రెండే ఒకతను పరిచయమయ్యాడు. నన్ను చూసి ప్రభావితమై అతనూ కష్టపడ్డాడు. రెక్కలు ముక్కలు చేసుకుని ఇద్దరం కలిపి ఇల్లు కట్టాం. అతనికి అమెరికాలోనూ, నాకు హైదరాబాద్‌లోనూ ఉద్యోగాలు రావడంతో ఇదుగో నా స్వర్గధామం ఇలా అయిపోయింది" తలుపు తాళం తీస్తూ అన్నాడు రవికిరణ్.

అపుడే చూస్తున్నంత కొత్తగా చూసిందతన్ని సుజాత. ఆమెలో ఏవో కవాటాలు తెరుచుకుంటున్నట్లుగా ఉంది. కష్టాల్ని కూడా యిలా ఆనందంగా మలుచుకునే వాళ్లుంటారా? అయినా తనకొచ్చిన కష్టాల ముందు ఇతనివి ఏపాటి? హాయిగా అతని జీవితం అతనిష్టం. ఈ సార్ ఏమీ ఆడపిల్ల కాదుగా శీలం పోతుందని బాధ పడటానికి.

ఆలోచిస్తూ లోనికి అడుగేసింది. లోపల చాలా దుమ్ము పట్టి ఉంది. కానీ ఎక్కడి వస్తువులు అక్కడ పొందికగా ఉన్నాయి.

ఆ దుమ్మును చూడగానే రవికిరణ్ లోపలి గదిలోకి వెళ్ళి గబగబా చీపురు తెచ్చి ఊడవడం ప్రారంభించాడు. క్షణం సేపు తెల్లబోయి చూసి ఆనక మొహం పక్కకి తిప్పుకుని ముసిముసి నవ్వులు నవ్వి... ఆ తర్వాత అతని చేతిలోని చీపురు అందుకోబోయింది.

"వద్దు. నాకలవాటే! నువ్వింకో పని

చూసుకో!" చెప్పి బరబరా ఊడుస్తుంటే నవ్వాపుకోలేక పెరట్లోకి పరుగెత్తింది.

ఇద్దరూ కలిసి గదులు శుభ్రం చేసి నూతి నుంచి నీళ్లు తోడుకున్నారు. వంట గదిలో కూడా అవసరమైన సామాన్లు అన్నీ ఉన్నాయి.

ఆ పూటకి హోటల్ నుంచి భోజనం తెస్తానని రేపటి నుంచి వంట చేసుకుందామని చెప్పాడు రవికిరణ్. సాయంత్రం అతను బైటికి వెళ్లి పచారీ సామాను, సుజాతకి మూడు డ్రస్సులు, రెండు నైటీలు తెచ్చాడు. పచారీ సామాను సీసాల్లో సర్దుకున్నారు.

బట్టలు చూసి "ఈ డ్రస్సులు నేనెపుడూ వేసుకోలేదు" మొహమాటంగా అంది సుజాత.

"వేసుకుంటే అవే అలవాటవుతాయి" చెప్పాడు రవికిరణ్. ఆమె నిద్రతో తూలిపోవడం చూసి ఏడున్నరకల్లా కేరీజ్ తెచ్చాడు. భోజనాలవ్వగానే ఆమెకి పడుకోడానికి గది చూపించాడు. తలుపు గడియ పెట్టుకుని ఇలా మంచం మీద వాలిందో లేదో నిద్ర ముంచుకు వచ్చింది. మళ్లీ తెల్లారి ఎనిమిదింటికి రవికిరణ్ తలుపు కొడితే లేచింది. ఎదురుగా మల్లె పూవులా ఫ్రెష్‌గా రవికిరణ్.

"బాగా నిద్ర పట్టిందా?" చిరునవ్వుతో అడిగాడు. "వూ!" తలూపి బాత్‌రూంకి వెళ్లి స్నానాదికాలు ముగించుకుని వచ్చింది.

అతను వేడి వేడి ఉప్మా ప్లేట్‌లో వేసి అందిస్తుంటే తీసుకోడానికి మొహమాటంగా అన్పించింది.

"బావుంది" తిన్నాక చెప్పింది.

"వంట కూడా బాగా చేస్తాను" చెప్పాడు రవికిరణ్.

ప్లేట్స్ కడిగి లోపల పెట్టి వచ్చింది సుజాత. అప్పటికి రవికిరణ్ వరండాలో కూర్చుని ఇంటి ముందున్న చెట్ల వైపు తదేకంగా చూస్తున్నాడు.

తనూ వచ్చి పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది. ఆమె వంక ఓసారి పరిశీలనగా చూసి చిరునవ్వుతో మొదలు పెట్టాడు రవికిరణ్.

"ఇపుడు ఏం చేద్దామనుకుంటున్నావు?" అడిగాడు. అతని ప్రశ్న వినగానే ఆమె మొహం అరుణ వర్ణం దాల్చింది.

"నా చేతిలో ఓ కత్తో కొడవలో ఉంటే బావుండుననిపిస్తోంది" కక్షగా అంది.

ఆ సమాధానానికి విస్తుపోయాడు రవికిరణ్.

"జరిగినవన్నీ మనం మర్చిపోయి కొత్త జీవితాన్ని ప్రారంభించాలి" అనునయంగా అన్నాడతను.

చర్రున లేచి నిలబడింది సుజాత.

"మా గూడెంలో ఆడదాని వంటి మీద చెయ్యేసిన ఎవడినీ మూతిమీద మీసమున్న మొగోడు సహించి ఊరుకోడు. ఈ ప్రపంచంలో మీ మగాళ్లందరికీ ధైర్యం లేదని చెప్పండి. నన్ను అవమానించిన వాళ్లని ఏం చెయ్యాలో నేను చూసుకుంటాను" విసురుగా లోపలి గదిలోకి వెళ్లిపోయింది.

కాసేపు అప్రతిభుడై కూర్చుండి పోయాడు రవికిరణ్. లేచి ఆమెఉన్న దగ్గరికి వెళ్లాడు. మంచం మీద పడుకున్నదల్లా లేచి కూర్చుంది...

"పోనీ నన్నేం చేయమంటావో చెప్పు?" సహనంగా అడిగాడు.

"అక్కడనుంచి పారిపోయి రావడమే చాలా పొరపాటు. మనం అక్కడే ఉండి ఉండాల్సింది" కోపంగా అంది.

"ఎక్కడ?" శాంతంగా అన్నా ఒకింత పదును తొంగి చూసింది. బిత్తరపోయి తలెత్తి చూసింది సుజాత. అది గమనించి అతను కొంచెం సంభాళించుకున్నాడు.

"నువ్వెంత సేపూ నీ దృష్టి నుంచే ఆలోచిస్తున్నావు. నా గురించి ఎందుకు ఆలోచించవు? నా శరీరం మీద వున్న దెబ్బలు నీకు కన్పించడంలేదా? గత పదిహేను రోజులుగా కాలేజీకి, రూంకి వచ్చిన బెదిరింపుల మూలంగా నేననుభవించిన మానసిక ఆందో

ళనని ఎందుకు గుర్తించవు? రౌడీలు దారి కాసి కొట్టినా నీ క్షేమం గురించి తల్లడిల్లి నీ కోసం పరిగెట్టు కొచ్చిన నా అభిమానాన్ని ఎందుకు తలుచుకోవూ? ప్రతి మనిషికీ పగ ప్రతీకారాల కన్నా ప్రాణాలు ముఖ్యం. నువ్వు క్షేమంగా వుంటేనే కదా ఏదయినా సాధించ గలవు? " అతను ఆపకుండా చెపుతుంటే తెల్ల బోతూ వింది సుజాత. ఆ క్షణంలో ప్రతి విషయానికి రెండో కోణం వుంటుందనీ, ఆ వైపు నుంచి కూడా ఆలోచించాలన్న విషయాన్ని నేర్చుకుందామె.

నేర్చుకున్నదాన్ని విడిచి పెట్టకుండా మన స్ఫూర్తిగా అతన్ని క్షమించమని కోరింది. అపుడు ఆమె అడిగిన వాటికి సమాధానాలు చెప్పుకొచ్చాడు రవి కిరణ్.

హాస్టల్ వ్యవహారాల్లో రాజకీయ నాయ కుల ప్రమేయం, తను హాస్టల్లో సుజాత గదిలో చూసిన మాజీ ఎమ్మెల్యే వివరాలూ తననీ సుజాతనీ కలిపి చంపేస్తామని వచ్చిన బెదిరింపులు అన్నీ చెప్పాడు.

వింటుంటే కనపడని వ్యక్తుల మీద కసి పెరిగి పోతోంది సుజాతకి.

"మీరు ఆ సమయానికి రాకపోయి వుంటే వాడు నన్ను పాడు చేసేవాడు. సరే ఎట్టా గైనా వాడిని చంపేసి జైలుకి వెళ్ళివుందును' 'ఆవేశంగా అంది సుజాత.

"ఎందుకు ఆ మాటలు? " చప్పున ఆమె పెదాలు మూస్తూ అన్నాడు. మాటలు రానట్లు మూగదానిలా చూసింది. అతను కూడా కొంచెం తడబడి చెయ్యితీసేశాడు.

వారం రోజుల్లో అతను కాకినాడలోని అతి పెద్ద డిగ్రీ కాలేజీలో లెక్చరర్‌గా చేరాడు. ఉదయం ఎనిమిది నుంచి రెండు వరకూ కాలేజి. పన్నెండు వేల జీతం. సుజాతని గవర్నమెంట్ డిగ్రీ కాలేజిలో సీట్ వుంటే జాయిన్ చేశాడు. ఎనిమిది నుంచీ పన్నెండు వరకూ క్లాసులు. ఆమె సర్టిఫికెట్లు తెప్పించడం కొంచెం కష్టమైనా అక్కడి ప్రిన్సిపాల్‌ని ఫోన్‌లో రిక్వెస్ట్ చేసి పని జరిపించాడు.

పది రోజుల్లో జీవితం గాడిలో పడింది. ఉదయాన్నే ఇద్దరూ లేచి వంట చేసుకుని టిఫిన్ తిని వెళ్ళిపోయేవారు. ఆమె పన్నెం డింటికి రాగానే కుక్కర్‌లో రైస్ పడేసి చదువుకుంటూ కూర్చునేది. అతనొచ్చే వరకు భోజనం చేసేది కాదు. రవి కిరణ్ చెప్పినా అదే పద్ధతి. రెండుంపావుకల్లా అతను వచ్చేవాడు.. యిద్దరూ కలిసి భోజనం చేసి నాలుగున్నర వరకూ పడు కునే వారు. ఆ తర్వాత కాలం గడవడం కష్టంగా వుండేది. ఎంత పని చేసినా రాత్రి భోజనాలయ్యే వరకూ విసుగ్గానే వుండేది.

రవి కిరణ్ ఎంత కష్టపడి ఈ యిల్లు కట్టుకున్నాడో తెలిసిన దగ్గర నుంచీ ఆమెకి కూడా తను కష్టపడి ఎంతో కొంత సంపా దించి ఊళ్ళో అందరికన్నా గొప్పదానిగా మారి తమ ఊరి పెద్దల భరతం పట్టాలని కోరికగా వుండేది.

"చాలా బోర్‌గా వుంటోంది నాకు. అదీకాక మీరు సంపాదించి పెడుతుంటే తింటున్నాను నేను. యిది చాలా బాధాగా వుంది" అంది ఓ రోజు.

"ఏం చేస్తావు మరి? " అడిగాడు.

"ట్యూషన్స్ చెప్పనా? " ఉత్సాహంగా అంది.

"ఊ!" అంగీకారాన్ని తెలియజేస్తూ అన్నాడు. ఆ రోజు సాయంత్రమే ఇచట ట్యూషన్లు చెప్పబడును బోర్డు వెలిసింది. పది రోజులు తిరిగే సరికి ముప్ఫయి మంది పిల్లలు చేరారు. టెంత్ వరకూ సుజాత చెపితే పై తరగతులకి రవి కిరణ్ చెప్పే వాడు. నెలకి రెండు వేల ఆదాయం. తన మీద తనకి నమ్మకం పెరిగింది సుజాతకి.

★ ★ ★

ఆ రోజు ఆదివారం కావడంతో తీరిగ్గా వున్నారు సుజాత, రవి కిరణ్.

అతను వరండాలో కూర్చుని యూనిట్

టెస్ట్ ఆన్సర్ షీట్స్ కరెక్షన్ చేసుకుంటుంటే అప్పుడే తలస్నానం చేసివచ్చిన సుజాత తలారబెట్టుకుంటోంది.

ఎందుకో అటువైపు చూసిన రవి కిరణ్ నొసలు చిట్లించి " సుజాతా! యిలారా!" పిలిచాడు.

"ఏంటీ? " అంటూ వచ్చింది.

"నువ్వెపుడూ నీ పరిధిలో ఆరోగ్యంగా ఉండటానికి ప్రయత్నించలేదా? " అడిగాడు.

అర్థం కానట్లు చూసింది సుజాత.

"నీ జుట్టుని చూసుకున్నావా?. నూనె రాసుకోక. శుభ్రంగా తలంటు స్నానం చెయ్యక ఎలా ఎర్రబడి మృదుత్వాన్ని కోల్పోయిందో చూడు." చెప్పాడు.

ఏం మాట్లాడాలో తెలీక తడబడింది.

"నీ గోళ్ళుకూడా అంతే! సగం విరిగి పాలిపోయినాయి. దంతాలు శుభ్రంగాలేవు. చర్మం ఎండిపోయివుంది. అన్నీ పోషకాహారలోపాన్ని తెలియజేస్తున్నాయి. కడుపు నిండాతిని ఒంటిని శుభ్రంగా ఉంచుకోవడం మన విధి. రోజూ పచ్చడి మెతుకులు తినడంలో చూపించే ఆసక్తి ఆకుకూరలూ, పళ్ళ మీద చూపించడంలేదు" కోపంగా అన్నాడు.

"ఏం చేయను? " జుట్టుని పరిశీలనగా చూసుకుంటూ అంది. మాట్లాడలేదు రవికిరణ్. సిజర్స్ పట్టుకొచ్చాడు. "లోపలికి పద" చెప్పాడు.

కూర్చోబెట్టి జడంతా కత్తిరించి మగపిల్లాడిలా క్రాఫ్ చేస్తుంటే ఏం మాట్లాడితే ఏంతంటానో అన్నట్లు కూర్చుంది. నెయిల్ కట్టర్‌తో నెయిల్స్ కత్తిరించి ట్రిమ్ చేశాడు. ఆ పూటే డెంటిస్ట్ దగ్గరికి తీసుకొని వెళ్ళి క్లీన్ చేయించి బ్రషింగ్ విధానం నేర్పించాడు.

రోజూ రెండుసార్లు స్నానం చెయ్యాలని స్ట్రిక్ట్‌గా చెప్పాడు. అలాగే ఆమె భోజన విధానంలో కూడా చాలా మార్పులు చేశాడు. ప్రతిరోజూ పాలు, గుడ్డు, ఆకుకూరలు, గింజ ధాన్యాలు, తోటలో కాసే పళ్ళు క్రమం తప్పకుండా దగ్గరుండి తింటుందో లేదో పరిశీలించేవాడు.

క్రమంగా చర్మం నునుపు దేలడం ప్రారంభించింది. కొంచెం ఒళ్ళు చేసింది. ఆ నెల రెండు కేజీల బరువు పెరిగింది. వారం రోజులకోసారి ఆమెకి అతనే క్రాఫ్ చేసేవాడు. రోజూ తలంటుస్నానం చెయ్యడం వలన జుట్టు నల్లగా ఒత్తుగా రావడం ప్రారంభమైంది. ఆమెలో శారీరకంగా ఆరోగ్యకరమైన మార్పులు రాసాగాయి.

చూస్తూండగానే సంవత్సరం గడిచిపోయింది. సుజాత ఫస్టియర్ డిగ్రీ ఎనభైమూడు శాతం మార్కులతో పాసయింది. యిద్దరికీ వేసవి శెలవులు యిచ్చారు. ఆ శెలవల్లో చుట్టుపక్కల వున్న ప్రసిద్ధ స్థలాల్ని చూడటానికి నిర్ణయించుకున్నారు.

ఆ రోజు ఉదయం సుజాత లేచేసరికి తోటలోవున్న పూలతో గుత్తిలా తయారు చేసి 'పుట్టిన రోజు శుభాకాంక్షలు' అని నవ్వుతూ అందించాడు రవికిరణ్.

"నా పుట్టిన రోజా? " కొత్తమాట విన్నట్లు అడిగింది. జీవితంలో యింతవరకూ తన పుట్టిన రోజు ఎపుడన్న ఆలోచనే రాలేదు. ఈ రోజు వినగానే విచిత్రంగా వుంది.

"థాంక్యూ!" నవ్వుతూ తీసుకుంది.

"ఈ రోజు నుంచీ నువ్వు మేజర్‌వి. స్వతంత్రంగా ఆలోచించాలి. కాస్తంత వివేకాన్ని తోడుతెచ్చుకుని జీవితాన్ని పూల వనంలా మార్చుకోవాలి" భావుకత్వంతో చెప్పాడు రవికిరణ్.

"ఎవరి కోసం? " వెంటనే అంది సుజాత

ఆ ప్రశ్నకి ఆశ్చర్యంగా చూసి "ఎవరి కోసమో ఎందుకు? జీవితాన్ని ఆనందంగా మలుచుకునేది మన కోసమే!." అన్నాడు.

ఆమె మనసులో రావణకాష్టం రాజుకుంటోంది. "మనం బాగా తిని శరీరాన్ని అందంగా పోషణ చేసుకుని సుకుమారంగా మాట్లాడుతూ ఆహ్లాదంగా గడిపేస్తూ పోవడమేనా జీవితానికి అర్థం? యింకేమీ లేదా? మనల్ని అవమానించిన వాళ్ళకి

బుద్ధి చెప్పొద్దా? మన మీదే ఆశలు పెట్టుకున్న వాళ్ళ జీవితాల్ని బాగు చెయ్యొద్దా? చెడు ఎదురైతే పారిపోవాలా? ఎదురు నిలబడి పోరాడొద్దా? నువ్వు చెప్పినట్లు మనం హాయిగా వుండటమే జీవిత పరమార్థం అయితే అది స్వార్థం కాదా? " ఆవేశంగా అంది సుజాత.

ఆమె మాటల్ని అప్రతిభుడై విన్నాడు. అతనిలో కొత్త ద్వారాలు తెరుచుకున్నట్లయ్యాయి. అతనికపుడు బోధపడింది. జీవితమంతా, ప్రతీ క్షణం మనం నేర్చుకోవలసింది ఎంతో వుందని.

"నిజమే! మన జీవితం కేవలం మన కోసమే కాకపోవచ్చు" సాలోచనగా అన్నాడు.

"అందుకే ఏదో చెయ్యాలి" పట్టుదలగా అంది. "ఏం చేస్తావు? " అడిగాడు.

తెల్లమొహం వేసింది సుజాత.

"అయితే ఒకటి మాత్రం నిజం. మనం బతికుంటేనే ఏదైనా సాధించగలం కాబట్టి మనం బతకాలి. యితరుల కోసం ఏమైనా కృషి చెయ్యొచ్చు కానీ అదే సమయంలో నీ వ్యక్తిగత ఆనందానికి దూరం కావలిసిన అవసరం లేదు. జోరున కురిసే వానలో బీచ్ ఒడ్డున అయిస్క్రీం తింటూ నడవడం నీకు యిష్టమైతే ఆ కోరిక తీర్చుకో! మరోగంటలో పేవ్‌మెంట్ మీద వానకి తడిచి ముడుచుకుపోయిన చిన్నారుల్ని కన్నీళ్ళతో హృదయానికి హత్తుకో! దేనికదే! జీవితాన్ని పార్ట్‌లుగా విడగొట్టుకోవాలి. ఈ ప్రయాణంలో ఉన్నతమైన ఆనందాలే చిట్టచివరకి మన గమ్యాలుగా మారాలి" ఆపాడు రవికిరణ్.

"మా ఊళ్ళో ఆ సుదర్శనం గాడి పని పట్టడమే నా చిట్టచివరి గమ్యం" కళ్ళు కణ కణ నిప్పుకణికల్లా మెరుస్తుండగా అంది. ఈ సంవత్సరంలో ఈ మాట ఎన్నో సార్లు అంది. రగిలిపోతూ అంది. భగభగ మండుతూ అందీ. ప్రళయ కాల ఝంఝానిలంలా వూగిపోతూ అంది.

ఏం జరిగిందని ఎన్నోసార్లు అడిగాడు. ఎపుడూ చెప్పలేదు. ఏ ఊరో, తల్లిదండ్రులు ఉన్నారో లేదా ఏ వివరాలూ చెప్పదు. రోజుకోసారయినా ఊరిని గుర్తు చేసుకుంటుంది. ప్రసాద్ గురించి కళ్ళు మెరుస్తుండగా పొగుడుతుంది. సుదర్శనాన్ని చంపడమే తనధ్యేయం అంటుంది. మధ్యమధ్య హైదరాబాద్‌లో జరిగినవి ఆలోచిస్తుంది. ఆ మాజీ ఎమ్మెల్యేని శిక్షిస్తానంటుంది.

ఇంత చిన్న వయసులో ఇన్ని బాధల్ని కడుపులో పెటుకుని నడుస్తున్న అగ్ని పర్వతంలా కన్పిస్తుంది. తదేకంగా చూస్తుండిపోయాడు. ఆమెని ఓదార్చాలనిపించింది. ఆ అగ్నిగుండాన్ని ఆర్పివేయాలనిపించింది. ఏం చేయాలో తోచలేదు. చటుక్కున ఆమెని తన కౌగిలిలోకి తీసుకున్నాడు. నిశ్చేష్టురాలయింది సుజాత. ఎలా రియాక్ట్‌వ్వాలో తెలియలేదు.

తనకెదురైన మగవాళ్ళు వేరు, ఇతను వేరు. యిన్ని రోజుల్లో ఆ విషయం తెలిసింది.

తన వీపుని చుట్టిన ఓ చేయి, నడుముని చుట్టిన మరోచేయి తనలోని వేడినంతా పీల్చేస్తున్నట్లుగా వుంది. సుగంధ భరితమైన పూలవనంలోకి తను చొరబడినట్లుగా వుంది. హృదయంలోని బాధనంతా అతను తన హృదయంలోకి తీసేసుకుంటున్నట్లుగా వుంది.

"నువ్వు ఈ ఆలోచనలన్నీ మర్చిపోవాలి." మంద్రస్వరంతో చెప్పాడు. తలెత్తి చూసింది. స్వచ్ఛమయిన అతని కళ్ళు బాధతో వుండటం చూసి హృదయం విలవిల్లాడింది.

"ఎందుకు? ." డగ్గుత్తికతో అంది.

"నా కోసం." చెప్పాడు. అతని మాటలు మంత్రాల్లా విన్పిస్తున్నాయి. "అవును. నా కోసమే నువ్వు మారాలి. నీకు తెలిసోతెలియకో నాకు ఈ రోజు జ్ఞానోదయం కలిగేలా చేశావు. మనం సమాజంలో చెడుని




## ఎవరిది పైచేయి

**ఒ**కానొక సందర్భంలో నెహ్రూ రాజాజీతో మాట్లాడుతూ, 'అయ్యా.. మీరెన్ని మాట్లాడినా చెల్లదు.. ఎందు కంటే మెజార్టీ మాదే కనుక.' అన్నారు సరదాగా.

దానికంతే సరదాగా రాజాజీ 'మెజార్టీ మీకుంది. లాజిక్ నాకుంది. కనుక నా మాటలు మీరు వినకతప్పదు' అన్నారు నవ్వుతూ.

ఎంత మెజార్టీ ఉన్నా లాజిక్‌దే పైచేయి కదా? రాజాజీ నవ్వుతో శ్రుతి కలిపారు పండిట్‌జీ.

ఎదుర్కొందాం. దానికి బలయిపోకుండా. మనల్ని నమ్ముకున్న వాళ్ళకి ఏదో ఒకటి చేద్దాం. ఆ క్రమంలో మనం బాధలు పడ కుండా రూప మాయమైన విషయాన్ని ఇన్వె స్టిగేట్ చేస్తాను. నేను ప్రస్తుతానికి అజ్ఞా తంలో వున్నట్లే!. నీ చదువు బాధ్యత తీరి పోయి మంచి ఉద్యోగంలో చేరాక నీకో తోడుని వెతికి నేను మళ్ళీ జర్నలిస్ట్‌గా మార తాను. నాధ్యేయం అదే" చెప్పాడు. తనకో తోడుని వెతికి పెడతానన్న అతని వంక ఆర్తిగా చూసింది. ఇతను పక్కనే ఉంటే తనేంటో మర్చిపోతుంది. తన జీవితానికి ఓ గమ్యాన్ని నిర్దేశిస్తున్న వాడితను.

"మరి నేనేం చెయ్యాలి" అతని గుండెచే స్తున్న చప్పుడుని వింటూ అడిగింది.

"నువ్వు ముందు బాగా చదవాలి. నీకిష్ట మైతే ఉద్యోగంలోచేరు. లేదా స్వావలంబన కి కావలసిన ధైర్యాన్ని పెంచుకో. ఎక్కడైతే అవమానం జరిగిందో అక్కడి ప్రజల్లో చైత న్యాన్ని తీసుకుని రా! వాళ్ళకి నీమీద నమ్మకం కలిగేలా ప్రవర్తించు. నీ పల్లెని బాగు చేసుకో! దానికి ముందు నువ్వు నీ మనసుని బాగు చేసుకో! అందుకు ప్రారం భంగా పి.జి. చదవడం నీ ధ్యేయం కావాలి. కేవలం పుస్తకాల్లో చదువేకాదు. కాలేజీల్లో జరిగే అన్ని పోటీల్లో పాల్గొనాలి. అపుడే ఓటమిని ఎలా హుందాగా జీర్ణింపజేసుకుని గెలుపుకి మెట్టుగా మలుచుకోవాలో బోధప డుతుంది. జీవితంలో ప్రతి అంశాన్నీ నిర్మా ణాత్మక దృష్టితో చూడటం అలవాటు చేసు కోవాలి. అతను చెపుతున్న ప్రతీ మాట మెదడులో నిక్షిప్తం అవుతోంది. మాటలు ఆగిన అయిదు నిమిషాలకి తను ఎక్కడ వుందో గుర్తొచ్చింది. సుజాత సున్నితంగా విడిపించుకుంది.

ఏవో మధురోహలు మనసు మీద దాడి చేస్తుంటే తలెత్తి అతన్ని చూసే ధైర్యం చెయ్యలేక పోతోంది.

★ ★ ★

కాలం మరింత వేగంగా రెండేళ్ళు పరిగె త్తింది. సుజాత డిగ్రీ పూర్తి చేసింది. ఆ సందర్భంగా అతను మోపెడ్ కొనిచ్చాడు. అతను గవర్నమెంట్ ఉద్యోగంలోకి మారాడు. ఖాళీ సమయాల్లో ఇద్దరూ కలిసి సభలకి సమావేశాలకి వెళ్ళేవారు. ఓ సంవ త్సరానికి అవి చాలా విసుగనిపించాయి సుజాతకి.

"ఇదంతా శుద్ధ వేస్టనిపిస్తోంది నాకు. పరి శుభ్రత గురించి, వాతావరణ కాలుష్యం గురించీ ఇలా గంటలు గంటలు ఉపన్యా సాలు ఇవ్వడం దానికోసం స్టేజ్ ఎరేంజ్

*ఆలోచనల్లో విశ్వాసం, కార్యాలలో ధైర్యం, మాటలలో వివేకం, జీవితంలో సేవాభావం ఎప్పుడూ కలిగి ఉండండి.* – లెనిన్



మెంట్లు ఈ హడావిడీ, ఖర్చూ వృధాయేగా! మనందరం జ్ఞానం వున్న వాళ్ళమేగా! నీకు ఈ రోజు ఖాళీవుంది ఈ సమాజాన్ని బాగు చేద్దామని కోరిక కలిగిందనుకో! వెంటనే ఓ పదిమందికి చెప్పు. అందరూ కలసి ఓ కాల నీని శుభ్రం చెయ్యండి, రోడ్లువేసుకోండి. యింకుడు గుంతలు తవ్వండి. మొక్కలు నాటండి. వాట్ నాట్? చెయ్యడానికి ఏం లేదు? . ఈ వర్ధిమాటలు అనవసరం, డబ్బు వృధాచేసుకునే బదులు నీ చేతనైనంతలో ఏదో ఒకటి చెయ్యి. అంతే" ఉపన్యసిస్తున్న ధోరణిలో అంది సుజాత.

అంతసేపూ ఆమెవైపే తదేకంగా చూసి హఠాత్తుగా నోరువిప్పి "నువ్వేం చేస్తు న్నావు? " అడిగాడు.

"నా దగ్గర డబ్బులేదు" బింకంగా అంది.

"అబద్ధం. నీ ట్యూషన్ డబ్బులు యాభై వేలు నేను బ్యాంక్‌లో దాచాను" చెప్పాడు.

"అది మీకు ఎపుడో ఇచ్చేశాను" చెప్పింది.

"కానీ నీ ఎకౌంట్‌లోనే రన్ అవుతున్నా యవి."

రెండు నిమిషాలు ఆలోచించి మోపెడ్ మీద బ్యాంక్‌కి వెళ్ళి ఆ డబ్బు డ్రా చేసి తెచ్చేసింది. ఏం చేస్తుందోనని చూస్తూ కూర్చున్నాడు. డిగ్రీ చదువుతూ ట్యూషన్‌కి వచ్చే పిల్లలు ఆడామగా కలిసి పదిమంది వరకూ వున్నారు. సాయంత్రం వాళ్ళు రాగానే వాళ్ళతో తామేం చెయ్యాలో విపు లంగా చర్చించింది.

ఆమె మాటలు వింటున్న రవికిరణ్ సుజాత నాయకత్వ లక్షణాలకి ఆశ్చర్యపోతు న్నాడు.

మర్నాటి నుంచీ ఆ కాలనీలో ప్రతి యింటికే వెళ్ళి అడుగంటి పోతున్న భూగ ర్భజలాలని పెంచాల్సిన ఆవశ్యకత గురించే యింకుడుగుంతల నిర్మాణం గురించీ, ఇంటింటికీ తిరిగి చెప్పడం ప్రారంభించింది.

ఇంకా ఉంది

ప్రారంభంలో అందరూ కాశీమజిలీ కథలు విన్నట్లు విని నవ్వి వదిలేసేవారు. కానీ పట్టు విడవకుండా ప్రతిరోజూ వెళ్ళి అడ గడం మొదలు పెట్టేసరికీ వాళ్ళు బహిరం గంగా చిరాకుని వ్యక్త పరిచేవారు. ఏ మాత్రం పట్టించుకునేది కాదు. ఆమెకి అవమానాలు కొత్తకాదు. అవే మెట్లుగా భావించింది.

చివరికి వినీవినీ ఆ కాలనీ సెక్రటరీ ఓ రోజు సుజాతని పిలిచి "నీ బాధ నాకర్థమ యిందమ్మా" యింకుడు గుంతలు తవ్వించ డానికి అవసరమైన సమయం, ధనం వెచ్చిం చలేని స్థితిలో యాంత్రికమై పోయిందమ్మా! నేటి మన జీవనం" అన్నాడాయన.

"ఆరెండు మేమే సమకూర్చుతాం. కాస్తంత స్థలాన్ని చూపిస్తే మేమే తవ్వేస్తాం." చెప్పింది.

"నీకంత డబ్బు ఎక్కడిదమ్మా" అడిగాడా యన.

"నేను ట్యూషన్స్ చెపుతూ దాచుకున్న డబ్బుని రవికిరణ్ దాచి ఇపుడు నాకు యిచ్చాడు. దాన్ని వాడతాను" చెప్పింది.

ఆ మాటలకి అతని హృదయం ఆర్ధ్రమ యి పోయింది. ఆయన అంగీకరించాడు. పది రోజుల్లో ఆ కాలనీలో తొంభైఅయిదు శాతం ఇళ్ళకి ఇంకుడు గుంతలు తవ్వారు... సుజాతకి పదిహేను వేలు మాత్రమే ఖర్చ య్యాయి. యువతీయువకులు శ్రమదానం చేశారు.

సుజాత పేరు మార్మోగిపోయింది. ఇంత కాలం రవిబాబు ఇంట్లో ఎవరీపిల్ల అన్నట్లు ఆరాలుతీసే అందరూ ఇప్పుడు నమ్మకం ఏర్పడ్డాక తర్వాత పనులు చురుగ్గా అయిపో యాయి.

ప్రతి యింటి ముందూ, రోడ్డు కిరువైపులా పచ్చని చెట్లు, కాలనీలో వున్న రెండు పార్కులూ, అందులో ఉన్న పూల మొక్కలూ సుజాత ఆమె టీంమేట్స్ చలవే దానికోసం ఎంతోడబ్బు ఖర్చుపెట్టాల్సి వచ్చేది. తనకి ట్యూషన్స్ మీద వచ్చే అయి దారు వేలు మాత్రమే కాక రవిని కూడా అడుగుతుండేది. "నువ్వు సంపాదించుకుని ఖర్చుపెట్టుకో!. ఈ డబ్బులూ అడిగితే మన తిండితిప్పలు ఎవరు చూస్తారు? " చిరుకో పంగా అడిగేవాడు. అయితే ఆ కోపం వెనుక అతని మనసుని ఆమె గుర్తించేది. డబ్బుని పొగేసుకోవడం అతనికి ఆసక్తి వుండని విషయం అని ఆమెకి తెలుసు. "మా రవి సంపాదన ఒకటీ నాది ఒక టేనా? " అని అడిగేది.

కాకినాడ మున్సిపాల్టీలో విద్యుత్‌నగర్‌కి ఆదర్శమయిన కాలనీగా అవార్డ్ వచ్చాక ఆ అవార్డ్‌ని అందుకోవడానికి సుజాతని పిల్చాక అప్పుడు అర్థమైంది ఈ పేరు ప్రఖ్యాతులు తనకి మాత్రమే వస్తున్నాయని. ఆమె చాలా సిగ్గుపడిపోయింది. ఆ అవార్డ్ అందుకోవడానికి ససేమిరా వెళ్ళనంది. "నేనీరోజు ఈ పనులు చేయగలిగానంటే రవి కారణం. నాకు తిండి పెట్టి చదువు చెప్పించి, నాకు జ్ఞానం కలిగేలా బోధించి ఇప్పటికే మనకాలనీ పనులకి డబ్బుల్ని వెచ్చించేది రవే!. ఈ అవార్డుకి నేనే మాత్రం అర్హురాలిని కాదు" అని నిర్ద్వంద్వంగా తిర స్కరించింది.

రవి చాలా సంతోషించాడు ఆమె తనని హైలైట్ చేసినందుకు కాదు. కీర్తి ప్రతిష్టలు ఊబిలో కూరుకపోవాలన్న ఉబలాటం ఆమెలో లేనందుకు. అంతేకాదు. ఆమె మరింత ఉత్సాహంతో మళ్ళీ ఈ పనులు ప్రారంభిస్తుందనీ తెలుసు. ఆమెకి సమాజం బాగుపట్ల తపనే తప్ప మరేమీ స్వార్థం లేదన్న విషయం అర్థమయింది.

అతడు మళ్ళీ తన పూర్వపు పనిలో పడి పోయాడు. కలం అతని ఆయుధం. పాల స్తీనా, ఇజ్రాయెల్ సమస్యలకి సంబంధించి అతను రాసిన విశ్లేషణాత్మక వ్యాసం అమె రికాలోని ప్రముఖ పత్రికలో ప్రచురింపబడ టంతోపాటు అక్కడ మూడు రోజుల పాటు

జరిగే పశ్చిమాసియా దేశాల శాంతి సదస్సుకి ఆహ్వానం అందింది.

రవికిరణ్ కన్నా సుజాత చాలా సంతోషించింది.

"ఇదే మంచి అవకాశం. 'ప్రపంచ పోలీస్' తో సహా ఎవరెవరి గురించి ఏమనుకుంటున్నారో నిర్భయంగా సెమినార్‌లో చర్చించేసిరా!" చెప్పింది. నవ్వుకున్నాడు రవి. ఇపుడు సుజాతని చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది రవికిరణ్‌కి. ఒకపుడు ఆవేశం పట్టుదల తప్ప మరేమి లేనమ్మాయి ఇపుడు తన జీవితంమీద తనకి ఎంత కమాండ్!! అంతేనా? సమాజం పట్లా సమస్యల పట్లా ఎంత నిబద్ధత.

వ్యక్తిగత జీవితంలో ఇప్పటికీ ఆమె అల్లరి పిల్లే! అమాయకురాలే!

ఎమ్మెస్సీ కెమిస్ట్రీలో జాయినయింది. జాయినయిన రోజే చెప్పింది. కెమికల్స్‌కీ నాకూ పడదు. కానీ వాటితోనే స్నేహం చేయాల్సిన పరిస్థితి! అని. ప్రీవియస్‌లో యూనివర్సిటీ సెంకడ్ ప్లేస్‌లో నిలబడింది.

ఆ సమ్మర్‌లో ఓరోజు చుక్కల పందిరి కింద వెన్నెల వెలుగులో కూర్చుని తదేకంగా ఆకాశాన్ని చూస్తున్న సుజాతని అడిగాడు రవికిరణ్.

"నా నుంచి నువ్వేమైనా ఆశిస్తున్నావా?" అని. అతని మనసు సమాధానం కోసం ఆతృతగా ఎదురుచూస్తోంది. అతని వంక తలతిప్పి చూసింది సుజాత. ఇరవైఏడేళ్ళ యవ్వనంలో కోడెతాచులా మిడిసి పడుతున్నాడతను. అల్లరిగా.

"అవును" అంది తలూపుతూ.

"ఏంటదీ?" చటుక్కున లేచి కూర్చుంటూ అడిగాడు.

అతని ఆతృతకి కిలకిలా నవ్వింది. చుక్కలు తెల్లమొహం వేశాయి. "ప్లీజ్ చెప్పు" కంగారు పెట్టాడు. తల వంచుకున్నా మెల్లని ఖచ్చితమైన స్వరంతో "రూప జాడ నాకు తెలియాలి" అంది. ఇన్నేళ్ళలో ఎప్పుడూ ఈ ప్రస్తావన రాకపోయేసరికి ఆమె మర్చిపోయిందనే అనుకున్నాడు. కానీ ఆమె ఆ పట్టుదల నుంచి వెనక్కి రాలేదు..

అతను నిర్ఘాంతపోయి విన్నాడు. "ఒకపుడు చాలా విషయాలకి జడిసి మన శక్తి సరిపోదని మనం వెనక్కి తగ్గాం. ఇపుడు అంతర్జాతీయ విషయాలపై విశ్లేషణ చేసి ప్రసిద్ధి పొందుతున్న జర్నలిస్ట్‌వి. రూప జాడ నువ్వు కనుక్కోలేవా?" ఆర్తిగా అతనివైపు చూస్తూ అంది.

నిట్టూర్చాడు రవికిరణ్. "ఒకపుడు నేను హైదరాబాద్ వదిలి వచ్చింది నీకోసం... కేవలం నీకోసం. అక్కడే వుంటే నా ప్రాణాలనీ, నీ ప్రాణాలనీ రక్షించలేనన్న ఉద్దేశంతో వచ్చేశాను. కానీ ఇప్పటికీ నీ బాధ్యత నాదే కదా!" పెద్దరికంగా అన్నాడు రవికిరణ్.

"నేనేం చిన్నపిల్లని కాదు" బుంగమూతి పెట్టి అంది.

"సరే! ఎమ్మెస్సీ కాగానే ఏం చేద్దామని?" కుతూహలంగా అడిగాడు. ఆలోచనలో పడింది సుజాత. కాసేపటికి తేరుకుని "మా ఊరు వెళ్ళాలి" కాసేపాగి "సుదర్శనం సుదర్శనాన్ని మర్చిపోలేను. రవీ! మనిషి మారి ఉంటాడా సరే! లేకపోతే సరైన గుణపాఠం నేర్పి తీరుతాను" నిశ్చయంగా అంది. ఆ మాటల్లో ఎలాంటి ఆవేశమూలేదు. "మరి నేనూ?" చిన్న పిల్లాడిలా అడిగాడు. పకాపకా నవ్వింది సుజాత. "మీకోసం ప్రపంచంలో చాలా సమస్యలూ, స్కామ్‌లూ ఎదురుచూస్తున్నాయి మహానుభావా! వాటిని పరిశోధించి, పరిష్కరించాల్సిన బాధ్యత మీదే!" అంది. ఆమె నవ్వులో తనూ శృతి కలిపాడు.

ఆ సంవత్సర కాలంలో అతను కాకినాడలో ఉంటూనే శెలవల్లో హైద్రాబాద్ వెళ్లొస్తూ రూప మిస్సింగ్ గురించి ఎంక్వయిరీ చేశాడు. హాస్టల్ అవకతవకలకి సంబంధించి పకడ్బందీ రిపోర్ట్ తయారు చేశాడు. హాస్టల్లో మూడు సూయిసైడ్ కేసులు, రెండు మిస్సింగ్ కేసులూ అపరి

ష్కృతంగా వున్నాయి. వాటిని తవ్వి తీశాడు. రంగం అంతా సిద్ధమయింది. సుజాత ఫైనల్ ఎగ్జామ్స్ కోసం వేచివున్నాడతను. ఆ పరీక్షలు ముగియడం రిజల్ట్స్ రావడం యూనివర్సిటీ ఫస్ట్‌ర్యాంక్‌ని ఆమె సొంతం చేసుకోవడం జరిగాయి.

ఇద్దరికీ సెలవులు ప్రారంభమయ్యాయి. చెప్పరాని ఏదో దిగులు గూడుకట్టుకోవడం మొదలయింది. ఆదేంటో తెలుసు. ఇక ఎవరి లక్ష్యాల కోసం వాళ్ళు ఉద్యమించక తప్పదు. వి..డి..పో..క తప్పదు.

ఒకరి నుంచి మరొకరు ఏదో తెలుసుకోవాలన్న ఆరాటం. తెల్లవారి లేచి గార్డెన్ పని చేస్తుండగా సుజాత రవికిరణ్‌తో అంది. "రెండు మూడేళ్ళలో మా ఊరిని, ఊళ్ళో వాళ్ళని ఆదర్శవంతంగా తీర్చిదిద్దేశాననుకో! తరవాత ఏం చేయను? " అమాయకంగా అడిగింది.

నవ్వొచ్చింది రవికిరణ్‌కి "ప్రజలంతా ఆదర్శవంతంగా మారిపోయి ఇక అలాగే ఏ తప్పులూ చేయకుండా వుండటం జరగదు. ఇది నిరంతరం సాగే ప్రక్రియ. అయిపోవడం అంటూ వుండదు" చెప్పాడు. బిక్కమొహం వేసింది సుజాత. "అంటే నేను మా ఊరు వెళ్ళి అక్కడే వుండిపోవాలా? " అడిగింది.

"నీ కోరిక అదేగా!" అన్నాడు.

"వూ!" తల వూగించింది.

"అక్కడ కొత్తజీవితాన్ని మొదలుపెట్టు. ఆ జీవితంలో నేను తక్కువగా తొంగి చూడవచ్చు. కానీ మనిద్దరి మధ్యా ఉన్న ఈ అనుబంధం ఎప్పటికీ చెక్కు చెదరదు" చెప్పాడు.

తోటపని ఆపేసి మరీ వచ్చి కన్నీళ్ళతో అతని చేతులు పట్టుకుంది. విచలితుడయ్యాడు రవికిరణ్.

"బాధపడకు" అనునయంగా అన్నాడు. అతని జీవితంలో మొట్టమొదటిసారిగా ఏర్పరచుకున్న బంధం. ఆమె చిన్నపుడు మోతుబరి అయిన తన తండ్రి మరింత ఆస్తికోసం భార్య అక్కకి తనని దత్తత యిచ్చాడు. అక్కడి స్వభావాలని పసి వయసులోనే జీర్ణించుకోలేకపోయాడు. పదోఏటే ఇల్లొదిలి పారిపోయి వచ్చాడు. అప్పటి నుంచీ అతని జీవితంలో కుదిపేసే బంధమే లేదు. ఈ అయిదేళ్ళుగా సుజాత తప్ప! ఈమెతో బంధం శాశ్వతమా? తాత్కాలికమా? అని ఏనాడూ ప్రశ్నించుకోలేదు. అందుకే ఇపుడు ఎవరి మార్గాల్లో వాళ్ళు వెళ్ళాలనుకుంటున్నపుడు మనసు కలవరంగా మారుతోంది.

అతనికి తోటపని చేయబుద్ధికాలేదు. లేచి స్నానం చేసి కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుకోసాగాడు. చూపు దానిమీదే వున్నా మనసు ఎక్కడికో వెళ్ళిపోయింది.

మధ్యలో వంటగదిలో శబ్దాలు విని వెళ్ళాడు. సుజాత కూరగాయలు కొయ్యడం చూసి తనూ సహాయంగా అందించసాగాడు. అతను మౌనంగా వుండటం ఆమెకి వెలితిగా తోచింది.

"మా ఊరు వచ్చేయండి" సరదాగా అంది.

బలహీనంగా నవ్వాడు. "రావాలనే వుంది. సమయం వచ్చినపుడు వస్తాను" చెప్పాడు. ఇన్నాళ్ళలోనూ సుజాత ఎప్పుడూ తనావూళ్ళో పొందిన అవమానాలను ఏరోజూ చెప్పలేదు. ఆమె తరుచుగా ప్రసాద్‌నీ మంచి స్నేహితుడిగానూ, సుదర్శనాన్ని పగా ప్రతీకారాలతోనూ తల్చుకుంటూ ఉండేది తప్ప తన ఊరి పేరు కూడా చెప్పడానికి ఇష్టపడేది కాదు. నేను అనుకున్నదంతా సాధించాక తప్పకుండా చెపుతాననేది.

అనుకున్న రోజు రానే వచ్చింది. సుజాత తన సర్టిఫికెట్లు అవసరమయిన దుస్తులు తీసుకొని ఊరికి బయల్దేరింది. అదే రోజు తను తయారు చేసుకున్న రిపోర్ట్స్‌తో రవికిరణ్ హైదరాబాద్ బయల్దేరుతున్నాడు.

కాసేపట్లో ఇంటికి తాళం వేస్తామనగా ఆ ప్రదేశాన్ని వదల లేకపోయింది సుజాత. ఇక్కడి అణువణువూ తనని సేదతీర్చి

అంతో యింతో జ్ఞానాన్ని కలుగజేసినదే. వదిలి పెట్టడం చాలా బాధాకరంగా ఉంది. యిదంతా ఒకెత్తు తన ప్రియాతి ప్రియమ యిన వ్యక్తిని విడిచి పెట్టడం మరొక ఎత్తు.

సూట్ కేస్ సర్దుతున్న అతని దగ్గరికి వచ్చి "రవీ!" పిలిచింది సుజాత. తిరిగి చూశాడు. అతని మొహం భావావేశంతో కంది పోయి ఉంది. పైకి నిర్మలంగా నవ్వాడు.

అతనికి దగ్గరగా వచ్చి ఊహించే లోపే అతని చెంపల్ని ముద్దాడి "నా జీవితంలో తల్లిదండ్రులకన్నా, తోడబుట్టిన వాళ్లకన్నా, మరే యితరులకన్నా నాకు ముఖ్యుడివి. నాకు నీ మాటే వేదం. యిన్నాళ్లలో నువ్వు నాకు చేసిన సహాయానికి యింకొకరైతే ఏదో రకంగా ఋణం తీర్చుకునే వారు. కానీ నాకు ఆ ఆలోచనే ఎపుడూ రాలేదు. నీ దగ్గర ఉండటం, నువ్వు నాకు తిండి పెట్టి చదివించడం నా హక్కుగా ఫీల య్యాను. నీ యిబ్బందులు ఏనాడూ పట్టించు కోలేదు. ఏనాడూ నువ్వు నాతో అసభ్యంగా ప్రవర్తించలేదు. లోకంలో మగాళ్ల మీద నాకున్న అసహ్యాన్ని చిన్నప్పుడు ప్రసాద్ స్నేహం పోగొట్టింది. ఇపుడు నీ ఔదార్యం పోగొడుతోంది. చాలా కృతజ్ఞతలు రవీ!" బొంగురుపోయిన గొంతుతో అంది సుజాత.

నోట మాట రానట్లుగా కాసేపు నిల్చుండి పోయాడు రవికిరణ్.

చివరికి తేరుకుని "నీకు ఎప్పటికీ తోడు గానే ఉంటాను. నీకు ఏ సహాయం అవస రమయినా నన్ను కాంటాక్ట్ చెయ్యి" ఆమె నుదుటి మీద చుంబించి చెప్పాడు.

ఆ తర్వాత తను ఊరొచ్చేసింది. రవి సాయంతో సుదర్శనం వాళ్ళు వాడుకున్న లోన్ల వ్యవహారాన్ని పేపర్లో వచ్చేలాగా చేయించింది. బస్ విజయవాడ చేరుకున్న సూచనగా రణ గొణ ధ్వనులు వినిపించేస రికి ఆలోచనల నుంచి బయట పడింది సుజాత. తన ఈ ఆలోచనలన్నింటినీ ప్రసాద్ తోనే కాదు. ఎవరితోనూ షేర్ చేసుకోవాలనిపించడం లేదు.

ఈ రోజు మధ్యాహ్నం హైదరాబాద్ నుంచి కాకినాడ వెళ్తూ విజయవాడలో దిగు తానని వీలుంటే కలుసుకోమనీ తన సెల్ కి ఫోన్ చేసి చెప్పాడు రవి. అంచేతనే యిపుడు విజయవాడ వచ్చింది. బస్ దిగి హైదరా బాద్ నుండి బస్సులు వచ్చే ప్లాట్‌ఫాం మీదకి చేరుకుని ఖాళీగా ఉన్న బెంచీ మీద కూర్చుని ఎదురు చూడసాగింది. అరగంట అయ్యాక బస్ వచ్చింది. రవి విండోలోంచే చూసి చెయ్యూపాడు. తనని చూడగానే అతని మొహంలో కలిగిన సంభ్రమాన్ని గమనించగానే మనసు ఝల్లుమంది.

"హలో!" షేక్ హాండ్ యిస్తూ ఎన్నో యుగాల తర్వాత కలుసుకున్న వాడిలా ఆర్తిగా చూశాడు. ఆమె కూడా అంతే! యిద్దరూ పరిసరాలు మరిచిపోయి ఒకరినొ కరు చూసుకుంటూ ఉండిపోయారు.

అతనే ముందు తేరుకుని "పద! ఏదోక హోటల్లో లంచ్ చేస్తూ మాట్లాడుకుందాం" అన్నాడు. అతన్ననుసరించిందామె. "ఎలా ఉంది మీ ఊరు? " స్టివార్డ్ ఆర్డర్ తీసుకుని వెళ్లాక రిలాక్స్‌డ్‌గా వెనక్కి వాలి అడిగాడు. ఆమె తను సాధిస్తోన్న విజయాలని మెరు స్తున్న కళ్లతో వివరించి అతను వెళ్ళిన పని గురించి అడిగింది.

ఒక వారం లోపు నేనేం చెప్పక్కర లేకుం డానే నువ్వే అన్నీ తెలుసుకుంటావు. మనిద్ద రికీ కలిపి దొరికిన అతి విలువైన సమ యంలో ఆ విషయాలు మాట్లాడటం వృథా" అన్నాడు.

"మరి యింక అంతకన్నా విలువైన విష యాలు ఏమున్నాయి? " అడిగింది. "నువ్వే చెప్పాలి మరి? " లోతుగా ఆమె కళ్లలోకి చూస్తూ అన్నాడు. కను రెప్పలు సిగ్గు బరు వుతో కిందికి వంగాయి.

అపురూపంగా ఆ దృశ్యాన్ని చూశాడు. అతని మనసులో ఆలోచనలు సుడి రేగుతు

న్నాయి. మాటల మధ్యలో ఆమె తన ఊరి పేరు చెప్పిన దగ్గరనుంచీ అతనిలో కల్లోలం చెలరేగుతూనే ఉంది. తను ఏ ఊరిని యిన్నాళ్ళూ మర్చిపోయి ప్రశాంతంగా ఉన్నాడో, సుజాత ఆ ఊరి కోసమే పాటు పడుతోంది. అతని మొహం కందిపోయింది. కళ్లు మంకెన పువ్వుల్లా తయారయ్యాయి. అతను హఠాత్తుగా సుజాత చేతిని తన చేతుల్లోకి తీసుకుని

"నాతో వచ్చేయగలవా? మనిద్దరం స్వేచ్ఛగా ఎక్కడికేనా వెళ్లిపోదాం. యిన్నాళ్ళూ పోరాటాలూ, ఆకలిదప్పులూ, అవమానాలతో గడిపాం. యిక ఆనందంగా జీవించే హక్కు మనకి ఉంది. మనం నేర్చుకున్న చదువు తిండి పెడుతుంది. ఇరవై ఏళ్లలో అరవై ఏళ్ళ కష్టాలని అనుభవించాం. యిక చాలు. భరించే ఓర్పు లేదనిపిస్తోంది." ఆరాటంగా అన్నాడు. అతను మాట్లాడిన ఒకో మాట హృదయపు లోతుల్ని చీల్చి వేసింది. నీకు నేనున్నానంటూ గుండెలకి హత్తుకోవాలనిపించింది. కానీ చివరికి ఏమీ చేయలేక బొమ్మలా కూర్చుండిపోయింది సుజాత.

వెంటనే తేరుకున్నాడు రవికిరణ్. ఆమె చెయ్యి వదిలి వాష్ బేసిన్‌లో మొహం కడుక్కుని వచ్చాడు. ఎప్పటిలా అతని పెదాలపై చిరునవ్వు. మొహం తేటగా ఉంది. "సారీ!' ' యిందాక ఏదేదో మాట్లాడాను" అన్నాడు. ఈ లోగా సర్వర్ ఫుడ్ ఎరేంజ్ చేసి వెళ్లాడు. అతను జోక్స్ వేస్తూ భోజనం చేస్తున్నాడు.

భోజనం అయిపోయాక "థాంక్స్ సుజాతా!" నాప్‌కిన్‌తో చెయ్యి తుడుచుకుంటూ అన్నాడు రవికిరణ్.

"ఏం? " ఆశ్చర్యంగా అంది.

"ఇందాక నేనడిగినదానికి 'యస్' చెప్పివుంటే ఇన్నాళ్ళ నుంచీ నేను నీకు సమాజం పట్ల కలుగజేసిన అవగాహనకి అర్థం లేకుండా పోయేది. 'నో' చెప్పివుంటే నా హృదయం గాయపడివుండేది. నీ మనసులో ఏముందో కానీ నువ్వు మౌనంగా వుండి నాకు మేలు చేశావు" మనస్ఫూర్తిగా అన్నాడు.

అప్పటి వరకూ ఆ విషయం గురించే ఆలోచిస్తూ తన నిర్ణయం చెప్పబోతున్న సుజాత వెనక్కి తగ్గింది. రవి ఆమె చెయ్యి పట్టుకునే హోటల్ నుంచి బైటకి వచ్చాడు. "అనుబంధం అంటే శరీరాలు కలిసి వుండటం కాదు. అది ఆత్మలు పెనవేసుకున్న బంధం" అంటూంటారు చాలామంది ఆ మాటల తీవ్రత ఏంటో ఇప్పుడు బోధపడుతోంది" అన్నాడు. మళ్ళీ బస్టాండ్‌కి వచ్చారు.

"ఇపుడు కాలి నడకేనా? " అడిగింది.

"వూ!"

"మన గృహ సామ్రాజ్యానికి యిక నువ్వొక్కడివే రాజు"దిగులుగా అంది. "నువ్వే నీ పనులతో అక్కడ అలిసిపోతే సేదదీరడానికి మా పర్ణశాల, ఈ దాసుడు ఎపుడూ సిద్ధంగా వుంటారు" చెప్పాడు సరదాగా.

ముసిముసిగా నవ్వింది సుజాత. అతను బస్సెక్కి వెళ్ళిపోతుంటే ఈ సారెందుకో అంత బాధ కలగలేదు. వ్యక్తిగత ఆనందం కన్నా మరింత ఉవ్విళ్ళూరించే లక్ష్యం ఏదో కళ్ళముందు స్పష్టంగా కన్పిస్తోంది. మొహం నిండా చిరునవ్వు వెలుగుతో నిటారుగా ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతూ టాటా చెపుతున్న సుజాతని చూసి అతని మనసంతా తృప్తితో నిండిపోయింది. ఈ సమాజానికి ఓ ఉన్నత వ్యక్తిని అందివ్వడంలో తనూ భాగస్వామినన్న తృప్తి అది. కనుమరుగయ్యే వరకూ చూసింది సుజాత. మనసుకి నూతనోత్తేజం ఏదో వచ్చినట్లనిపించింది. ఏలూరు వెళ్ళే బస్సెక్కింది. అప్పటికే ఏడు గంటలు దాటింది. ఊళ్ళోకి వెళ్ళడానికి లాస్ట్‌బస్ దొరుకుతుందో లేదోనని ఆలోచిస్తూ కూర్చుంది. ఎనిమిది గంటలకల్లా అడ్డరోడ్డు దగ్గర బస్ దిగింది.

ఆ లైట్ల వెలుగులో చూసింది. ప్రసాద్ పడిగాపులు పడుతూ అక్కడే నిల్చున్నాడు.

హృదయం ద్రవించింది.

"నేనొచ్చేసేదాన్నిగా! నువ్వెందుకు యిలా? శ్రమకదూ!"అంది సుజాత.

"ఈరోజు ఆదివారం కదా! లాస్ట్‌బస్ వుండదు. నువ్వు యింత చీకట్లో ఒక్కదా నివీ నడిచి రావడం కష్టం కాదూ!. అందుకే నే వచ్చా" నడుస్తూ అన్నాడు. చిన్నగా నవ్వింది.

పైన చందమామ తోవ చూపిస్తుండగా చుట్టూ పొలాలు చల్లగాలిని తోడు పంపగా ప్రశాంతమయిన హృదయాలతో మాట్లా డుతూ నడుస్తున్నారు.

★ ★ ★

నెల రోజులు తిరిగే సరికి ప్రభుత్వ లోనులతో గొట్టెల పెంపకం, సుద్దముక్కలు, బొమ్మల తయారీ, రైసుమిల్లు, పిండిమిల్లు ప్రారంభించారు.

మొదటి నెలలో బాలారిష్టాలను దాటు కుని అన్ని ఖర్చులూ పోగా పదహారు వేలు మిగిలింది. ఈ వ్యాపారాలలో పనిచేసే వాళ్ళూ తమ జీతాలని తాము తీసుకోగా మిగిలిన మొత్తం మరో రెండు నెలలు కష్ట పడి కొంత ధనాన్ని సమకూర్చుకున్నాక రోడ్డు మీద యధేచ్ఛగా పారుతున్న మురుగు నీటిని అరికట్టి డ్రైనేజీ సిస్టమ్‌ని డెవలప్ చేయించి పక్కారోడ్డు నిర్మాణం కోసం ఈ ధనాన్ని వుపయోగించి శ్రమ దానం ద్వారా అనుకున్నది సాధించాలని అంతా కలిసి సుజాత ఆధ్వర్యంలో నిర్ణయిం చుకున్నారు.

సుజాత తన సొంతంగా అయిదు పాడి గేదెలను కొంది. ఆమె వచ్చేపుడు రవికిరణ్ యిచ్చిన డబ్బు అది. తన తమ్ముడు రాజుకీ, పండుబాబుకీ వాటి బాధ్యతని అప్ప గించింది. దాణా, మేత, వాటికి నీరు, పాలు పిండటం, వాటిని నీళ్ళు కలపకుండా చిక్కగా ఏలూర్లో వాడుక ఇళ్ళలో పోసిరా వడం చేసేవారు. దానిమీద తమ కుటుంబం ఖర్చు పండుబాబుకి జీతం పోగా నాలుగువేలు మిగిలేది. అది కూడా ఊరి బాగుకోసం దాస్తున్న డబ్బులో కలి పింది. ఆమె నిస్వార్థం అందరిలో ఐక్యతని పెంపొందింపజేసింది.

యువతీ, యువకులు చాలా మంది తమ కష్టార్జితాన్ని అవసరాలకి సరిపడా వుంచుకుని మిగతాది ఆ ఎకౌంట్‌లో వేసే వారు. సగం మంది ఈ విధానాన్ని విశ్వ సించలేదు.

ఎవరినీ బలవంతం చేయలేదు సుజాత. తమ గూడెం బాగు పడాలన్న తపన వున్న వాళ్ళంతా సుజాతతో కలిశారు.

ఊళ్ళోవాళ్ళంతా ఏదో జరుగుతుంది. మళ్ళీ కలహాలు ప్రారంభమౌతాయి అన్న వాళ్ళంతా ఏమీ చడీ చప్పుడు లేకుండా సుజాత వాళ్ళు తమ పని తాము చేసుకు పోవడానికి జీర్ణించుకోలేకపోయారు.

యింతలో కొన్ని ప్రభుత్వ పథకాలను గ్రామంలో అమలు చేసే గ్రామస్థులకి ప్రభుత్వ సహాయం అందుతుందన్న వార్త తెలిసి మొట్టమొదట విలేజ్ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌ని కలిశారు సుజాతా, ప్రసాద్ వాళ్ళందరూ. అతని సలహామీద మండలా ఫీసర్‌ని, ఆర్ అండ్ బి కార్యాలయ అధి కారులనూ సంప్రదించి తాము ఈ నాలు గైదు నెలల్లో పోగుచేసిన తొంభైఅయిదు వేల రూపాయలూ మరియు తాము చేసే శ్రమదానం సాయంతో పక్కారోడ్లు, మురికి కాలువల నిర్మాణం జరగాలని కోరారు.

ఆ అధికారులు చాలా సంతోషించారు. ప్రజల్లో యింతగా చైతన్యం వచ్చినందుకు ఆ తర్వాత పని ప్రారంభమవడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

ఆ డిపార్ట్‌మెంట్ల సిబ్బంది వచ్చిన వారం రోజులూ ఊళ్ళో ఖాళీగా వున్న పిల్లా పీచూ, ముసలీ ముతకా ఎవరు చేయగలిగిన సాయం వాళ్ళు చేశారు. పనిలో పనిగా గూడెం చివర పూడుకుపోయిన చెరువుకు



### అలల్ని ఆగమంటే ఆగవు

సభలో నెహ్రూను తూర్పారపడుతున్నారు రాజాజీ ఒకసారి.

ఆ ప్రసంగాన్ని చీటికి మాటికి అడ్డుకుంటూ నెహ్రూకు జిందాబాద్‌లు కొడుతున్నారు కాంగ్రెస్ సభ్యులు.

దాంతో ఒళ్లుమండిన రాజాజీ, 'మీ భజన బృందం జిందాబాద్‌లు, జేజేలుఆర్థికసూత్రాలను తిరగరాయలేవు. కాలంచెల్లిన సోషలిజాన్ని పట్టుకునివేళ్లాడుతూ ఇదే మోడర్నిజమ్ అంటూ చెబితే నమ్మేందుకు ఇక్కడెవరూసిద్ధంగా లేరు. సముద్రం ఒడ్డున కూర్చుని అలల్ని వెనక్కుపొమ్మని ఆదేశించిన కనూటా రాజులా ఉంది మీ తీరు.. దాన్ని మార్చుకోండి..' అంటూ నిప్పులు చెరిగారు.

పూడిక తీశారు. ప్రతి ఇంటి ఆవరణలోనూ వాన నీటిని వృధా పోనివ్వకుండా ఇంకుడు గుంతలు నిర్మించారు.

ముందు పెదవి విరిచిన వారూ, సహాయ నిరాకరణ చేసినవారూ, పని ప్రారంభమయ్యాక ఒక్కొక్కరే వచ్చి చేరారు.

గూడెంలో ప్రధాన రోడ్లన్నీ మిలమిల్లాడుతూ తయ్యారయ్యాయి. ఇపుడు మురుగు నీరు ఎటు వెళ్తుందో కంటికి కనపడటం లేదు.

తర్వాతి కార్యక్రమం వర్షాకాలంలో మొక్కల పెంపకం, పరిశుభ్రత గురించి వ్యక్తుల్లో అవగాహనా కార్యక్రమం.

ఇది చాలా కష్టమయిన విషయం. ఒక రకమయిన జీవితానికి, జీవన విధానానికి అలవాటు పడిపోయిన వాళ్ళని మార్చడం అంత సులభమైన విషయం కాదు. దాని కోసం పదేపదే వాళ్ళ యిళ్ళకి వెళ్ళి చెప్పి రావల్సి వచ్చేది. కొంతమంది వినేవారూ. మరికొంతమంది మొహం చిట్లించేవారు.

రవి చెప్పినట్లు యిది నిరంతరం కొనసాగే ప్రక్రియ అని నిట్టూర్చేది సుజాత.

గూడెం వాళ్ళు సాధిస్తున్న విజయాలు క్రమంగా ఊళ్ళోవాళ్ళకి కంటగింపుగా మారాయి. తగిన సమయం కోసం వేచి చూస్తున్నారు. వాళ్ళు.

★ ★ ★

"అయ్యా! ఈ ఘోరం విన్నారా?" గోవింద శాస్త్రి లబలబలాడుతూ పరిగెత్తుకొచ్చాడు.

"ఏంటి శాస్త్రిగారూ!" గంభీరంగా అన్నాడు సుదర్శనం.

"ఇంత తాపీగా వున్నారంటే ఇంకా విషయం మీ వరకూ రాలేదన్న మాట" ఒగరుస్తూ అన్నాడు గోవింద శాస్త్రి

సుదర్శనం నొసలు ముడిపడింది. "విషయం చెప్పవయ్యా నాన్చకా" కసురుతూ అన్నాడు.

"ఇంకా నాన్చేదేవుందయ్యా! అంతా అయిపోయింది. ఈ ఊరి పరువు ప్రతిష్టలు మంటల్లో కలిసే రోజులు వచ్చాయి. గూడెం వాళ్ళూ, ఆ హరిజనులూ ఆలయ ప్రవేశం చేస్తారంట. ఈ మాట నా నోటితో నేను చెప్పాలంటే చాలా బాధగా వుందయ్యా!. యిలాంటి ఘోరాలు చూడటం కోసం యింకా బతికున్నామా అన్పిస్తోంది" నెత్తినోరూ కొట్టుకుంటూ అన్నాడు.

షాక్ తగిలిన వాడిలా లేచి నిలబడ్డాడు సుదర్శనం.

"ఎవరు చెప్పారు?" సింహగర్జనలా

వుందా స్వరం.

ఉలిక్కిపడ్డాడు గోవిందశాస్త్రి "అయ్యా! నా మీద అరిస్తే ఏంటి వుపయోగం? అవతల కొంపలంటుకుంటుంటే" అంటూ ఏదో అన బోయి సుదర్శనం మొహం చూసి ఆగిపో యాడు. ఆ కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. మీసాలు మరింత మెలిదిరిగి కన్పిస్తు న్నాయి. అణువణువునా క్రౌర్యం గూడుక ట్టుకుని వుందా అన్పిస్తోంది.

"ఊళ్ళో పెద్దలందరినీ పంచాయితీ ఆఫీ సుకి రమ్మనండి. మీటింగ్ పెట్టుకుందాం" అని చెప్పి ఆఫీసుకు బయల్దేరాడు సుద ర్శనం. పాలేర్లని పిలిచి కబురు పురమా యించి తనూ అతని వెనకే బయల్దేరాడు గోవిందశాస్త్రి.

పంచాయితీ ఆఫీసు ఇసకేస్తే రాలనంత జనంతో నిండి వుంది. కానీ అంతా నిశ్శ బ్దమే! ఎవరి మొహాల్లోనూ నెత్తురు చుక్క లేదు.

అంతా ఊపిరి బిగిబట్టి సుదర్శనం వంకే చూస్తున్నారు. లేచినిలబడి గొంతు సవరిం చుకున్నాడు సుదర్శనం

అందరిలోనూ అతనేం చెపుతాడోనన్న ఆత్రుత. "అందరికీ నమస్కారం" క్షణం ఆగి "మీ ముందు నేనింకా యిలా జీవచ్ఛవంలా నిల్చివున్నందుకు సిగ్గుపడుతున్నాను" జనా లందరూ పక్కన వాళ్ళతో గుసగుస లాడ సాగారు.

"ఈ ఊళ్ళో ఈ మధ్య కాలంలో సంభవి స్తున్న పరిణామాలు చూస్తుంటే మళ్ళీ ఏదో శని ఈ ఊరిని పట్టి పీడించబోతుందని పిస్తోంది. కొన్ని వందల ఏళ్ళనుంచీ యిక్కడ కొలువున్న ఆ శ్రీరామచంద్ర ప్రభువు మనని క్షేమంగా చూస్తున్నాడు కాబట్టే మనం యిలా సుఖంగా వున్నాం. ఆ పవిత్రమైన ఆలయ గౌరవాన్ని కాపాడాల్సిన బాధ్యత మన మీద వుంది. ఎన్ని విప త్తులు ఎదురైనా మనమంతా ఒకటై మన గుడిని మనం రక్షించుకుందాం. ఈ మధ్య ఏవో మాటలు నా చెవిన పడ్డాయి. వాటిని నేను ఖండిస్తున్నాను. అర్హత గలవారికే ఆలయ ప్రవేశం. ఇది నిర్ద్వంద్వమయిన విషయం. దీని కోసం ప్రాణాలనైనా ధార పోస్తాను. అంతా ఇందుకు సిద్ధంగా వున్నా రని ఆశిస్తున్నాను" ఆవేశంగా అన్నాడు సుదర్శనం.

"అవును మేం కూడా సిద్ధమే!" అంతా అరిచారు.

"మూలనున్న ములుకర్రలకి, కత్తులూ, కొడవళ్ళకి పనిచేప్పే సమయం ఆసన్న మయ్యింది" భూషణం పౌరుషంగా అన్నాడు.

"ఇంతకాలం కమతగాడు పనికి ఎగ నామం పెట్టినా, మేస్త్రీలతో సహా కూలీ లంతా పొలం పనికి రాకపోయినా పక్క ఊరి నుంచి పిలిపించుకుని సర్దుబాటు చేసుకున్నాం. కానీ ఇలా మన మీదే ఎక్కి పెత్తనం చెయ్యాలనుకుంటే మాత్రం సహించి ఊరుకునేది లేదు" పార్థసారథి అన్నాడు.

ఆ మీటింగ్‌లో చివరికి రైతులు, పెద్ద కుటుంబాల వాళ్ళూ అంతా కలిపి హరిజను లని ఆలయంలోకి అనుమతించ కూడదని తీర్మానించుకున్నారు.

అందరి హృదయాలూ వేడెక్కాయి. ఆవే శపూరితమైనమాటలూ, ప్రతిజ్ఞలు కదం తొక్కుతున్నాయి. చానాళ్ళ తర్వాత తమకి అవకాశం చిక్కినట్లుగా తీర్చుకోవాల్సిన ప్రతీ కారానికి ఇదే సమయమన్నట్లు ప్రతి ఒక్కరూ ఉద్విగ్నంగా ఉన్నారు.

"ఈ సారి సీతారాముల కల్యాణోత్స వంలో తలంబ్రాలు తెల్లని ముత్యాలు కావు అవి ఎరుపెక్కిపోతాయి చూడూ" ఓ యువకుడు పౌరుషంగా అన్నాడు.

***జీవితాన్ని ఏ భావాలతో నింపుకుంటామో అలాంటి భావాలే మనకు ఎదురుపడతాయి.*** – ఎమర్సన్

ఆ హాలు బయట ఉన్న జీతగాళ్ళకి ఆవిషయాలు అన్నీ వినబడుతూనే ఉన్నాయి.

వాళ్ళంతా కొత్తని జీర్ణించుకోలేని పాతతరపు అవశేషాలు. తాము పుట్టు బానిసలమన్న భావాలను బలంగా నమ్ముతున్న వాళ్ళు. గూడెంలో సుజాత తదితరులు చేసే కార్యక్రమాల్ని మనసులో మెచ్చుకున్నా పైకి ప్రకటించలేని బలహీనులు.

ఈ మీటింగ్ విశేషాలు విని బెంబేలెత్తిపోయారు. ఊరి పెద్దలు పంచాయితీ ఆఫీసునుంచి బైటకి వస్తూ తమని చూసిన చూపులకి విలవిల్లాడిపోయారు.

సుదర్శనం బైటకి వచ్చినపుడు వాళ్ళకి పైప్రాణాలు పైనే పోయాయి. తుండుగుడ్డ నడుముకి చుట్టుకుని చేతులు కట్టుకుని గజగజలాడుతూ నిల్చున్నారు.

ఎరుపెక్కిన అతని కళ్ళు, మెలేస్తున్న మీసకట్టు, నడుస్తున్నపుడు అదురుతున్న నేల అతని మనసుని తెలియజేస్తున్నాయి. నడుస్తున్న వాడల్లా వీళ్ళ దగ్గరికి వచ్చి ఆగాడు సుదర్శనం.

ఏం జరుగుతుందోనని అందరూ ఊపిరి బిగబట్టి నిల్చునున్నారు.

ఏమైందో ఊహించేలోపు అతను జీతగాళ్ళ పక్కన ముడుచుకుని పడుకున్న కుక్కని కాలితో ఒక్క తన్నుతన్నాడు. అది కుయ్యోమొర్రోమంటూ వెళ్ళి అవతల పడింది...

"కుక్కలకి ఉండాల్సింది విశ్వాసం. తిట్టినా కొట్టినా పడుండే విశ్వాసం" హూంకరిస్తున్నట్లుగా అన్నాడు. జీతగాళ్ళు బెదిరి నాలుగడుగులు వెనక్కి వేశారు.

కుక్క వంక అర్థవంతంగా చూసి ముందుకి అడుగేశాడు. అతన్ని అనుసరించారంతా.

జీతగాళ్ళు కాళ్ళీడ్చుకుంటూ గూడేనికి బయల్దేరారు.

★ ★ ★

రైసుమిల్లు దగ్గర నిల్చుంది సుజాత. ఊళ్ళో రైతులు ధాన్యం ఇక్కడికి తోలకపోయినా పని ఆగలేదు. టౌన్లో పాలు వాడు కపోయించుకునే వాళ్ళే బియ్యం కూడా కొనుక్కుంటున్నారు. ధాన్యం కొని రైసుమిల్లులో ఆడించి చవకగా మేలు రకం బియ్యాన్ని అమ్ముతున్నారు. ఎంత ధర తక్కువ వేసినా ఇంకా లాభం మిగలడం చూసి ఆశ్చర్యపోయేది సుజాత. దళారీలు ఇలా ఎంత సంపాదించి ఉంటారోననిపించేది.

బియ్యం పాలిష్ అవుతుంటే బియ్యం గింజల్ని చేతిలోకి తీసుకుని పరిశీలిస్తున్నాడు ప్రసాద్.

వెనకగా నిలబడి "ప్రసాద్!" పిల్చింది సుజాత. చప్పున తిరిగి చూశాడు. ఆమెని చూడగానే పొద్దు తిరుగుడు పువ్వులా వికసించింది మొహం.

"ఏంటీ సుజీ!" ఆనందాన్ని ఏమాత్రం దాచుకునే ప్రయత్నం చేయకుండా అన్నాడు.

"ఏం లేదు. ఓ సారి నిన్ను చూసిపోదామని. అంతేకాదు మాట్లాడాలి కూడా!" అంది.

"ఈ రెండిట్లో ఏది నిజమో చెప్పు?" ముసిముసిగా నవ్వుతూ అడిగాడు.

తనూ నవ్వింది సుజాత.

"చూడాలనిపించడం మనసుకి సంబంధించినది. మాట్లాడటం లక్ష్యానికి సంబంధించినది. రెండూ నిజమే" అంది.

ఆమె మాటలకి మనసు పరవశించిపోతుండగా బైటకి వచ్చాడు. మిల్లుబైట వున్న రావిచెట్టు మొదట్లో వున్న బల్ల మీద కూర్చున్నారు.

దూరంగా ఊక ఒక బంగారపు రాశిలా కనిపిస్తోంది. సూర్యకిరణాలు వాటికి మరింత మెరుగు పెడుతున్నట్లుగా వున్నాయి.

ఇద్దరి చూపూ ఆ రాశి మీదే వుంది.

"సీతారాముల కళ్యాణానికి తలంబ్రాలు

ఈ మిల్లు నుంచే వెళ్ళాలి ప్రసాద్" ఉద్వే గంగా అంది సుజాత.

తలాడించాడు ప్రసాద్. అతని మనసులో ఎన్నో ఊహలు నిన్న సాయంత్రం జీత గాళ్ళు వచ్చి చెప్పిన మాటలు విన్న తర్వాత రక్తం సలసలా మరుగుతోంది. "ఇవి మామూలు కుక్కలు కావనీ, నరకలోకపు జాగిలమ్ములనీ తెలియాలి" పంతంగా అన్నాడు ప్రసాద్.

"తెలుసుకుంటారు ప్రసాద్. వాళ్ళది గ్రహించి తీరాలి. గ్రహించడం వాళ్ళ సమస్య. మనకీలోపు చాలా పనులున్నాయి. మనం టౌన్ వెళ్ళాలి. ఈ రోజు చాలా ముఖ్యమైన పనుంది" లేచి నిలబడి అంది సుజాత.

తనూ లేచాడు ప్రసాద్. మిల్లులో వర్కర్‌కి బాధ్యతని అప్పగించి బయటకి వచ్చాడు.

ఇద్దరూకలిసి నడుస్తున్నారు. మధ్యమధ్య గాలికి ఆమె చీరకుచ్చిళ్ళు ఎగిరి అతని కాళ్ళకి తగులుతున్నాయి. ఆమె చేతిలో చేయికలిపి నడవాలన్న బలమైన కోరిక ఉప్పెనలా పొంగుతోంది.

"సుజీ" పిలిచాడు ప్రసాద్. అతని కంఠం కొత్తగా వింతగా వుంది.

"ఊ!" చుట్టూ వున్న చెట్లని చూస్తూ అంది.

"సీతారాములకి కళ్యాణం చేయించేవాళ్ళు దంపతులై ఉండాలి తెలుసా?" అడిగాడు.

"తెలుసు."

"నాకూ ఆ అదృష్టం కావాలని ఉంది." గుంభనగా అన్నాడు. విభ్రమంగా అతని వంక చూసింది సుజాత.

"నిజమే ఊరికోసం ఇన్నాళ్ళుగా తపన పడిన నీకు మొదటగా కల్యాణం చేయించే హక్కు వుంది" నిజాయితీగా అంది.

"నా మొహం" మొహం గంటు పెట్టుకుంటూ అన్నాడు "ఏం?" తెల్లబోయి అంది.

"ఆ అదృష్టం గురించి సరే" అంటూ దానికి ముందున్న క్లాజ్ గురించి చెప్పాడు.

"ఓ! దంపతులే కల్యాణం చెయ్యాలన్న విషయమా? అయితే పెళ్ళిమీదకి మనసు పోయిందన్నమాట. నీ మనసులో ఎవరైనా వున్నారేంటి?" అంటూ అతని మొహం చూసింది. చూడగానే చెప్పలేని భావాలు మనసుని ముప్పిరిగొన్నాయి. తనకి చిన్నతనం నుంచీ ప్రాణంలో ప్రాణంలా మెలిగిన ఆ స్నేహితుని మొహంలో అనురాగం జాలువారుతోంది. ఆ చూపులో, పెదవి చివరి వంపులో. నుదుటి మీద చిందరవందరగా పడిన జుత్తులో ఏదో కొత్తదనం. ఆ కళ్ళు తనని హిప్నటైజ్ చేసి తనలో కలిపేసుకుంటున్నట్లుగా భ్రాంతి. బలమైన అతని చేతులు తనకి రక్షణ వలయంగా చుట్టివేయాలన్న ప్రగాఢమైన కాంక్ష.

అతను చూస్తూనే వున్నాడు. ఆమె కళ్ళు తిప్పుకోలేకపోతోంది. తనలో ఏమీ మిగలకుండా సర్వం అతను తనలోకి తీసేసుకున్నట్లనిపిస్తోంది. కలవరంగా చూపులు తిప్పుకుంది. తిప్పుకున్న కళ్ళముందు రవికిరణ్ నవ్వుతూ ప్రత్యక్షమయ్యాడు.

అయోమయంగా అన్పించింది. అశాంతిగా తోచింది. తన వ్యక్తిగత జీవితం సంక్లిష్టం కాబోతోందా? ఆమె మనసులో ఉద్భవించిన ప్రశ్న మనసు లోయల్లో ప్రతిధ్వనిస్తోంది.

"సుజీ సమాధానం చెప్పలేదు నువ్వు" రెట్టించాడు. "ఏం చెప్పను?" అసహాయంగా తల వంచుకుని నడుస్తూ అంది.

"ఈ నవమి నాటికి నాకు తోడు దొరుకుతుందో లేదోనని" ఆరాటంగా అడిగాడు.

"లేడికి లేచిందే పరుగని ఇంత కంగారైతే ఎలా?"

"పోనీ వచ్చే సంవత్సరం నవమి నాటికి?" వదలకుండా అడిగాడు.

మౌనం వహించింది సుజాత. అతని మనసు బాగానే అర్థం అవుతోంది. కానీ దానిని కన్‌ఫాం చేసుకోడానికి చాలా

భయంగా వుంది. ప్రసాద్ తన జీవితంలో విడదీయరాని భాగం. అందులో సందేహం లేదు. కానీ. అతన్ని తన జీవిత భాగస్వామిగా అంగీకరించాలంటే ఎదురుగా రవికిరణ్ కన్పిస్తున్నాడు. 'నాతో వచ్చేయగలవా?' అని అతను అడగడం విన్పిస్తోంది. అతని ప్రేమ . గుర్తొస్తోంది. ముళ్ళపొద లాంటి తనను అతను జ్ఞానం అనే నీరుపోసి నందనవనంలా మార్చడం గుర్తొస్తోంది.

తన అసహాయస్థితికి ఉక్రోషం కలిగింది. దానిని బయట పెట్టకుండా మామూలుగానే

"ప్రసాద్! మన లక్ష్యం ఏంటి? నువ్వు మాట్లాడే మాటలు ఏంటి?" చిరుకోపంగా అంది.

"నీ లక్ష్యాన్ని సాధించేటపుడు ఓ ఉత్సాహ భరితమైన తోడుని నువ్వు కోరుకోవాలి గానీ జీవితంలో మరుపురాని మధురమైన అనుభూతులకి దూరంగా వుండమని ఎవరైనా చెప్పారా?" తనూ అదే టోన్‌లో అన్నాడు ప్రసాద్.

రవికిరణ్ మాటలు గుర్తొచ్చాయి. అతను కూడా అచ్చం ఇలాగే మాట్లాడేవాడు కదా! ఇక లాభంలేదనుకుని మొహం సీరియస్‌గా పెట్టి నడవసాగింది.

బస్సెక్కి- ఏలూరు చేరే వరకూ మాట్లాడలేదామె. ఆ తర్వాత రాష్ట్ర విద్యాశాఖామంత్రి విడిది చేసిన గెస్ట్‌హౌస్‌కి వెళుతూ తన ఆలోచనని అతనికి వివరించింది. చాలా మెచ్చుకున్నాడు ప్రసాద్. చేతికి మట్టి అంటకుండా ఇంత సులువుగా సమస్య పరిష్కారం కాబోతోందంటే 'సుజీ' తెలివి తేటలే కారణం.

గెస్ట్‌హౌస్ ముందు ఆటో దిగుతుండగా అంది "నీకో అద్భుతమైన వ్యక్తిని చూపించబోతున్నాను" అని "ఎవరు?" ఆత్రుతగా అడిగాడు.

"నన్నిలా తీర్చిదిద్దిన మహానుభావుడు" హృదయంలోంచి వచ్చినట్లుగా బరువుగా ఉందామె మాట.

"నిజంగా" ఆశ్చర్యంగా ఆమె వంక చూశాడు.

"పద" అతని భుజం తట్టి అంది.

గెస్ట్‌హౌస్ ఆవరణలో ఓ చెట్టుకింద నిలబడి వున్నాడతను. దూరం నుంచే చూపించింది. జంటగా నడిచివస్తున్న సుజాత, ప్రసాద్‌లని చూసి ఓ క్షణం తన మనసు కలుక్కుమనడాన్ని అంతర్ముఖుడై పరిశీలించుకుని ఆశ్చర్యపడ్డాడు రవికిరణ్.

"ఈయనే ఆ అద్భుతమైన వ్యక్తి రవికిరణ్" ప్రసాద్‌తో చెప్పింది.

తన కృతజ్ఞతా భావాల్ని ఏమాత్రం దాచుకునే ప్రయత్నం చెయ్యలేదు ప్రసాద్. నిస్సంకోచంగా షేక్‌హాండ్ కోసం చెయ్యిచాచిన రవికిరణ్‌ని మనసారా కౌగలించుకుని "ఈ ఆరేళ్ళలో ఏం జరిగిందో నాకు సుజీ చెప్పలేదు. ఓ చల్లని నీడలో సేదదీరి వచ్చిందన్న విషయం మాత్రం గ్రహించగల్గాను. అది మీరే అయినందుకు చాలాసంతోషం. మీ ఋణం తీర్చుకునేది కాదు" చెమర్చిన కళ్ళతో ప్రసాద్ అంటుంటే రవికిరణే కాదు సుజాత కూడా ఆశ్చర్యపోయింది. అతని హృదయంలో ఆ పచ్చిదనం వున్నందుకు.

"మీ అందరికన్నా తనకి నేను గొప్పగా సాయపడిందేమీలేదు" రవికిరణ్ మృదువుగా అన్నాడు.

ఈ లోపు అటెండర్ వచ్చి రవికిరణ్‌తో ఎపాయింట్‌మెంట్ గురించి గుర్తుచేసి వెళ్ళాడు.

"మనకిచ్చిన టైమ్ అయిదు నిమిషాలే! అసలు ఆయనకి సంబంధించిన విషయం కూడా కాదు కదా! అందుకే ఎక్కువ డిస్కషన్ వుండదు. నాకు తెలిసీ 'ఎస్' ఆర్ 'నో' అంతే! త్వరగా తేలిపోతుంది." చెప్పాడు.

అరగంటలో వీళ్ళవంతు వచ్చింది. ముగ్గురూ లోపలికి వెళ్ళారు. మినిస్టర్ తన సీట్లో కూర్చుని వున్నాడు. రవికిరణ్‌ని చూసి పలకరింపుగా నవ్వి ఛెయిర్స్ చూపించాడు. ముగ్గురూ కూర్చున్నారు. తర్వాత ఎక్కువ

ఆలస్యం చేయలేదు సుజాత. ప్రతి సెకనూ ఎంత విలువైందో తెలుసు. "మా గ్రామంలో హరిజనులకి ఆలయ ప్రవేశాన్ని నిషేధించారు" డైరక్ట్‌గా విషయంలోకి వస్తూ అంది సుజాత విద్యాశాఖామంత్రి మొహంలో ఆశ్చర్యం తొంగి చూసింది.

"ఈ కాలంలో కూడానా? " నమ్మలేనట్లు అన్నాడు.

"సమానత్వం మీ పట్టణాల్లో వచ్చిందేమో గానీ మా పల్లెల్లోకి రాలేదండీ!" ప్రసాద్ అన్నాడు.

తలపంకించాడాయన. "నేనేం చెయ్యాలో చెప్పండి" అడిగాడు. చెప్పింది సుజాత. విన్న ఆయన మొహంలో హాసరేఖ. "ఇలాగే చేయాలని ఎందుకనుకున్నారు? " అడిగాడు.

"అతి సున్నితమయిన కుల మత భావనలకి, ప్రజల మనోభావాలకి మధ్య వైరుధ్యం ఏర్పడినపుడు రక్తం ఏరుల్లా ప్రవహించేలా చేయడానికి మనం మధ్యయుగాల్లోలేం. జీవితంలో ఇదో చిన్న అంశం. దీనికోసం జీవితాల్ని పణంగా పెట్టలేం. అలాగని భారత రాజ్యాంగం మాకిచ్చిన హక్కుల్ని వదులుకోలేం" చెప్పింది సుజాత.

ముగ్గురూ ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు. ఆయన ఓ నిమిషం ఆలోచించి "యస్" అన్నాడు. ముగ్గురిలోనూ ప్రస్ఫుటమైన ఆనందం తొంగిచూసింది. ఆయనకి కృతజ్ఞతలు చెప్పిలేచారు.

"సగం పని అయిపోయినట్లే!" హుషారుగా అన్నాడు ప్రసాద్. తలూపాడు రవికిరణ్.

అప్పటికి గుర్తొచ్చింది సుజాతకి. రవికిరణ్ ఇన్వెస్టిగేషన్ సంగతి. "రూప సంగతి ఏమైంది? " ఆత్రుతగా అడిగింది. నిట్టూర్చాడు రవికిరణ్. "నా ఇన్వెస్టిగేషన్, రిపోర్ట్స్, సాక్ష్యాలూ అన్నీ ఓ దినపత్రికకి పంపించాను. కానీ కొన్ని కారణాల చేత అవి ప్రచురించడం కుదరదని పంపేశారు. నేను వదలనుగా! ఇంకో పత్రికకి పంపుతాను" మొండిగా అన్నాడు.

వాళ్ళిద్దరి మాటలు వింటూ నిల్చున్నాడు ప్రసాద్.

"రూప జాడ తెలిసిందా." ఆత్రుతగా అడిగింది.

"ఊ" విషాదంగా అన్నాడు.

"ఎక్కడుంది? "

చేయిపైకెత్తి ఆకాశంవైపు చూపించాడు. వెర్రిగా అతనివైపు చూస్తుండిపోయింది సుజాత. ఇప్పటికీ మనోఫలకంమీద నుంచి తొలగని ఆమె రూపం కళ్ళముందు కదలాడింది.

"ఎలా? " అడిగింది.

"అబార్షన్ చేయించడానికి నాటుమందులు వాడారు. అది వికటించి ప్రాణాలమీదకి వచ్చింది. రెండ్రోజులు వంటతని ఇంట్లో నరకయాతన అనుభవించి చచ్చిపోయింది. కిచెన్‌లో పనిచేసే మామ్మ ఇపుడు అక్కడ పనిచేయడం లేదు. ఆమెని వెతికి పట్టుకుని ఆమె ద్వారా చాలా విషయాలు తెలుసుకున్నాను" మెల్లగా అన్నాడు రవికిరణ్.

రూప చనిపోయిందా?

ఇంత దారుణంగా చంపబడిందా?

మనసు మెలితిప్పినట్లు ఒకటే బాధ. మొహం వివర్ణమైపోయింది. కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి. సుజాత బాధని చూసి విలవిల్లాడిపోతున్నాడు ప్రసాద్.

దగ్గరగా వచ్చేసి ఆమె చేతుల్ని పట్టుకుని "ఎందుకు సుజీ! బాధపడుతున్నావు? ఆ అమ్మాయిని చంపినోళ్ళని ఏం చెయ్యాలో నువ్వు చెప్పు? అట్టా అన్యాయంగా ప్రాణాలు తీసేవాళ్ళని ఉట్టినే వదలకూడదు" ఆవేశంగా అన్నాడు. అప్పటికి తమాయించుకుంది సుజాత. ప్రసాద్ చేతుల్ని సున్నితంగా విడిపించుకుంది. "ఏం లేదు. ఎప్పటివో పాత సంగతులు" మాట దాటేయబోయింది.

అంతే! తాడెత్తున లేచాడు ప్రసాద్.

"ఆ! పాత సంగతులే! గుండెల్ని కోసే పాతసంగతులు. రక్తాన్ని సలసల మరిగించే సంగతులు. మరిచిపోయిందెపుడు! పౌరుషం లేనోళ్ళకి మల్లే చేతులకి సంకెళ్ళు వేస్తున్నావు. ఇట్టా ప్రతి దానికీ సర్దుకుపోబట్టే అన్యాయాలు చేసేవాళ్ళందరూ పెచ్చుమీరిపోతున్నారు". అతని వీరంగాన్ని ముచ్చటుగా నవ్వుతూ చూశాడు రవికిరణ్. తనకి పరిచయమైన కొత్తల్లో సుజాత ఎలా వుండేదో ఆ ప్రతిరూపంలా వున్నాడు ప్రసాద్.

"ఏంటాపాత సంగతులు? " ఆసక్తిగా అడిగాడు రవికిరణ్. సుజాత మొహం ఓ క్షణం ఎర్రబడింది. వెంటనే లేచి "పద ప్రసాద్! బస్‌కి టైమవుతోంది" హడావిడి చేసింది. "వుండు సుజీ" అంటూ రవికిరణ్ పక్కన చేరి "మీకేం చెప్పలేదా? " అడిగాడు.

"ఊహూ!"

"అదే విషయం. చెపితే ఇంతకాలం మీరు ఊరుకోరు. సుజాతని వెంటపెట్టుకుని వచ్చి మరీ ఆ సుదర్శనంగాడిని" అంటూ ఏదో చెప్పబోతుండగా

"ప్రసాద్!" కోపంగా పిలిచింది సుజాత.

ఈ మధ్యకాలంలో ఆమె కోపాన్ని చూడని ప్రసాద్ బిత్తరపోయి. "వస్తున్నా! నువ్వు నడుస్తుండు" అని సుజాతతో చెప్పి రవికిరణ్‌తో రహస్యంగా "మీరు మా ఊరు తప్పకుండా రండి. మీతో చాలా విషయాలు మాట్లాడాలి. కడుపురగిలే విషయాలు. మీరన్నా ఏదోక ప్రతీకార మార్గాన్ని చూపిస్తారని నా ఆశ" గబగబా చెప్పి తప్పకుండా ఊరు రమ్మని చెప్పి వెళ్ళాడు.

విసవిసా నడుస్తూ వెళుతున్న సుజాత వంక సాలోచనగా చూశాడు రవికిరణ్.

★ ★ ★

తుఫాను ముందు ప్రశాంతత. ఊళ్ళో అంతా గుడి దగ్గరకి చేరుకున్నారు. సుదర్శనం, అతని భార్య కల్యాణం చేస్తారని అందరికీ తెలిసింది. ఏదో జరగబోతోందని అందరికీ నిశ్చయంగా తెలుసు. అదేంటో చర్చించాలంటే ఎవరికి వారికి భయంగా వుంది.

రామాలయాన్ని బాగా అలంకరించారు. గుడి ఆవరణలో చలువపందిళ్ళు, పానకం డ్రమ్ములు సిద్ధంగా వున్నాయి. ఇళ్ళలో ఒక్కరు కూడా లేకుండా ముసలీ ముతకా, పిల్లాపీచు అందరూ గుడిదగ్గరికి చేరుకున్నారు.

గుళ్ళోకి ప్రవేశించే మార్గానికి రెండువైపులా యువకులు బాణాకర్రలతో సిద్ధంగా వున్నారు. అంతా అప్రమత్తంగా వున్నారు. గూడెం జనాల అయిపూ అజాలేదు. తమకి భయపడి తోకముడిచి వుండొచ్చన్న ఆలోచన వాళ్ళకి హుషారిచ్చింది.

ముహూర్తం సమయం దగ్గర పడుతూండటంతో సుదర్శనం దంపతులు ఆలయంలోకి ప్రవేశిస్తుండగా జరిగిందా సంఘటన. ఎవరూ ఊహించనిది.

దూరంగా దుమ్ము రేపుకుంటూ గూడెం వైపు నుంచి వస్తున్న ఎస్కార్ట్ వాహనాల సైరన్లు. గుడిదగ్గర మనుషులు బిత్తరపోయి చూస్తుండగా ఓ పదివరకూ జీపులూ కార్లు వచ్చి ఆగాయి.

సుదర్శనం వెనక్కితిరిగి చూశాడు. అతని కళ్ళకి మొదటగా కన్పించింది తన స్నేహితుడైన ఎమ్మెల్యే. అతనిని చూడగానే గర్వంతో మరింత పొంగింది ఛాతీ. తమ గ్రామస్థుల వంక తన ప్రతాపం చూడండన్నట్లు చూశాడు.

దగ్గరగా వెళ్ళి ఆలింగనం చేసుకోబోతుంటే ఎమ్మెల్యే దులపరించేసుకుని 'మినిస్టరున్నాడయ్యా!' అటు వెళ్ళు ముందు' అన్నాడు.

మరింత తబ్బిబ్బై అటు పరిగెత్తాడు. విద్యాశాఖామంత్రి, అతని భార్య కారు దిగారు.

"మీ గుళ్ళో కల్యాణం జరిపించాలని

ఉందయ్యా! అందుకే నా భార్యతో వచ్చాను. మీకేమీ అభ్యంతరం లేదు కదా!"

"అబ్బెబ్బే! ఎంత మాట!! ఇది మా అదృష్టం" అంటూ ఆయనని సమీపించి నిశ్చేష్టుడిలా నిలబడి పోయాడు.

ఆయన దిగిన కారులోనుంచి దిగుతోంది సుజాత. వెనక వచ్చిన వాహనాల్లో ప్రసాద్, మోహన్, ప్రకాశం, సురేఖ. అంతా గూడెం వాళ్ళే!.

ముందుకడుగేశాడు మంత్రి. అనుసరించారు గూడెంవాళ్ళు. అప్పటికి అర్థమయింది సుజాత ఎత్తుగడ ఏంటో! మొహం కందగడ్డలా మారిపోయింది. అతి ప్రయత్నంమీద కోపాన్ని అణిచిపెట్టుకుని. "సార్ వాళ్ళు" అంటూ గూడెంవాళ్ళని చూపించి ఏదో చెప్పబోతుంటే మంత్రి తిరిగి.

"వాళ్ళు నావాళ్ళే. నేనూ వాళ్ళవాడినే!" అంటూ ముందుకడుగేస్తుంటే ఆయనెవరో ఏంటో ఏమీ అర్థం కాని యువకులు కర్రలు పట్టుకుని ఆయనకి అడ్డంగా నిల్చున్నారు. బాడీగార్డ్స్ మంత్రి ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నారు. విద్యాశాఖా మంత్రి మొహంలో నవ్వు మాయమయింది. కించిత్తు అవమానం పొడసూపుతోంది.

ఎమ్మెల్యే లబలబలాడుతూ సుదర్శనం దగ్గరికి పరిగెత్తి. "ఏంటయ్యా! ఈ పని? . నా నియోజకవర్గంలో ఇలా జరిగిందంటే నాకెంత అవమానం? అదీకాక ఇది ఎంత వరకూ వెళ్తుందో తెలుసా? " గట్టిగా అన్నాడు.

అప్పటికి తేరుకున్నాడు సుదర్శనం. నూటికి తొంభైశాతం ఇప్పుడు తను చేయగలిగేది లేదు. మిగిలిన పదిశాతం అవకాశంలో చాలా రిస్క్ ఉంది.

ఆ యువకులకి తప్పుకోమని సైగ చేశాడు. అప్పటికే తమ గుడికి వచ్చింది మంత్రి అని తెలిసేసరికి వాళ్ళకి తడబాటు ప్రారంభమయింది.

అందరూ చీలి తోవ ఇవ్వగా మంత్రి, ఆయన భార్య, సుజాత, ప్రసాద్ అంతా లోపలికి వెళ్ళారు.

పుట్టిన ఇన్నేళ్ళ తర్వాత తను మొదటిసారిగా తమ ఊరి గుడిలోకి అడుగుపెట్టడం. ప్రసాద్ వంక చూసింది. అతని మొహం కూడా గత జ్ఞాపకాల బరువుతో ఉద్విగ్నంగా ఉంది. ఇక్కడ ప్రవేశించినందుకేగా తనకు వాతలు పెట్టారు. అప్రయత్నంగా ఛాతీని తడుముకున్నాడు. సుజాత అతని వంక ఊరడింపుగా చూసింది.

వాళ్ళు లోపలికి వెళ్ళాక పూజారి వెర్రిగా వాళ్ళవంక చూస్తూండిపోయాడు. ఊళ్ళోవాళ్ళకి పట్టరాని పరాభవం జరిగినట్లుగా ఉంది. వాళ్ళెవరూ ఆ గుళ్ళోకి అడుగుపెట్టమని భీష్మించుకుని కూర్చుని ఉన్నారు.

కుడితిలో పడ్డ ఎలుకలా ఉంది ఎమ్మెల్యే పరిస్థితి. గ్రామస్తుల మూర్ఖత్వానికి తిక్క రేగింది. సుదర్శనం మీద కోపంతో ఎగిరిపడ్డాడు. "ఇదిగో!. ఇట్టా నన్ను ఇరకాటం పెట్టే పనులు చేస్తే ఇంకోసారి తొంగిచూడను" గట్టిగా వార్నింగిచ్చాడు. దిగివచ్చారందరూ.

మొహాలు మాడ్చుకునే లోపలికి వెళ్ళారు. తర్వాత తెలిసింది వాళ్ళకి మంత్రి ఇంతగా రియాక్టవ్వడానికి అతనూ హరిజనుడే అని. "అమ్మనీ ఎక్కడ పట్టాలో అక్కడ పట్టిందిరా! ఇది" పార్థసారధి అక్కసుగా సుజాతనుద్దేశించి అన్నాడు.

లోపల మంత్రి, ఆయన భార్య కల్యాణం జరిపించారు. సుజాత, ప్రసాద్ దగ్గరుండి అన్నీ అందిస్తున్నారు. మంత్రికి వేరే షెడ్యూల్ ఉండటం చేత కాస్త త్వరగా శాస్త్రబద్ధంగా కల్యాణాన్ని ముగించాడు పూజారి.

గుళ్ళో ఉన్న వాళ్ళందరికీ తీర్థప్రసాదాలూ, పానకం పంచారు. గుడి ఆవరణలో మంత్రి, ఎమ్మెల్యేతోసహా అంతా సహపంక్తి భోజనాలు చేశారు. కార్యక్రమం ముగిశాక అందిరినీ ఉద్దేశించి మంత్రి రాజ్యాంగంలో ప్రజలకి ఉన్న సమానత్వపు హక్కు గురించి వాళ్ళకి అర్థమయ్యేరీతిలో అయిదు నిమి



## కొండను దర్శించాలని

బెంగాల్ గవర్నర్‌గా ఉన్నకాలంలో రాజాజీ ప్రముఖ బెంగాలీ రచయిత శరత్‌బాబుకు అనారోగ్యంగా ఉందని తెలిసి పరామర్శించడానికి వెళ్లారు. శరత్‌బాబు ఆయనను 'మీ అంతటివారు నన్నుచూడడానికి వచ్చారా.. రాజాజీ?' అంటూ సంభ్రమాశ్చర్యానందాలతో అడిగారు.

'ఏంచేయను? కొండను దర్శించడానికి నేనే రావాల్సివచ్చింది మరి!' అంటూ చమత్కారంగా శరత్‌ను కొండతోను తనను రాజుతోను పోల్చుకోవడం రాజాజీకే చెల్లింది.

కొండ రాజుదగ్గరకు రాకపోతే రాజే కొండదగ్గరకు వెళ్లాలి అనే సామెతమనందరికీ తెలిసిందేకదా? దాన్ని సందర్భోచితంగా ప్రయోగించి రచయితలపై తనకుగల అభిమానాన్ని చాటుకున్నారు రాజాజీ.

షాలు ప్రసంగించాడు.

ఈ కార్యక్రమమంతా ఎలాంటి హడావిడీ గందరగోళం లేకుండా పకడ్బందీగా జరిగింది.

మంత్రి వెళ్ళిపోయాక ఎవరిదోవన వాళ్ళు వెళ్ళిపోయారు. ఆ రాత్రి ఎమ్మెల్యేతో సమావేశమయ్యాడు సుదర్శనం. మొగ్గలో ఉండగానే తుడిచిపెట్టాల్సిన అంశాల గురించి విపులంగా చర్చించాడు. ముల్లుని ముల్లుతోనే ఎలా తియ్యాలన్న దాని గురించి ఆలోచించమన్నాడు.

తగిన సమయం కోసం ఎదురు చూడాలని నిశ్చయించుకున్నాడు సుదర్శనం.

★ ★ ★

ఇంటి ముందున్న ఖాళీ స్థలంలో కూర్చున్నారు రాజు, సుజాత. రాజులో ఇదివరకటిలా నిర్లిప్తత లేదు. దాని స్థానంలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతోంది. తను ఎంతో కొంత సంపాదించి అక్కకి సాయపడుతున్నానన్న తృప్తి అది. అతని చదువు విషయంలోనే అసంతృప్తిగా ఉన్న సుజాత ప్రయివేటుగా అతను చదువుని కొనసాగించడానికి సహాయపడుతోంది. త్వరలోనే వయోజన విద్యకి సంబంధించిన కార్యకలాపాలు కూడా ప్రారంభించడానికి సిద్ధమవుతోందామె.

"ఏంటమ్మా! అక్కా తమ్ముడిద్దరూ కూకోనుండారు? " మరియమ్మ నవ్వుకుంటూ వచ్చి అడిగింది. ఏసుపాదం కూడా కూతురి పక్కన కూర్చున్నాడు.

"ఏం లేదమ్మా! తమ్ముడికి లెక్కలు అర్థం కాలేదంటే చెపుతున్నాను" అంది.

ఏదో మాట్లాడాలనుకొని తల్లిదండ్రులిద్దరూ సంకోచించడం గమనించింది సుజాత.

"ఏంటమ్మా!" మృదువుగా అడిగింది

"మరేం లేదే నీ పెళ్లి గురించి మనేద. వూళ్లో నానారకాలుగా అంటున్నారు" చెప్పలేక చెప్పలేక అంది మరియమ్మ.

"ఏమంటున్నారేంటి? " కుతూహలంగా అడిగింది

ఏసుపాదం చెప్పొద్దన్నట్టు మరియమ్మ వంక చూశాడు. కానీ మొగుడివైపే చూడలేదు మరియమ్మ.

"ఎదవ సచ్చినోళ్లు ఏందో అంటున్నారు. పసాదూ, నువ్వా పెళ్లి గాకండా తిరగతున్నారని యింకా చానా మాటలు" దుఃఖం



జీర గొంతుకు అడ్డం పడటంతో ఆగిపో యింది మరియమ్మ.

అపుడే తడిక తీసుకొని వచ్చాడు ప్రసాద్. "ఎవడాడు సుజీ గురించి అట్టా మాట్టాడే వోడు? " కోపంగా అన్నాడు. ఉలికిపడి అటు చూసింది సుజాత. ప్రసాద్ కోపంగా మొహం పెట్టి మరియమ్మని అడుగుతు న్నాడు.

"ఎవడోలే! మా బతుకు మేం బతక్కుండా యిట్టాంటి గోలల్లో యిరుక్కుంటే ఈ పిల్లకి పెళ్లవ్వొద్దా? " అక్కసుగా ప్రసాద్ వంక చూస్తూ అంది.

మొహం చిన్న బుచ్చుకున్నాడు ప్రసాద్ "నేనేం చేశానత్తా!" గొంతు పెకల్చుకొని అడి గాడు.

"హైయిసులో ఉన్న పిల్ల ఇంటికి పది మార్లు రావడం మాటిమాటికీ ఎనకమాల తిరగడం నాకు బావుండలా" మరియమ్మ అంది.

నమ్మలేనట్లు చూశాడు ప్రసాద్. అతని హృదయం గాయపడింది. సుజాతకీ తనకీ మధ్య అడ్డుగోడలా? జీవితంలో ఊహించ లేని విషయమది.

ఓ సారి సుజాత వంక చూసి వెనుదిరి గాడు.

అప్పటికే తేరుకుంది సుజాత. "అమ్మా! ఏంటామాటలు? ప్రసాద్ గురించేనా నువ్వు అలా అంటున్నావు. ఎవరు ఏం అనుకున్నా నాకు తను ముఖ్యం. నువ్వె పుడు నాపెళ్లికీ, ప్రసాద్‌కీ ముడిపెట్టకు" కొంచెం గట్టిగా చెప్పి "ఉండు ప్రసాద్ వస్తు న్నాను" అంటూ వేగంగా అంగలు వేసు కుంటూ నడుస్తున్న అతని వెనకాల పరిగెత్తి చేరుకుంది.

పొలంగట్టు మీద అతనికి ఎదురుగా నిల బడింది "తప్పుకో!" కోపంగా అన్నాడు.

"ఊహూ!" చిరునవ్వుతో అంది.

తలపక్కకి తిప్పుకొని ఎటో చూస్తూ నిలబడ్డాడు.

"అబ్బ! కోపంలో కూడా ఏమందం?" కవ్వింపుగా అంది. సీరియస్‌గా చూశాడు ప్రసాద్.

"నేనేం అన్నానని నామీద కోపం?" అడిగింది.

"నీమూలంగానే యిదంతా!" కోపం తగ్గని స్వరంతో అన్నాడు. తెల్లబోయినట్లు చూసింది.

"ఒకళ్లు అంటే అన్నారని కాదు. పెళ్లీపెటాకులు లేకుండా ఇద్దరం కలసి ఎక్కడికి పడితే అక్కడికి తిరగడం చూస్తే అనుకోరా మరి?" అన్నాడు.

ఆ మాటలకి ఆశ్చర్యపోయింది సుజాత. అంతేకాదు ఆ మాటలకి అర్థం స్ఫురించగానే షాకయింది. ప్రసాద్ కూడా మామూలు మగాడేనా? .

"నేను నీతో మాట్లాడటం తప్పుగా అన్పిస్తోందా ప్రసాద్" మెల్లగా అడిగింది.

ఆ స్వరానికి విచలితుడై పోయాడు.

"అది కాదు సుజీ!" ఏదో చెప్పబోయాడు. చెయ్యెత్తి వారించి "తప్పుగా అన్పించిందా?" అడిగింది.

అతను అసహాయంగా తలదించుకున్నాడు. అసలు తమ పెళ్లికి సుజాత ఎందుకు అంగీకరించడం లేదు. జీవితాల్ని మోడులా గడుపుతూ సమాజసేవ చెయ్యాలా? లేకపోతే ఆమె మనసులో ఇంకెవరైనా ఉన్నారా? అనుమానం పెనుభూతంలా భయపెట్టసాగింది.

సుజాత కొనసాగించింది. "మనిద్దరం మంచి పనుల కోసం కలిసి తిరగడమే నీకు తప్పుగా తోస్తే నేను రవికిరణ్‌తో కలిసి అయిదున్నర సంవత్సరాలు అతనింట్లో ఉన్నాను. మా ఇద్దరికీ తప్పుగా అన్పించలేదు. ఎంచేతనంటే ముందుగా మన గురించి ఇతరులు ఏమనుకుంటున్నారన్న దాని కన్నా మన గురించి మనం ఏమనుకుంటున్నామన్నది ముఖ్యం. మన మీద మనకి విశ్వాసం ముఖ్యం. ముందుగా అది పెంచుకో ప్రసాద్!" శాంతంగా చెప్పి వెనుదిరిగి ఇంటివైపు నడిచింది.

అతనికి చాలా బాధనిపించింది. రవికిరణ్‌తో కలిసి ఆమె అన్నాళ్లు కలిసున్నందుకు కాదు. ఆమెలా విశ్లేషణాత్మకంగా తను ఆలోచించలేకపోయినందుకు. ఆ తర్వాత అన్పించింది. రవికిరణ్, సుజాత ప్రేమించుకున్నారా? అని. ఆ ఊహకే కళ్ల ముందు చీకట్లు కమ్మాయి. వెళ్తున్న సుజాత వంక అయోమయంగా చూస్తూండిపోయాడు.

★ ★ ★

సుజాతని వంటరిగా ఊరు పంపించినా రవికిరణ్ ఆమెకి సంబంధించిన ప్రతి అంశాన్నీ అతను పట్టించుకుంటూనే ఉన్నాడు.

కానీ గతంలో ఆ ఊళ్లో ఏదో జరిగింది. దానిని సుజాతతో సహా తనకి ఎవరూ చెప్పలేదు. తను తెలుసుకోవడం కూడా కష్టంగా ఉంది. ఎవరూ పెదవి విప్పడం లేదు.

ప్రసాద్ తనకి చెపుతానన్నాడు. ఆ మూలాలు తెలిస్తేనన్నా ఈ కక్షలకీ, కార్పణ్యాలకీ కారణం తెలుస్తుంది. అది తెలిస్తేనే సమస్య పరిష్కారమవుతుంది. ఓసారి ప్రసాద్‌ని కలవాలి అనుకున్నాడు రవికిరణ్.

కానీ ఆ ఊరు వెళ్లడానికి మనస్కరించడంలేదు. తనక్కడికి వెళితే అదో సంచలనమౌతుంది. దానిని సుజాత తట్టుకోగలదో లేదోనని అతను సంకోచిస్తున్నాడు. కానీ ఈ రోజు ఉదయం నమ్మకంగా తనకి అందిన వార్తని తలుచుకుంటే గుండె బేజారెత్తుతోంది.

తను ఊరు వెళ్లాలి. వెళ్లి తీరాలి. తప్పదు అనుకున్నదే తడవు బయల్దేరాడు. రవికిరణ్.

★ ★ ★

రెండు రోజుల నుంచీ ప్రసాద్‌తో మాట్లా

డటం లేదు సుజాత. కోపమని కాదు. ఏదో బాధ. తన జీవితం చాలా భాగం అతని ముందు పరిచిన పుస్తకం. కానీ తనేంటో అతను అర్థం చేసుకోవడం లేదు. తన సందిగ్ధావస్థని హుందాగా స్వీకరించి కన్సోల్ చెయ్యడం లేదు. అదే బాధ.

ఎవరేమనుకున్నా వదలకుండా, లెక్క చెయ్యకుండా తిరుగుతునే ఉన్నాడు. కానీ ముభావంగా వుంది సుజాత.

ప్రసాద్‌కి ఉన్న ఎకరం పొలంలో ఓ మూల చిన్నషెడ్‌లా వేసి బొమ్మల తయారీ కేంద్రాన్ని పెట్టారు. ఆరోజు అక్కడికి వెళ్లింది సుజాత.

బొమ్మల తయారీ అన్నది సృజనాత్మకతకి సంబంధించింది కాబట్టి ప్రశాంత మయిన వాతావరణంలో ఉండాలని అక్కడ పెట్టారు. సుజాత కూడా కొన్ని బొమ్మల్ని డిజైన్ చేసింది. అవి ఎగ్జిబిషన్స్‌లో బాగా అమ్ముడుపోయాయి. ఎప్పటికప్పుడు కొత్త రకం బొమ్మల్ని ఊహిస్తుందామె. ఆపని మీదే అక్కడికి వచ్చింది.

అప్పటికే అక్కడ ప్రసాద్ వున్నాడు. సుజాతని చూసుకోలేదతను. ఆమె తయారు చేసిన బుట్టబొమ్మతో మాట్లాడు తున్నాడు.

అకస్మాత్తుగా ఆసంఘటనని చూడటంతో ఆమె హృదయం ఆర్ద్రమయింది. వెనుదిరగ బోయిందల్లా లోనికి వచ్చింది.

“ఏం చేస్తున్నావు? ” మెత్తగా అడిగింది.

“నీతో మాట్లాడుతున్నాను” నిజాయితీగా సమాధానమిచ్చాడు. పకపకా నవ్వింది సుజాత.

“కూర్చో సుజీ” ఆమె ఎక్కడ వెళ్లి పోతుం దోనన్న భయంతో కుర్చీ చూపించాడు.

వచ్చి కూర్చుంది. ఆమెని చూడగానే రవి కిరణ్ గుర్తొచ్చాడు. మరింత ఉన్నతంగా ఆలోచించలేనందుకు తననితాను తిట్టుకు న్నాడు. ఏది ఎలా జరిగినా తను సిద్ధంగా ఉండాలి. సుజీతో బంధాన్ని తను వదులుకో లేదు. ఆమె జీవిత భాగస్వామిగా కాకపోతే తను తట్టుకోవడం కష్టమే!. కానీ అవసరమ యితే అందుకు సిద్ధపడాలి. జీవితాంతం ఆమె చేసే మంచి పనులకి తోడూ నీడగా నిలవాలి. నిశ్చయంగా అనుకున్నాడు. ఈ నిర్ణయంలో అసంతృప్తి ఉన్నా ఆమె అంటే నిజమైన అభిమానం వుంటే తన రాజీపడగ లడు. తన మనుసుని సమాధాన పర్చు కుంటూ కూర్చున్నాడు ప్రసాద్. అలా తనని చూస్తూ కూర్చున్న ప్రసాద్‌ని చూడగానే ఆమెలో అభిమానం పొంగులు వారింది. తన సందిగ్ధతని అతనితో పంచుకోవాలని అనుకుంది. ఆవిషయం గురించి ఆలోచిస్తుం డగానే కేవలం కళ్లు మాత్రమే కనిపించేలా మొహాలకి కండువాలు అడ్డుపెట్టుకున్న పది మంది లోపలికి వచ్చారు. ఏం జరిగిందో ఊహించేలోపు వెనకపాటుగా వచ్చి ప్రసాద్ మీద కలబడి అతని కాళ్లూ చేతులూ కట్టేసి నోట్లో గుడ్డలు కుక్కేశారు. అతని మొహం కనపడకుండా గోనెసంచితో కప్పేశారు.

చుట్టూ మానవసంచారం లేదు. ఓ అయి దుగురు ప్రసాద్‌తో వెళ్లిపోగా ఇంకో అయి దుగురు సుజాత దగ్గరకి వచ్చి “పద” అన్నారు.

ఇక ఇపుడు వీరోచితంగా ఎదిరించేదేమి లేదు. ప్రసాద్ లాంటి వాడినే కట్టిపడేశారు. ఆమె మౌనంగా వారి వెంట నడిచింది.

గుండెల్లో మృత్యు గంటలు మోగుతు న్నాయి. సుదర్శనం కళ్లముందు కనబడుతు న్నాడు.

జీపు సరాసరి టౌన్లో ఉన్న సుదర్శనం గెస్ట్‌హౌస్ ముందు ఆగింది. బలవంతంగా ఆమెని లోపలి గదిలోకి తోసి తలుపేశారు.

★ ★ ★

ఊళ్లో బస్ దిగాడు రవికిరణ్. అతని మనసంతా ఉద్విగ్నంగా ఉంది. బస్ దిగ గానే చుట్టూ కలయజూశాడు. దృష్టిపథంలో ఏవో జ్ఞాపకాలు కళ్ల ముందు కదలాడుతు

న్నాయి.

స్వప్నంలో వేధించే గుర్తులేవో తోవ చూపుతుండగా నడిచాడు. ఊళ్లో అంతా ఆరాగా అతని వంక చూశారు. అతనెవరి వంకా చూడటం లేదు. హృదయం చెప్ప రాని ఆందోళనకి లోనయి వుంది. వడివ డిగా అడుగులేస్తూ నడిచి ఓ ఇంటి ముందు ఆగాడు. ఎత్తయిన ఆ భవంతి సగర్వంగా తలెత్తి కన్పిస్తోంది. విశాలమైన గేట్లు రారమ్మని ఆహ్వానిస్తున్నాయి. గేటు బయట వేపచెట్లు ఆశ్చర్యంగా చూశాయి. పాలేరు తోలుకొచ్చిన గేదెలు, ఆవులు పశు వులశాలలోకి వెళ్తూ రేపిన దుమ్ము కంట్లో పడింది.

కళ్ళు నులుముకుని లోపలికి అడుగే శాడు. పాలేరు బుడ్డోడు విచిత్రంగా చూశాడు.

వరండాలోకి వెళ్లే మెట్ల దగ్గర నిల్చు న్నాడు రవికిరణ్. లోపలి నుంచి యాభై అయిదు సంవత్సరాల వయస్సున్న ఆవిడ బైటకి వచ్చింది.

ఆమె వంక తదేకంగా చూశాడు. భావో ద్వేగంతో అతని కళ్ళు తడయ్యాయి.

రవికిరణ్‌ని చూసిన ఆమె విభ్రాంతిలో మునిగిపోయింది. ఇరవై ఏళ్ల కిందట చని పోయిన తన మామగారు ఇలా యువకు డిగా ఎలా ప్రత్యక్షమయ్యారు? .

ఆమెలో ఏదో సందేహం!

"బాబూ! నువ్వు? " ఆరాటంగా అడిగింది. గొంతుక్కి ఏదో అడ్డం పడినట్లయింది రవి కిరణ్‌కి. తల వంచుకుని నిలబడ్డాడతను. అపుడర్థమయిందామెకి ఇన్నాళ్ళుగా తపిం చిన తన మాతృహృదయం ఈ రోజు సేద దీరబోతోందని!

"నువ్వు నాచిన్నాడివిరా? నా రవిబాబువి గాదూ? " అరుస్తూ పరుగెత్తుకుని వచ్చి అతని వళ్ళంతా తడిమింది. ఆమె కేకలకి అంతా పరుగెత్తుకుని వచ్చారు.

"మన రవిబాబు చూడండి. అంతా తాత పోలిక గుర్తు పట్టలేదూ" హృదయం ఉద్వే గంతో నిండిపోగా అరిచింది.

టౌన్‌కి వెళ్లడానికి బయల్దేరి బయటకి వచ్చిన సుదర్శనం రవికిరణ్‌ని ఆశ్చర్యంగా చూసి వరండాలో నిలువెత్తు ఫోటోలో ఉన్న తాతగారి వంక చూశాడు. అచ్చుగుద్ది నట్లు అవే పోలికలు.

"నీ తమ్ముడు రా! మా అక్కయ్యకి దత్తత ఇస్తే అక్కడ నుంచి వెళ్ళిపోయాడు గదా! వాడే! నీ తమ్ముడు బతికే ఉన్నాడు రా సుదర్శనం. ఇంత కాలం కడుపు కోతతో కుమిలిపోయాను" ఆమె ఆనందంగా చెప్పు కుపోతోంది.

సుదర్శనానికీ సంతోషంగా అన్పించింది. దగ్గరకి వచ్చి రవికిరణ్‌ని కౌగిలించుకు న్నాడు. రక్తసంబంధపు స్పర్శ ఏమో మనసు స్పందించింది.

అందరూ లోపలికి నడిచారు. ఇంత కాలం ఎక్కడ వున్నావనీ ఏం చేశావనీ అందరూ ప్రశ్నలు గుప్పిస్తున్నారు. అన్నిం టికీ చిరునవ్వే సమాధానంగా యిచ్చాడు. తనిప్పుడేం చేస్తున్నదీ చెప్పాడు.

అంత ప్రఖ్యాత జర్నలిస్ట్ తన తమ్ముడ యినందుకు గర్వించాడు. ఇక ఇక్కడే ఉండిపొమ్మనీ రాజకీయాల్లోకి దిగమనీ చెప్పాడు సుదర్శనం. రాత్రి ఏడు వరకూ తమ్ముడితోనే కాలక్షేపం చేశాడు సుదర్శనం.

ఆ తర్వాత ఏదో ఫోన్ వచ్చింది. తొమ్మి దింటికి బయల్దేరతానని చెపుతున్నాడు సుద ర్శనం. దిగులుగా అన్పించింది రవికిరణ్‌కి.

ఎనిమిదింటికల్లా అందరూ కలిసి భోజ నాలు చేశారు. తల్లి అతన్ని వదలడం లేదు. అన్నేళ్ళ తర్వాత తనవాళ్ళని కలిసిన ఆనందపు ఉద్వేగమూ, తన ప్రియమయిన వ్యక్తికి కలగబోతున్న ఆపదా అతన్ని ఉక్కి

**కర్తవ్యమే నిజమైన హక్కులకు ఆధారం. మనం మన విధులను సక్రమంగా నిర్వహించ గలిగినప్పుడే హక్కులు మనకు చేరతాయి. – అర్నాల్డ్ హెచ్. గ్లాస్గో**

రిబిక్కిరి చేస్తున్నాయి. ఏం తింటున్నాడో, ఏం మాట్లాడుతున్నాడో అర్థం కావడం లేదు. చాలా డీలా పడిపోతున్నాడతను. తన ప్రాణాలకి కూడా తెగించి న్యూస్ రిపోర్ట్స్ తయారుచేసే తను సుజాత విష యంలోనే యిలా బేలగా మారిపోతు న్నాడు. లక్ష్యానికి, సెంటిమెంట్ల మధ్య నలి గిపోవడం చాలా బాధాకరం.

రాత్రి తొమ్మిదింటికి సుదర్శనం తన కారులో బయల్దేరుతుంటే రవికిరణ్ తనూ వస్తానని అన్నాడు. "ఇంత రాత్రిపూట ఎందుకు రా? నాకేదో అర్జంట్ పని వుండి వెళ్తున్నాను" ఇబ్బందిగా అన్నాడు.

"నాకూ టౌన్లో పని వుంది. ఎలాగూ కార్లోనే కదా! నన్ను సెంటర్లో దింపెయ్యి" చెప్పాడు.

"సరే పద" అయిష్టంగా నడిచాడు.

"త్వరగా వచ్చేయండి" వెనక నుంచి తల్లి చెప్పింది. కార్లో కూడా తమ్ముడి భవిష్యత్తు గురించే అడిగాడు సుదర్శనం. అతన్ని చూస్తుంటే ఎలా ఫీలవ్వాలో మనసుకి అర్థం కాకుండా వుంది.

సెంటర్లో కారు దిగాడు. సుదర్శనం ఏ రూట్లో వెళుతున్నాడో చూసుకున్నాడు. ముందే ఫ్రెండ్‌కి చెప్పి ఎరేంజ్ చేసుకున్న కారులో సుదర్శనాన్ని ఛేజ్ చెయ్యడం ప్రారంభించాడు. కారు అతని గెస్ట్ హౌస్ ముందు ఆగింది.

తనూ కొంచెం దూరంలో కారాపాడు. సుదర్శనం లోపలికి వెళ్లిన పావుగంటకి తను ఏం చేయాలో ప్లాన్ చేసుకుని తనూ కారులో గెస్ట్‌హౌస్ దగ్గరకి వచ్చాడు. వాచ్ మాన్ కారాపి అనుమానంగా అడిగాడు "ఎమ్మెల్యేగారు పంపించారు." చీకట్లోకి బాణం వదిలాడు. అతను గేటు తెరిచాడు.

వరండాలో ఉన్న వాళ్ళకీ అదే చెప్పాడు వాళ్ళకివి అలవాటే! అందులోనూ వాచ్ మాన్ కూడా వదిలేశాడు కాబట్టి వీళ్ళూ పెద్దగా పట్టించుకోలేదు.

గెస్ట్‌హౌస్ మరీ పెద్దదేం కాదుకానీ చుట్టు పక్కల ఇళ్లేం లేవు. సుదర్శనం, అతని ఫ్రెండ్ ఎమ్మెల్యే ఇలాంటి కార్యక్రమాల కోసం దీనిని వాడుకుంటూ ఉంటారు.

సుదర్శనం ఒళ్లంతా కాంక్షతో దహించుకు పోతోంది. కోపం, పగ ద్వేషమే కాదు సుజా తంటే వ్యామోహం అణువణువునా నిండి ఉంది. అందుకే ఆత్రుత పడుతున్నాడు. పంచాయతీ ఆఫీసులో ఆమెని చూసిన దగ్గ రనుంచీ మరింత కోరిక పెరిగిపోతోంది. గెస్ట్‌హౌస్‌లోకి రాగానే ఆమె ఉన్న గదిలోకి ఆత్రుతగా వెళ్లాడు. సోఫాలో కూర్చుని ఏదో ఆలోచిస్తోందామె.

అదుగో ఆ పొగరుబోతుదనమే తననిం తగా ఆకర్షిస్తోంది. అందరు ఆడపిల్లల్లా ఏడవడమో, కేకలు పెట్టడమో చేయడం లేదు. చాలా ధీమాగా కూర్చుంది.

అడుగుల చప్పుడికి తలెత్తి చూసింది సుజాత. ఎదురుగా సుదర్శనం. జాతి వన్నె క్రూరమృగం. మనసులో కలుగుతున్న భయాన్ని తొక్కిపట్టింది.

సుదర్శనం ఆమె ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు. "మొత్తానికి బోనులో చిక్కావన్నమాట" వెటకారంగా అన్నాడు. గుండె రగిలిపోతోంది సుజాతకి. "దమ్మున్న మగాడు చెయ్యాల్సిన పని కాదిది" అసహ్యంగా చూస్తూ అంది.

"దమ్మేంటో చూపించమంటావా? " లేచి నిలబడుతూ అన్నాడు.

'ఛ' ఛీత్కారం చేసింది సుజాత.

రవికిరణ్ గదులు వెతుక్కుంటూ వస్తు న్నాడు. సుజాత ఇక్కడ ఉండి ఉండచ్చ న్నది సందేహం మాత్రమే. తనామెని విడి పించుకోటానికి ఇంకెవరినన్నా సాయం తెచ్చుకోడానికయినా, పోలీసు కంప్లయింట్ ఇవ్వడానికయినా తన దగ్గర పూర్తి ఆధా రాలు లేవు. అందుకే వంటరిగా రంగంలోకి దిగాల్సి వచ్చింది.

కార్నర్ గది దగ్గరికి వచ్చాడు రవికిరణ్.

సుజాత ఎక్కడికీ పారిపోదన్న ధీమాతో గది తలుపులు బార్లా తెరిచే ఉంచాడు సుదర్శనం. మాటలు వినబడి గది గుమ్మంలోకి వచ్చాడు రవికిరణ్.

ముగ్గురూ స్థాణువులయ్యారు. రవికిరణ్ ముందు ఈ స్థితిలో కనబడినందుకు కుంచించుకుపోయింది సుజాత. సుదర్శనం తడబడ్డాడు. అయినా ముందు తేరుకుంది అతనే.

"రవీ! నువ్విక్కడికి ఎందుకొచ్చావూ? . సరే! కారు తీసుకుని బయల్దేరు. నేను రేపు వస్తాను" కారు తాళాలిస్తూ అన్నాడు తొణక్కుండా.

ఆశ్చర్యంగా చూసింది సుజాత. వీళ్లిద్దరికీ ఎలా పరిచయం. ఎంత చనువుగా మాట్లాడుకుంటున్నారు!! షాక్ తిన్నట్లుగా ఉంది సుజాతకి.

'నువ్వా రా! అన్నయ్యా!' కదలకుండా అన్నాడు రవి. నెత్తిమీద పిడుగులు పడినట్లుగా ఉంది సుజాతకి. రవికిరణ్ అన్నయ్య సుదర్శనమా? మరింతకాలం తనకెందుకు చెప్పలేదు? నమ్మలేనట్లు అతని మొహం చూస్తూ నిల్చుంది.

"నువ్వు వెళ్లరా! ఇక్కడ చాలా ముఖ్యమయిన పని ఉంది. మన తోవకి అడ్డొచ్చేవాళ్లని ఎలా వంచాలో అలా వంచుతాను" సుజాత వంక క్రూరంగా చూస్తూ అన్నాడు. రవికిరణ్‌కి ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఎందుకో కించిత్ దుఃఖం లాంటి భావం కలిగింది. సుజాతని క్షేమంగా తాను తీసుకువెళ్లాలి. అదే తన లక్ష్యం.

"ఈ అమ్మాయిని విడిచిపెట్టు" ప్రాధేయపడుతూ అడిగాడు రవికిరణ్.

"ఏం? " అనుమానాస్పదంగా చూస్తూ అన్నాడు సుదర్శనం. ఏం చెప్పాలో తోచట్లేదు. బాధగా ఉంది. టెన్షన్‌గా ఉంది. ఉద్వేగంగా ఉంది.

"సుజాత నాకు ఆరేళ్లనుంచీ తెలుసు. మేం ప్రేమించుకున్నాం. ఈమె నాకు కాబోయే భార్య" గబగబా చెప్పేశాడు. అప్రతిభురాలై చూసింది సుజాత.

సుదర్శనం కూడా ఓ నిమిషం తెల్లబోయి చూసి తర్వాత పకపకా నవ్వాడు.

"దీనిని పెళ్లి చేసుకుంటావా? దీని చరిత్ర ఏంటో తెలుసా నీకు? " హేళనగా అన్నాడు.

గాయపడ్డ సివంగిలా చూసింది సుజాత. ఆమె తను సంపాదించిన జ్ఞానాన్నంతా మర్చిపోయింది. జరుగుతున్న వాటికి హృదయంలో మానుతున్న గాయాలు మళ్లీ రేగాయి.

"రేయ్!. నీ చరిత్రకన్నా నాది తీసిపోయిందిరా! పిరికివాడిలా చాటునుంచి దెబ్బ తీయడం కాదు. మా ప్రసాద్‌నీ, నన్నూ ఎదురుగా వచ్చి ఎదిరించు" అతని షర్ట్‌ని గుప్పిళ్లలో బిగించి ఊపేస్తూ అరిచింది.

రవికిరణ్ బలవంతాన విడిదీశాడు. రొప్పుతూ నిలబడింది.

"చూశావుగా దీని పొగరు. దీన్ని పెళ్ళి చేసుకుంటావా? " షర్ట్ సరిచేసుకుంటూ ఆవేశంగా అన్నాడు.

"అన్నయ్యా! ప్లీజ్. ఇన్నేళ్ల తర్వాత కలిసిన నా కోసం నువ్వు ఆలోచించు" బ్రతిమిలాడుతూ అన్నాడు రవికిరణ్.

"ఇంత పౌరుషం లేని వాడివనుకోలేదు రవీ!' అతని వంక అసహ్యంగా చూస్తూ అంది సుజాత.

సుదర్శనంలో ఏదో ఆలోచన మొలకెత్తింది. విశాలంగా నవ్వుతూ "సరే రా! నువ్వింతగా అడుగుతున్నావుగా. నీకిష్టం ఉన్నంతకాలం మోజు తీర్చుకో! నా రక్తమేగా నీలో ప్రవహించేది. దీన్ని అనుభవించేది నా యింటివాడు కావడం నాకు కావాలి. తీసుకుపో. పోయి సుదర్శనచౌదరి గారి తమ్ముడి దయతో ఇంతకాలం బతికిందీ అమ్మాయి అని చెప్పు. గతి లేక నా ఇంటి గడప తొక్కడానికి సిద్ధపడిందని చెప్పు. పెళ్ళి చేసుకుని కాళ్ళకింద కుక్కలా ఉంటానందని చెప్పు తీసుకోపో! నా దయాదాక్షిణ్యాలతో ప్రాణాలు నిలబెట్టుకుందని

చెప్పుకో. పో!" సుదర్శనం మాట్లాడే ఒక్కో మాటా భగభగ మండుతున్న జ్వాలలో మరింత ఆజ్యం పోసినట్లుగా వుంది. ఒళ్ళంతా కత్తులతో చీల్చేస్తున్నట్లుగా ఉంది. ఈ సిగ్గులేని శరీరాన్ని ఆ మంటలో మండించేయాలని వుంది.

రవికిరణ్ ఏమీ మాట్లాడలేదు. సుజాత వైపు తిరిగి "పద" అన్నాడు. కదల్లేదామె. ప్రశ్నార్థకంగా చూశాడు. "ప్రసాద్." బొంగురుపోయిన గొంతుతో అంది.

సుదర్శనం వైపు చూశాడు రవి.

"ఆ! ఆ! ఆడితోనేగా లేచిపోయావు. మళ్ళీ మా తమ్ముడు కనబడేసరికి ఆడ్ని వదిలేశావు. ఈపాటికి ఏ అడ్డరోడ్డు దగ్గరో నీకోసం కాపలా కాస్తుంటాడులే!" అన్నాడు.

అతడి పథకం అర్థమై ఒళ్ళు జలదరించింది ఇద్దరికీ. ఇలా ప్రజలందరినీ నమ్మించేవాడన్నమాట.

ఆమె వెనుదిరిగి వస్తున్నదల్లా ఆగి "ఒకటి మాత్రం నిజం. నువ్వు నన్ను ఏం చేసినా క్షేమంగా బయటకి రాగలననుకోవడం అబద్ధం. ప్రసాద్ నిన్ను వదలడు" ఆవేశంగా అంది.

ఫకాలున నవ్వాడు సుదర్శనం. "నా తమ్ముడు అడ్డుపడకపోయి ఉంటే ఈ పాటికి వాడు జీవం లేకుండా, నువ్వు జీవచ్ఛవంలా ఉండేవారు" హేళనగా అన్నాడు.

నరనరానా ఆవేశం ఇంజెక్ట్ చేసినట్లయింది. అతని మీదకి దూకి ఎడాపెడా చిందేస్తూ "మనిషి ప్రాణాలంటే అంత సులువురా నీకు?. ముందు నీ ప్రాణాలు రక్షించుకో" అంటూ కొడుతుంటే పాత సుజాత గుర్తొచ్చింది రవికిరణ్‌కి.

బలవంతంగా విడదీశాడు రవికిరణ్. "పద" అంటూ దాదాపు ఆమెని లాక్కువెళుతున్నట్లుగానే తీసుకుని వెళ్ళి కార్లో కూర్చోబెట్టాడు.

ఆమెని కంట్రోల్ చెయ్యడం కష్టంగా వుంది. రవికిరణ్ చెయ్యి పట్టుకుంటే కంపరంగా వుంది. అతని చేతిని విసిరికొడుతోంది. కారు వెళ్తుంటే డోర్ తీసుకుని దూకేయబోయింది. కంగారుపడ్డాడు రవికిరణ్. కారాపి ఆమె చెయ్యి పట్టుకుని ఆపుతూ "ఏంటి సుజాతా! ఇలా? " మందలింపుగా అన్నాడు.

చెయ్యి విదిలించేసుకుంది ఆమె. "నన్నంటుకోవద్దు" గట్టిగా అరిచేసింది. అతని మొహం కళ తప్పింది. భగభగలాడుతూ అగ్నిజ్వాలలా ఎగిసిపడుతున్న ఆమెని బలవంతంగా కౌగిట చేర్చాడు.

ఒకప్పుడు మంచి గంధంలా చల్లదనాన్నిచ్చి తన ఆవేశాన్ని ఆర్పివేసిన ఆ కౌగిలి ఇపుడు సర్పపరిష్వంగంలా వుంది. "వద్దు!" గుంజులాడి దూరంగా జరిగిపోయింది. బాధగా మారిపోయింది అతని మొహం.

"సుజాతా! నేనూ అంటూ అతను ఏదో చెప్పబోతోంటే చెవులు మూసేసుకుని "నేనేం వినను. నీకు వీలుంటే నన్ను మా యింటి దగ్గర దింపు. లేకపోతే నా మానాన నన్ను వదిలేయి" చెప్పింది.

అతను నిట్టూర్చి కారు స్టార్ట్ చేశాడు. కార్లో పిడికిళ్ళు బిగించి నిటారుగా కూర్చుని ఉంది.

కారు అడ్డరోడ్డు దగ్గరకి రాగానే ప్రసాద్ గట్టు మీద కూర్చుని కనిపించాడు. వెన్నెల వెలుగులో అతన్ని గుర్తుపట్టి కారాపాడు రవికిరణ్.

ఆగీ ఆగకుండానే డోర్ తీసుకుని దిగి పరుగెత్తుతూ వెళ్ళి ప్రసాద్‌ను చుట్టేసింది సుజాత.

సుజాత క్షేమం కోసం తల్లడిల్లుతూ చెట్టూ పుట్టా వెతుక్కుంటూ వస్తున్న ప్రసాద్‌కి ఆమెని ప్రాణాలతో చూడగానే పట్టరాని సంతోషం కలిగింది.

బావురుమని ఏడుస్తున్న ఆమెని చూడగానే గాభరా పడ్డాడు. "సుజీ! ఏమైంది! ఎందుకేడుస్తున్నావు? " కంగారుగా అడిగాడు.




## నమ్మనివాడు ఎలా భయపడతాడు?

ఓసారి ఏదో సభలో జవహర్‌లాల్ నెహ్రూ దర్పంగా మాట్లాడుతూ 'నేను దేవుడికి కూడా భయపడను' అన్నారు.

అదివిని రాజాజీ 'అదేంటి? ఆయన దేవుడినే నమ్మడుకదా? ఇంకా ఎలా భయపడతాడని అనుకుంటాం?' అంటూ ఆశ్చర్యపోయారు. అదీ ఆయన వ్యంగ్యవైభవం.

ఆమె కోపాన్ని తప్ప బేలతనాన్ని ఎపుడూ చూడలేదతను. "సుజీ" వాళ్ళేమైనా చేశారా? చెప్పు!

"ఇక ఇపుడు నా ప్రాణాలు పోయినా ఫర్లేదు. వాళ్ళ అంతు చూస్తాను. దొంగదెబ్బ తీశారు వాళ్ళు. ఇక జాగ్రత్తగా ఉందాం. నా మాట విను" ఓదార్చుతున్నాడు.

కారునుంచి దిగాడు రవికిరణ్. అతన్ని చూశాక అర్థమయింది ప్రసాద్‌కి అతనే రక్షించి ఉండొచ్చని.

"ప్రసాద్" అంటూ దగ్గరకొచ్చి ఏదో చెప్పబోయాడు రవికిరణ్. షేక్‌హాండ్ కోసం చెయ్యి చాపబోతున్నాడు ప్రసాద్. ఎవరూ ఊహించని విధంగా అతని చెయ్యి వెనక్కి లాగేసింది సుజాత.

"వద్దు అతన్ని మన కళ్ళబడకుండా వెళ్ళిపొమ్మని చెప్పు" గట్టిగా అరుస్తూ అంది.

ఎక్కడి వాడక్కడ నిలబడ్డాడు రవికిరణ్. నిశ్చేష్టుడయ్యాడు ప్రసాద్. "సుజీ! ఏంటా మాటలు?" రెండు చేతులూ తన నడుముని చుట్టివేసి హృదయం మీద తలాన్చి ఆవేశంలో వణికిపోతున్న ఆమెని విడిపించుకుని ఆమె మొహం చూడటానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

"నాకు చచ్చిపోవాలని ఉంది ప్రసాద్! నిజంగా జీవితంలో తొలిసారిగా ఓడిపోయాననిపిస్తోంది. ఈ శరీరం మీద జుగుప్స కలుగుతోంది. ఈ ఒళ్ళు సుదర్శనం గాడి తమ్ముడి దయతో పోషణ చేసుకుంది. ఈ జ్ఞానం సుదర్శనంగాడి తమ్ముడి ఔదార్యంతో సంపాదించుకుంది. ఈ మానం, ప్రాణం అన్నీ వాడి తమ్ముడి చలవే! అందుకే ఈ వంటిని కిరసనాయిల్‌తో తగలబెట్టుకోవాలని ఉంది. నన్ను చూస్తే నీకు అసహ్యం కలగడం లేదూ? నాకు తెలిస్తే చావనన్నా చచ్చేదాన్నిగానీ ఈ అయిదేళ్లూ శత్రువు బంధువు సహాయంతో బతికేదాన్నా?"

సుజాత మాట్లాడే ఒక్కో మాటా రవికిరణ్ హృదయాన్ని ముక్కలు చేసేసింది. రెండు చేతులూ కట్టుకుని విషాదంగా సుజాత వంక చూస్తూ నిలబడ్డాడు. ప్రసాద్ అపనమ్మకంగా రవికిరణ్ వంక చూశాడు.

"నా పదేళ్ళ వయసులో ఇంటిని వదిలి వెళ్ళి మళ్ళీ ఈరోజే నా వాళ్ళని కలిశాను. అదీ సుజాత ఆపదలో ఉందన్న విషయం తెలిసి. నేను సుదర్శనానికి తమ్ముడు కావడమే నా అపరాధం" శాంతంగా అన్నాడు రవికిరణ్.

"వద్దు ప్రసాద్ అతని మాటలు వినకు. ఏవో నీతి వాక్యాలు చెప్పి మనలో వున్న జ్వాలల్ని ఆర్పివేస్తాడు" కోపంగా అంది సుజాత.

ప్రసాద్‌కి చాలావరకూ అర్థమయింది. "సుజీ! అయన తప్పేం వుందని అలా మాట్లాడుతున్నావు?" ఖండలింపుగా అన్నాడు.

"నీకు తెలీదు ప్రసాద్. నేనతని కాబోయే



భార్యనని చెప్పి నన్ను విడిపిస్తుంటే ఆ సుద ర్శనం ఏమన్నాడో తెలుసా? వాడి రక్తం ప్రవహిస్తున్న వాడి తమ్ముడితో నేను కాపురం చేస్తానంట. కాళ్ళ కింద కుక్కలా పడి వుంటానంట. వాడి తమ్ముడి దయాదా క్షిణ్యాలతో బతికానంట. మాటలు కాదు ప్రసాద్ ఈటెలు. గుండె మండిపోతోంది. రేపటినుంచీ వీధినపోయే ప్రతి ఒక్కరూ ఇవే మాటలంటారు. నేను తట్టుకోలేను. నా వల్లకాదనిపిస్తోంది" సుజాత ఏడుస్తుంటే ప్రసాద్‌కి రక్తం మరిగిపోతోంది.

"మనకి అవమానాలు కొత్తకాదుగా సుజీ! ఇంతకన్నా ఘోరమైన వాటినే ధైర్యంగా ఎదుర్కొన్నావు. నీలో ఆ శక్తి వుంది. నువ్వు ధైర్యంగా ఉండాలి. నీ దృష్టిలో యిది చాలా చిన్న విషయం కావాలి. నువ్వేం తప్పు చేయలేదు. యిక ఎవరో అంటారన్న దానిని మనం ఎపుడూ పట్టించుకోలేదు. ఇపుడెందుకు కొత్తగా ఆలోచిస్తున్నావు? అయినా రవికిరణ్‌గారు ఏం తప్పు చేశారు? " ప్రసాద్ అంటుంటే రవికిరణ్ తన గురించి మాట్లాడొద్దని సైగ చేశాడు.

ఆమె అలసిపోయినట్లుగా అతని చేతు లలో తూలిపోతుంటే గట్టుమీద కూర్చోబె ట్టాడు. రవికిరణ్ కార్లోనుంచి వాటర్ బాటిల్ తెచ్చాడు. ప్రసాద్ బలవంతంగా తాగించాడు.

"ఇంటి దగ్గర దింపేస్తాను పదండి" కారు దగ్గరకి నడిచాడు. "మనం నడిచి వెళ్దాం" మొండిగా అంది సుజాత. "ప్రసాద్ రండి" పిలిచాడు రవికిరణ్. ప్రసాద్ సుజాతని ఏదో బతిమిలాడుతూ తీసుకొని రావడం ఫ్రంట్ విండో నుంచి చూశాడు.

సుజాత ఎలా ప్రవర్తించినా కోపం రావడం లేదు రవికిరణ్‌కి. మనసు మెలి

తిప్పినట్లు బాధగా వుంటోంది. అదీకాక ఆమె వున్న స్థితిని అర్థం చేసుకోగలిగాడు. వాళ్ళిద్దరూ వచ్చి బాక్ సీట్లో కూర్చున్నారు. ఆమె భుజాలు చుట్టూ చేతులు వేసి పొదివి పట్టుకున్నాడు ప్రసాద్.

ఆ గతుకుల రోడ్‌లో సాధ్యమైనంత స్మూత్‌గా డ్రైవ్ చేస్తున్నాడు రవికిరణ్. ఇరవై నిమిషాల్లో గూడెం చేరుకుంది కారు. పగలల్లా అలసిసొలసిన జనాలు నిద్రలో మునిగిపోయారు.

సుజాత ఇంటి ముందు ఆగింది కారు. ఆమె కారు దిగి వడివడిగా నడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. ప్రసాద్ నొచ్చుకుంటూ రవికిరణ్‌ని లోపలికి రమ్మని పిలిచాడు.



కారు లాక్ చేసి వచ్చాడు. ఆ ఇంటి ముందు వేసి ఉన్న నులక మంచం మీద కూర్చున్నారిద్దరూ. రెండు నిమిషాలు మౌనంగా గడిచాయి.

మధ్యలో ఓసారి లోపలికి వెళ్ళొచ్చాడు ప్రసాద్. మూలన గోడని ఆనుకుని ముడుచుకు కూర్చున్న ఆమెని మందలించి పడుకోమని చెప్పాడు. అతనికి చాలా ఆశ్చర్యంగా వుంది. తనూ సుజాతా ఇంత రాత్రి వరకూ కనిపించక పోయినా ఎవరూ పట్టించుకోక పోవడం...

ఆరుబైట కుక్కిమంచంలో పడుకున్న రాజుని నిద్ర లేపాడు. కళ్ళు నులుము కుంటూ లేచాడు రాజు. ఎదురుగా ప్రసాద్‌తో పాటున్న కొత్త మనిషిని చూడగానే మత్తువదలి పోయింది. అనుమానంగా చూశాడు.

"మీ అక్కకి బాగా కావలసిన మనిషి. రవి కిరణ్ గారు" చెప్పాడు ప్రసాద్..

"నువ్వూ అక్కా ఊరెళ్ళారనీ రెండు రోజుల దాకా రామని చెప్పమన్నారనీ పెసిడెంట్ గారి పాలేరు చెప్పాడు. అపుడే వచ్చేశారా? ఇప్పటి వరకూ అమ్మ నిన్నూ తిడతానే వుంది పెళ్ళి గాని పిల్లని ఇలా ఊరెమ్మట తిప్పుతున్నాడని" ఏమీ అడక్కుండానే చెప్పేశాడు రాజు.

రవి కిరణ్ వంక చూసి బలహీనంగా నవ్వి "సరే! నువెళ్ళి పడుకో! మేమిక్కడ కాసేపుంటాం" చెప్పాడు ప్రసాద్.

ప్రసాద్, రవి కిరణ్ యిద్దరే మిగిలారు. కాసేపు ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

"ఇప్పటికైనా అసలేం జరిగిందో నాకు తెలిస్తే బావుండును" రవి కిరణ్ అన్నాడు.

"అవును మీకు చెప్పాలనే నేను ఎప్పటినుంచో అనుకుంటున్నాను. సుజాత ఇంత వరకూ మీతో ఎందుకు చెప్పలేదో నాకు తెలీదు. అయినా ఏ ఆడపిల్లకీ జరగకూడని అవమానం తనకి జరిగింది. మీకు తెలిస్తే పరిష్కారం ఏదైనా చెప్పగలరేమో" అంటూ అతను గత జ్ఞాపకాలను తవ్వితీయడం ప్రారంభించాడు.

★ ★ ★

చిన్నప్పటినుంచీ ప్రసాద్, సుజాత ఒకే జట్టు. ఇద్దరూ కలిసి స్కూలుకి వెళ్ళేవారు. గూడెంలో అయిదో తరగతి దాటి చదువుని కొనసాగించింది వీళ్ళిద్దరే. ఊళ్ళో పెద్దలు వీళ్ళ చదువు మాన్పించి పాలేరు పనిలో పెట్టమని పోరుతూ ఉండేవారు. వాళ్ళకి జడిసి ప్రసాద్, సుజాతల తల్లిదండ్రులు చదువు మాన్పించాలని ప్రయత్నిస్తే ఏడ్చి హఠం చేసి చదువు కొనసాగించారు.

కానీ స్కూల్లో ఎదురయ్యే వివక్షని తట్టు

కోవడం వాళ్ళ వల్ల కాలేదు. పాఠాల్లో ఒక రకంగా వుండేది, స్కూల్లో టీచర్లు, పిల్లల ధోరణి వేరుగా వుండేది. ఎవరూ వీళ్ళని అంటుకునే వారు కాదు. ఒంటరిగా ఉండాల్సి వచ్చేది.

భయంగా, బెరుగ్గా బితుకు బితుకు మంటూ తామే ఎందుకు ఉండాలో అర్థమయ్యేది కాదు. తాము చేసిన తప్పేంటో తెలిసేది కాదు. మనసంతా ద్వేషంతోనూ, ఆత్మన్యూనతా భావంతోను నిండి వుండేది.

క్లాసులో సమాధానాలు తెలిసినా చెప్పాలంటే భయంగా వుండేది. వెనక బెంచీలో మూలకి ఒదిగి కూర్చుని టీచర్లు చెప్పేది వినడమే తప్ప ఇంకేమీ మాట్లాడటానికి వీలయ్యేది కాదు.

సరిగ్గా అటువంటి స్థితిలోనే ప్రసాద్ గుళ్ళోకి ప్రవేశించాడు. అతనికి వాతలు పెట్టడం జరిగింది. ప్రసాద్ నాన్న అతన్ని పదో తరగతి పరీక్షలన్నా రాయకుండా బడి మాన్పించేశాడు. సుజాత ఒక్కతే స్కూలుకి వెళ్ళొచ్చేది. ప్రసాద్ కూలికి వెళ్ళేవాడు. ఆ పొలాలలో నుంచే సుజాత యింటికి వచ్చేది. వచ్చేటపుడూ సుజాత, ప్రసాద్ కలసి వచ్చి కలసి వెళ్ళేవారు. ఆ సమయంలోనే తన చదువు గురించి చెప్పేది.

సుజాత పదో తరగతి చదువుతుండగా వాళ్ళ తెలుగు మాస్టారికి ట్రాన్స్‌ఫరయి 'భారతి' అనే టీచర్ వచ్చింది. ఆవిడ పిల్లలతో సరదాగా మాట్లాడుతూ వాళ్ళకి అర్థమయ్యే రీతిలో పాఠాలు చేప్పేది. వినసొంపైన స్వరంతో చిరునవ్వుతో ఆమె పాఠం చెపుతుంటే సుజాత ముగ్ధురాలయి చూసేది.

ఓ రోజు పాఠం మధ్యలో ఆవిడ అందరినీ అడిగినట్లుగానే సుజాతనీ అడిగింది. సుజాత లేచి నిలబడింది ఆమె కాళ్ళు వణికాయి. అలవాటు లేని పని కావడంతో తడబడుతూ "తెలియదు టీచర్" అంది.

పిల్లలంతా ఫకాలున నవ్వారు.

"ఎందుకు నవ్వుతున్నారు?" భారతి చిరుకోపంగా అడిగింది.

"తనని ఎవరూ అడగరు టీచర్. వాళ్ళకేం రాదు" గోవింద శాస్త్రిగారమ్మాయి అంది. సుజాతకి ఉడుకుమోత్తనంతో కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నాకు రాదు" మొండిగా అంటూ అలాగే నిల్చుంది. ఇంకో అమ్మాయి టీచర్ చెవిలో ఏదో చెప్పింది. అదేంటో ఊహించిన సుజాతకి దు:ఖం ముంచుకొచ్చింది. ఇక ఈ టీచర్ కూడా పాఠం చెప్పేపుడు ప్రేమగా చూడరు కాబోలు. ఆ కళ్ళు చిరునవ్వుతో తనని పరికించవు కాబోలు.

ఆమె అవస్థ చూసి జాలి కలిగింది "కూర్చో" చెప్పిందామె. ఆ రోజంతా అన్యమనస్కంగానే గడిపింది సుజాత. సాయంత్రం ప్రసాద్‌ని కలిసినపుడు తన గోడు వెళ్ళబోసుకుంది.

"ఏం అడిగారు టీచర్?."

"గజేంద్ర మోక్షంలో పద్యం చెప్పమన్నారు"

"ఏ పద్యం?."

"కలడందరు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందురన్ని దిశలను
కలడుకలండనెడు వాడుకలడో లేడో!..."

స్పష్టమైన కంఠంతో రాగయుక్తంగా సుజాత ఆలపించేసరికి ప్రకృతే పరవశించిపోయింది. ప్రసాద్ ఆమెకి షేక్‌హాండిచ్చి "చాలా బాగా పాడావు" మెచ్చుకున్నాడామెని.

అతనే కాదు. యింకొకరూ విన్నారా పద్యాన్ని. బస్ రాకపోయేసరికి ఎడ్లబండిలో తన ఊరికి వెళ్తున్న భారతి టీచర్ విన్నారు. ఆమె చాలా ఆశ్చర్యపోయింది. క్లాసులో తనకి ఏమీ తెలీదని చెప్పిన ఆమె ఎలా చెప్పగలిగింది? అందులోనూ ఇంత స్పష్టంగా ఉచ్చారణా దోషాలు ఏ మాత్రం లేకుండా.

మర్నాడు క్లాసులో టీచర్ సుజాతని తను నిల్చున్న చోటుకి పిలిచి ఆమె భుజాల

చుట్టూ చెయ్యి చుట్టి "నిన్న సాయంత్రం రోడ్డు మీద వెళుతూ చెప్పిన పద్యం చెప్పు ఒకసారి" మృదువుగా అడిగింది.

జీవితంలో ఎన్నడూ ఎరగని అనుభూతికి లోనయింది సుజాత. అది తనకు లభించిన గౌరవం. తననిలా ఎవరైనా గౌరవించవచ్చు ననీ, తనకా అర్హత ఉందనీ ఎప్పుడూ అనుకోలేదు. పిల్లలంతా తెల్లబోయి చూస్తున్నారు.

"చెప్పు" టీచర్ మళ్లీ ప్రోత్సహించగా ఏదో చైతన్యం వెల్లువెత్తింది. ఈసారి జంకూ, గొంకూ లేకుండా ధైర్యంగా చెప్పింది. చెప్పగానే భారతి టీచర్ చప్పట్లు కొట్టారు. పిల్లలు నిరసనగా చేతులు కలపలేదు.

పిల్లల రియాక్షన్ చూశాక సుజాత ఏంటో టీచర్‌కి అర్థమయింది. అమె మట్టిలో వున్న మాణిక్యం. సానపడితే మెరుగులీనుతుంది. అప్పుడే ఓ నిశ్చయానికి వచ్చిందామె. సుజాతకి తగిన గైడెన్స్ ఇవ్వాలని క్లాసులో పిల్లలందరికీ పాఠంలో భాగంగా మంచి విషయాలు, నైతిక విలువలు మొదలైనవి నేర్పించేది. దాంతో పాటు సుజాతకి ప్రత్యేకంగా పుస్తకాలు ఇచ్చి చదవమనేది. సాయంకాలాలు సుజాతతో కలిసి నడుస్తూ ఎన్నో విషయాలు బోధించేది.

తెలుగు సాహిత్యంలో ప్రముఖ గ్రంథాలన్నీ చదివింది సుజాత. చదవడమే ఊపిరిగా చదివింది. అదో యజ్ఞంలా చదివింది. చదువుతున్న కొద్దీ తెలిసింది తనెంత అజ్ఞానంలో వుందో. అది తెలుసుకున్నాక ఎవరైనా మురికి కూపంలో ఉండిపోదల్చుకుంటే వాళ్లు జీవచ్ఛవాలుగా బతకడానికి నిర్ణయించుకున్నట్లే! అలా జీవించాలనుకోలేదు సుజాత. అందుకే తనని ఎవరైనా అవమానించినా, అగౌరవ పర్చినా ప్రశ్నించడం నేర్చుకుంది.

ప్రసాద్ కూడా ఆమె బాటలోనే నడిచేవాడు. ఆమె తెచ్చిన పుస్తకాలు ఖాళీ సమయాల్లో చదివేవాడు. కలిసినపుడు వాటిని చర్చించుకునేవారు. అలాగే వేదం చదవడం కూడా ఆమె నేర్చుకుంది. అది తమకి నిషిద్ధమన్న విషయానికి ఆమె ఎంతో ఆవేశపడేది. ఎవరూ లేని సమయాల్లో పొలంగట్ల మీద నడుస్తూ ఆమె వేదపఠనం చేస్తుంటే వింటున్న ప్రసాద్‌కి ఒళ్ళు గగుర్పొడిచేది.

ఊళ్ళో వాళ్ళకి ఇవన్నీ పిల్లల ద్వారా కర్ణాకర్ణిగా తెలుస్తున్నాయి. వాళ్లు చూసీ చూడనట్లు వదిలేశారు. కానీ మధ్య సంవత్సర పరీక్షల్లో భారతి టీచర్ సుజాతకి తెలుగులో క్లాస్ ఫస్ట్ యివ్వడం అన్నది పెద్ద సమస్య అయి కూర్చుంది.

ఊళ్లో పెద్దలు వచ్చి స్కూలు హెడ్మాస్టర్‌తో చెప్పి వెళ్లారు. భారతి టీచర్‌కి వార్నింగిచ్చారు.

అమె పెద్దగా పట్టించుకోలేదు. సుజాతతో ఎప్పటి మాదిరిగానే ఉండేది. అది వాళ్ళకి కంటగింపుగా మారింది. సుజాతనీ, ఆమె తల్లిదండ్రుల్నీ పిలిపించి కంట్రోల్లో ఉండమని హెచ్చరించారు.

సుజాత వినలేదు. తను తెలుసుకున్న తనకున్న హక్కుల ప్రకారం మాట్లాడేది. వాళ్లు చాలా ఆశ్చర్యపోయేవారు. నిన్నగాక మొన్న ఊపిరి పోసుకున్న పిల్ల ఇలా ఎదిరించి మాట్లాడటం వాళ్ళకి మింగుడు పడేది కాదు.

ఇవ్వన్నీ భారతి టీచర్ నేర్పిస్తోందని వాళ్ళకి రూఢిగా తెలిసింది. నెల తిరిగేసరికి చడీ చప్పుడు లేకుండా ఆమెకి ట్రాన్స్ఫర్ ఆర్డర్స్ చేతికొచ్చాయి.

ఆమె నవ్వుకుని హుందాగా స్వీకరించింది. పిల్లల్లో చైతన్యాన్ని కలుగజేసి వాళ్ళ శక్తియుక్తుల్ని వాళ్ళే తెలుసుకునేలా చేయడం ఉపాధ్యాయుల వృత్తి. తన పనిని తను సక్రమంగా నిర్వహించింది. అంతే!.

కానీ సుజాత ఈ విషయాన్ని జీర్ణించుకోలేకపోయింది. ఓ నెల రోజులు డీలా పడిపోయింది. కానీ భారతి వెలిగించిన జ్ఞాన జ్యోతులు ఆమెలో అఖండంగా వెలుగుతూనే ఉన్నాయి. రెట్టింపు ఉత్సాహంతో పబ్లిక్ పరీక్షలకి చదవసాగింది సుజాత

ఆమె తెలివితేటలు, పట్టుదల మిగతా

పిల్లలకన్నా ఆమెని ఉన్నతంగా నిలబెట్టాయి. చదువులో ఆమె తమను దాటివేస్తోందని అందరికీ ఆందోళనే. అదే జరిగితే తమ పరువేం కావాలి? .

ఊళ్లో పెద్దలందరికీ ఇదో ప్రెస్టీజ్ ఇష్యూగా మారింది. ఏదో ఒకలా ఆమెకి ఆటంకాలు కల్పించడానికి ప్రయత్నించసాగారు. సుజాత తల్లిదండ్రులు బెంబేలెత్తిపోయారు. బలవంతంగా చదువు మాన్పించడానికి ప్రయత్నించారు. నాలుగు రోజులు తిండి తినడం మానేసింది సుజాత. పిల్లని చంపుకోడానికి సాహసించలేకపోయారు వాళ్ళు. ముందు నుయ్యి, వెనక గొయ్యిలా అయింది పరిస్థితి. పూట పూటకీ పెద్దింటాయన కబురు చేసి చెడామడా తిడుతుంటే మా తప్పేం వుందని అనలేని పిరికితనంతో వుండే వారు.

కానీ సుజాతలో ధైర్యం చాలా ఎక్కువగా వుండేది. తను తప్పు చేయడం లేదన్న ధైర్యం అది. ప్రసాద్ కూడా ఎప్పుడూ అండగా నిలబడే వాడు. ప్రసాద్ మీద కూడా వాళ్ళకి చాలా కినుకగా వుండేది. తెగింపుతో అతను గుళ్లోకి అడుగు పెట్టిన విధం చూసి మొక్కలోనే వంచేయాలని భావించే వారు.

ఇలా మల్లగుల్లాలు పడుతుండగానే టెన్త్ పబ్లిక్ పరీక్షలు వచ్చాయి. కసితో చదవడం మూలంగానేమో బాగా పరీక్షలు రాసింది సుజాత. నెల రోజుల్లో రిజల్ట్స్ రానే వచ్చాయి. ఆమె స్కూల్ ఫస్టే కాదు. జిల్లాలోనే ప్రథమురాలిగా నిలిచింది.

ఊరుఊరంతా నివ్వెరపోయింది... ఊరి జనాలు భయపడ్డారు. తమ పిల్లలు ఇంత మంది ఉన్నారు. వాళ్ళకి తాము ఇన్ని సదుపాయాలు కల్పించారు. అయినా వాళ్ళెవరూ సాధించలేనిది ఈ గూడెం అమ్మాయి. తినడానికి తిండే లేని అమ్మాయి అందులోనూ ఆడపిల్ల తాము యిన్ని ఆటంకాలు కల్పించినా ఇంతటి విజయాన్ని సాధించడం వాళ్ళు తట్టుకోలేకపోయారు.

స్కూలు హెడ్మాస్టర్‌ని, టీచర్లని ఇన్‌ఫ్లూయన్స్ చేసి ఆ బహుమతిని కూడా ఆమెకి ప్రదానం చెయ్యనివ్వకుండా అడ్డుపడ్డారు. చివరికి టౌన్లో ఎరేంజ్ చేసిన సభలో జిల్లా అధికారి చేతుల మీదుగా జిల్లా ప్రథమురాలిగా వచ్చిన బహుమతిని మాత్రం అందుకోగల్గింది.

సుజాతని చూసి ప్రసాద్ చాలా గర్వపడ్డాడు. గూడెంలోని కుర్రకారంతా ఆ రోజు సుజాతని బండి మీద ఊరేగించారు. అది మరింత కంటగింపుగా అన్పించింది వాళ్ళకి. తమ కక్షని ఎలా తీర్చుకోవాలో తెలీక కమతగాళ్ళ మీదా, పాలేర్లమీదా విరుచుకుపడే వారు.

గూడెంలో పెద్ద వాళ్ళందరూ కూడా సుజాతని మందలించే వారు. పెద్ద వాళ్ళతో కయ్యమెందుకని? ఆమెకి తను చేసిన తప్పేంటో తెలిసేది కాదు. పెద్దోరితో మనం పోటీపడటం తప్పని చెప్పే వారు.

ఇది పోటీ కాదే! తన చదువు తను చదువుకుంటుంటే వాళ్ళు మాటిమాటికీ అడ్డుపడుతున్నారు.

ఇక ఆమె కాలేజీలో చేరడం పెద్ద వింతయింది. గోవింద శాస్త్రులగారి అమ్మాయితో పాటు సుజాత కూడా కాలేజీలో జాయినయింది. గవర్నమెంట్ జూనియర్ కాలేజీలో సీటు వచ్చింది. స్కాలర్‌షిప్ ఫెసిలిటీ వుండటం మూలంగా ఆమె చదువుకి పెద్దగా ఖర్చయ్యేది కాదు.

దాంతోపాటు టౌన్లో కాలేజీలో అన్ని కులాల వాళ్ళూ కలిసిమెలిసి వుండేవారు. క్లాసులో అతికొద్ది మందికి తప్ప ఈ పట్టింపు పెద్దగా ఎవరికీ వుండేది కాదు. గోవిందశాస్త్రి కూతురు కూడా కాలేజీ వాతావరణం చూసి ఎట్రాక్ట్ అయింది. అందంగా వుండే ఆమెని చూసి కుర్రాళ్ళు ఎట్రాక్ట్ అయ్యే వాళ్లు. అలాంటి వాళ్ళలో విక్టర్ ఒకడు. ఆమె తరచుగా అతనితోనే మాట్లాడేది.

సుజాత ఇంటర్ కూడా పూర్తి చేసింది. ఈ రెండేళ్ళలో ఆమె పట్ల అందరికీ మరింత క్రోధం పెరిగిందే తప్ప తగ్గలేదు. దానికి తగ్గట్టు ఆమె ఇంటర్‌లో కూడా కాలేజి ఫస్ట్ వచ్చింది. తను ఎలాగైనా అయ్యేయస్ చదివి కలెక్టర్ అవుతానని ఆత్మ విశ్వాసంతో చెప్పేది.

అందరికీ అదో దిగులు పట్టుకుంది... ఈ పిల్ల అన్నంత పనీ చేయగల సమర్థురాలు. నిజంగా కలెక్టర్‌గానీ అయితే యిక గూడెం వాళ్ళెవరూ తమ గుప్పిట్లో వుండరు.

అందుకే ఏదో చెయ్యాలన్న తపన వాళ్ళలో బయల్దేరింది.

అది నడివేసవి కాలం. సూర్యుడు అగ్నికి రణాలతో భగభగలను సృష్టిస్తున్నాడు. వేసవి తాపం భరించలేనిదిగా ఉంది. వేడి గాడ్పులతో ప్రజలు అల్లాడుతున్నారు.

అటువంటి సమయంలోనే గోవిందశాస్త్రి గారి అమ్మాయి ఎవరితోనో లేచిపోయిం దన్న వార్త గుప్పుమంది. గూడెం వాళ్ళు ముక్కున వేలేసుకున్నారు.

ఊరిజనాలు మింగలేకా, కక్కలేకా అవస్థ పడుతున్నారు. గోవింద శాస్త్రి ఇల్లు కదల లేదు. రెండు రోజులు గడిచాక అతను ముక్కుతూ, మూలుగుతూ ఇంటి అరుగు మీద మొహం వేలాడేసి కూర్చున్నాడు. నలుగురూ చేరి ఏవో అనునయ వాక్యాలు చెప్పుతున్నారు.

ఆ సమయంలో అటు వైపే వెళ్తున్న సుజాత ఓ క్షణం ఆగింది. తటపటాయిస్తూ నిల్చుంది. అందరూ ఆమెవైపు అసహనంగా చూశారు. సుజాతకి ఆ అమ్మాయి మీద కోపం ఏమీ లేదు. తనకి తెలిసిన విష యాన్ని చెప్పాలనే వచ్చింది.

సుజాతని చూడగానే గోవింద శాస్త్రి ఓ మూలుగు మూలిగి మొహం తిప్పుకు న్నాడు. దీనితోటిదే తన కూతురు కూడా! అతి గారాబం చేసి పెంచితే చదువు చట్టు బండలు చేసుకుని, ఎలాంటి పని చేసింది? అసలు ఎక్కడుందో, ఏం చేస్తోందో, వాడె లాంటివాడో అన్నీ భయాలే!

ఇలా చేసిన పిల్ల చచ్చినా ఓ ఏడుపు ఏడ్చి ఊరుకోవచ్చుకానీ బలవంతంగా ఎవడన్నా రొచ్చులోకి దింపితే ఏంటీ గతి? రామ... రామ... ఇలాంటి కష్టం పెట్టావేంటయ్యా! కుములుతూ అనుకున్నాడు.

పక్కనున్న వాళ్ళు సుజాతని చూసి 'ఏంటి' కొట్టినట్లే అడిగారు. "శ్రావణి గురించి చెపు తామని" అంది. గోవిందశాస్త్రి నిటారుగా అయ్యాడు. దీనికి నా కూతురి గురించి ఏం తెలుసు! ఎవరూ మాట్లాడలేదు. అలాగే చూస్తూ నిలబడ్డారు.

"శ్రావణి విక్టర్ అన్న అబ్బాయితో ఎక్కు వగా మాట్లాడుతుండేది. వాళ్ళిద్దరూ అపుడ పుడూ క్లాసులకి రాకుండా సినిమాలకి వెళ్లే వారని అందరూ చెప్పేవారు. నేను కూడా చెప్పాను అలా చెయ్యొద్దని. నామాట విన లేదు. అతనితోనే వెళ్లుండొచ్చు" గబగబా చెప్పింది.

అందరూ నిశ్చేష్టులయ్యారు. ఆ విషయం జీర్ణించుకోవడానికి కొంత సమయం పట్టింది. గోవిందశాస్త్రి కళ్లు కోపంతో ఎరు పెక్కాయి. పళ్లు పటపటా కొరుకుతూ లేచి నిలబడి బూతులు తిడుతూ పక్కనున్నవాడి చేతిలోని ములుగర్ర తీసుకుని సుజాతని బాదసాగాడు.

ఊహించని ఆ సంఘటనకి సుజాత షాక య్యింది. తనేం తప్పు చేసిందో అర్థం కాలేదు.

"నా కూతురుకి, వాడితో వీడితో సంబం ధాలు అంటగడతావా?" అంటూ చెలరేగి పోతున్నాడు. దారినపోయే గూడెం వాళ్లు చూసి విడిపించి ఇంటికి తీసుకెళ్లారు. నెవ రగంత మీద తగిలిన దెబ్బకి కళ్లు బైర్లు గమ్మి వేలాడిపోయింది సుజాత.

ప్రసాద్‌కి తెలిసింది విషయం. పొలం నుంచి ఆదరా, బాదరా పరిగెత్తుకొచ్చాడు. గూడెం వాళ్లంతా వచ్చారు. కానీ ఎవరికీ

ఇదేంటని అడిగే ధైర్యం లేదు. వాళ్ల దగ్గర చేసిన అప్పులకి జీవితాన్నే కుదువపెట్టారు. ఇక నోరు విప్పే సాహసమే చేయలేరు.

ప్రసాద్ ఊరుకోలేదు. తన తోటి కుర్రాళ్లని తీసుకుని గోవిందశాస్త్రి ఇంటి మీదకి వెళ్లాడు. ఊళ్లో కుర్రాళ్లు కట్టగట్టుకుని వచ్చి పడ్డారు. మాటామాటా పెరిగింది. కర్రలు పైకి లేచాయి. అదో రణరంగంలా మారిపోయింది. అటువైపూ, ఇటువైపూ రక్తం కళ్లజూసుకున్నాక శాంతించారు. అదృష్టవశాత్తు ఎవరికీ ప్రాణహాని కలుగలేదు.

ఈ సంఘటనతో అందరి ఉక్రోషాలూ, పంతాలూ, విద్వేషాలూ, ప్రతీకారాలూ బయటికివచ్చాయి. ఇంతవరకూ అణచిపెట్టుకున్నవన్నీ బైటకి రావడంతో వాటి తీవ్రత ఎక్కువగా ఉంది.

ఇక సుజాతైతే ఆమెలో ఆవేశం హద్దులు దాటి విచక్షణని మరుస్తోంది. తనేం తప్పు చేసిందని ఊళ్లో అందరిముందూ తనని కొట్టారు. అసలు తనని కొట్టే హక్కు వాడికెవరిచ్చారు? ప్రతిగా తనూ ఏదో చెప్పాలనిపించేది. తన బలమేంటో, తన శక్తియుక్తులేంటో తనకి తెలీదు. కానీ అసహనం, క్రోధం, అసంతృప్తి కుదిపివేసేవి. ఏం చెయ్యాలో తోచక ఊరి పెద్దలు ఎదురైనప్పుడు రోడ్డుపక్కన వెళ్తున్నదల్లా మొహం పక్కకి తిప్పుకుని ఖాండ్రించి ఉమ్మేసేది. లేకపోతే తలెగరేసుకుంటూ నడిచేది. ఊరి పెద్దలకి కూడా అవమానంగా ఉండేది. ఓసారి సుదర్శనం చూసి చూసి కర్రపట్టుకుని వెంటబడితే పారిపోయి దెబ్బలు తప్పించుకుంది.

అందరికీ సుజాతంటే కడుపుమంటగా ఉంది. అవకాశం దొరికితే ఏకీలుకాకీలు విరిచేయాలన్నట్లుగా ఉండేది. దానికోసమే ఎదురుచూస్తున్నారందరూ.

★ ★ ★

ఆ ఊరు పాడిపంటలతో తులతూగుతూ ఉండేది. మేలుజాతి గేదెలు ప్రతి రైతు ఇంట్లో అయిదు, ఆరుకి తక్కువ కాకుండా ఉండేవి. పాడి ద్వారానే ప్రతి ఇంట్లో నెలకి మూడు, నాలుగు వేలకి తక్కువ కాకుండా ఆదాయం ఉండేది. ఊళ్లో పాలకేంద్రం కూడా ఉండేది.

ఈ గేదెలని మేపుకు రావడానికి వాటిని తోమి తళతళ మెరిసేలా చేయడానికి పాలేర్లు ఉండేవారు. సంవత్సరానికి ఇన్ని బస్తాల వడ్లు అని లెక్కగట్టి ఇచ్చేవారు.

తమ ఇంటికి సిరి పాడిగేదెలని అంతా నమ్మేవారు. అలాంటిది ఏమైందో ఏమో ఆ సంవత్సరం వేసంగిలో చూడిగేదెలతో సహా ఏడెనిమిది గేదెలు మాయదారి రోగంతో చచ్చిపోయాయి. రైతులకి ఏం చెయ్యాలో తోచలేదు. ఆరోగ్యంగా ఉన్న గేదెలే నిల్చున్నపాటున చచ్చిపోవడం చూస్తే అంతా మాయగా ఉంది. పశువుల డాక్టర్‌కి కబురంపారు. అతను ఊరెళ్లాడని తెలిసింది. టౌన్ నుంచి డాక్టర్‌ని రప్పించడానికి సిద్ధమయ్యారు. సరిగ్గా ఆ సమయంలో జరిగింది ఓ అనూహ్య సంఘటన.

★ ★ ★

ఊళ్లో రైతు కుటుంబాల మొహాలు చూడటానికి, గూడెంలో ఖాళీగా గడపడానికి ఇష్టంలేని సుజాత ఖాళీ దొరికినప్పుడల్లా పొలం గట్లమీద కూర్చుని ఏ పద్యమో, పాటో రాగయుక్తంగా పాడుకుంటూ ఉండేది.

గాలికి తలలూపుతున్న చెట్లు తన పాటకి తాళం వేస్తున్నట్లుగా అన్పించేది. మరింత పరవశించి కంచుకంఠాన్ని రకరకాల శ్రుతులకి అనుగుణంగా మారుస్తూ పాడుతూ వుండేది. వేదాల్లో వుండే అక్షరాల కూర్పు ఆమెకి అద్భుతంగా తోచేది. వాటి భావాల్లో ఉన్న శక్తికన్నా శక్తివంతమైన ఆ అక్షరాలే ఆకర్షించేవి. ఒక రిథమ్‌తో వాటిని చదువుతున్నప్పుడు ఉచ్ఛ్వాశ నిశ్వాసాల వడి పెరిగి నాభి వద్ద ప్రారంభమైన చైతన్యం

తనువంతా నిండుతున్నట్లుగా ఉండేది.

ఆ రోజూ అలాగే పాడుతూ కూర్చుంది. పిల్లిపెసర చేనులో మేత మేస్తున్న రెండు గేదెలు మేయడం ఆపేసి మోరసాచి సుజాత వంకే చూడసాగాయి.

కాసేపటికి వాటిని గమనించింది సుజాత. ఆమె మనసు ఆనందంతో గంతులువేసింది. శిశుర్వేత్తి, పశుర్వేతి అన్న వాక్కు గుర్తొచ్చింది. సంగీతానికి ఆ శక్తి వుంది.

మరింత హుషారొచ్చిందామెకి. ఆ రెండు గేదెల దగ్గరకి వెళ్లి ఎదురుగా నిలబడి పాడసాగింది. అవి కదలకుండా నిలబడి వినసాగాయి.

పొలం చూసుకుంటూ, పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకుంటూ వస్తున్న సుదర్శనం, భూషణం కళ్లబడిందా దృశ్యం.

సుజాతకి ఎదురుగా మోరసాచి నిలబడిన గేదెలు, వాటి ఎదురుగా నిలబడి చేతులూపుకుంటూ ఏదో మాట్లాడుతున్న సుజాత.

సుదర్శనం మొహంలో రకరకాల భావాలు మారాయి. చివరికి అతని మనసులో ఓ భావం స్థిరపడిపోయింది.

భూషణం వంక సాభిప్రాయంగా చూశాడు సుదర్శనం. తల పంకించి చేలో వరికుప్పల్ని సర్దుతున్న కూలీనొకడిని పిలిచి ఊళ్లో పెద్దలని కుర్రకారుని ఉన్న పళంగా లగెత్తుకురమ్మని చెప్పాడు.

సుజాత అలాగే తనకి వచ్చిన పద్యాలన్నీ పాడేస్తోంది. ఆ గేదెలు కదలడంలేదు. వింటున్నట్లుగా అలాగే నిల్చున్నాయి. ఆమెకే ఉత్సాహం పొంగుతోంది. పద్యాల్లోంచి శ్లోకాల్లోకి దిగింది..

స్పష్టమైన ఆమె కంఠం నుంచి వెలువడే శ్లోకాలతో ప్రకృతి ఎక్కడిదక్కడ చలించడం మానివేసిందా అన్నట్లుంది. పావుగంట గడిచేసరికి తన వెనుక ఎవరో ఉన్నట్లు తోచి కళ్లుమూసుకుని శ్లోకాలు పఠిస్తున్నదల్లా ఆపి కళ్లు తెరిచి వెనక్కి తిరిగి చూసింది సుజాత.

అంతే! నిశ్చేష్టురాలయింది. తన వెనుక పొలంలో యాభై అరవై మంది ఊరిజనం . అయోమయంగా చూసింది. అక్కడ స్మశాన నిశ్శబ్దం ఆవరించింది. ఎవరూ కదలడం కూడా లేదు. కానీ అంతకన్నా శక్తివంతమైన భావాన్ని వారికళ్లు ప్రసారం చేస్తున్నాయి.

నువ్వు అపరాధివి అంటున్నాయా కళ్లు. తన వెనుక అంతమందిని చూసేసరికి నాలుక పొడారిపోయింది. భయంగా చూస్తూ నిల్చుంది.

ఇద్దరు మనుషులు గేదెల దగ్గరికి వచ్చి వాటి మెడలో పలుపుతాళ్లు వేసి పట్టుకున్నారు. సుదర్శనం సుజాత దగ్గరికి వచ్చాడు.

"ఎప్పుడు నేర్చుకున్నావు ఈ విద్య? " అతని కంఠం ఉరుములా ధ్వనించింది.

"ఏ విద్య? " బిత్తరపోయి అడిగింది.

సుదర్శనం వెనక్కి తిరిగి 'ఎలా మాట్లాడుతుందో చూడండి' అన్నట్లు హేళనగా చూశాడు.

"నాలుగు తంతే ఏ విద్యో తెలుస్తుంది? " వెనక నుంచి పార్థసారథి అన్నాడు.

చుట్టూ కలియజూసింది సుజాత. తన వాళ్లంటూ ఎవరూ లేరు. అంతా ఊరి వాళ్లే! ఇంతకీ తనేం తప్పుచేసింది? అన్న ప్రశ్న ఆమె మనసులో సుడులు తిరుగుతోంది.

"ఊళ్లో గేదెలన్నీ పండుటాకుల్లా రాలిపోతుంటే ఏమైందో తెలియక కొట్టుమిట్టాడాము. ఇప్పుడు అసలు సంగతి బైటకి వచ్చింది" భూషణం అన్నాడు.

అయోమయంగా చూసింది. గేదెలు చచ్చిపోవడానికీ ఇప్పుడు వీళ్లంతా తనని చుట్టుముట్టడానికి కారణం ఏంటి? శరీరం

**యౌవనదశలో మనం ప్రపంచాన్ని మార్చేందుకు ప్రయత్నిస్తాం కానీ వయసు మళ్లిన తరువాత మనం యువతను మార్చడానికి ప్రయత్నిస్తాం. – జాబ్ బ్రౌన్**



కంపించడం ప్రారంభమైంది. అంత మొండి ధైర్యం ఏమయిందో తెలీడంలేదు. భయంగా నాలుగు అడుగులు వెనక్కి వేసింది.

"నువ్వు మా మీద కక్షతో గేదెలకి మంత్రం ఏదోవేసి చంపేస్తున్నావు కదా? " సుదర్శనం క్రూరంగా అడిగాడు.

కళ్లు పెద్దవిచేసి ఆ నిందని విన్నది. తను గేదెలకి మంత్రం వేస్తోందా? చంపడానికి! తను ఉబుసుపోక నోటికి వచ్చిన పాటలేవో పాడుతుంటే అవి కాసేపు తలలు పైకెత్తి నిలబడ్డాయి అంతే! అయినా మంత్రాలు వేస్తే గేదెలు చచ్చిపోతాయా?

"నాకేం తెలియదు. నేననట్టాంటి పనిచెయ్యను"

పంటి బిగువున దుఃఖాన్ని బిగబట్టుకుని అంది.

"నీకు నిజంగానే తెలవదూ? " సుదర్శనం మీద మీదకి వస్తూ అన్నాడు.

"నాకు తెలవదు." వెనకడుగు వేస్తూ మొండిగా అంది. "నీకు తెలవకపోతే నేను తెలిసేలాగా చేస్తాలే పదంర్రా ఊళ్ళోకి." సుజాత జుట్టు మొదల్లో పట్టుకుని బరబర ఈడుస్తూ అన్నాడు సుదర్శనం.

ఊహించని ఆ సంఘటనకి నివ్వెరపోయింది. అతని పట్టునుంచి తప్పించుకోడానికి గింజుకోసాగింది. సుదర్శనం ముందు సుజాత ఎంత?... వంటి చేత్తోనే ఈడ్చుకుని వస్తున్నాడు.

తననేం చేస్తారు? అణు అణువూ భయంతో వణికిపోతోంది. అమ్మనీ, అయ్యనీ తల్చుకుని కేకలు పెడుతూ ఏడుస్తోంది.

ఊళ్ళో గుడి దగ్గర వున్న రచ్చబండ దగ్గరకి లాక్కువచ్చారు.

"మన సిరి సంపదలకి మూలమైన మన పాడిపశువులని మాయలూ, మంత్రాలతో అతి దారుణంగా చంపుతూ డైరక్ట్‌గా దొరికి

పోయిన ఈ మంత్రగత్తెని ఏం చేయాలి? ." ఊరి జనాలనుద్దేశించి గట్టిగా అరిచాడు సుదర్శనం.

"క్షమించొద్దు. దీన్ని చంపడమే శిక్ష" అంతా అరిచారు. క్రూరంగా నవ్వాడు సుదర్శనం.

"ఆడదాన్ని చంపడం ఎందుకురా!. యిది తలెత్తుకోలేనివిధంగా చెయ్యాలిగానీ" అని సాలోచనగా చూసి" అరే పాత చెప్పుల దండ రడీ చేయండిరా!" చెప్పాడు.

రోషంతో అవమానంతో కందిపోయింది సుజాత మొహం. అతను తన దగ్గరకి వస్తూ వేస్తున్న ఒక్కొక్క అడుగూ తన గుండెల మీద పడుతున్నట్లే వుంది.

ఊరంతా సుదర్శనం నిర్ణయం కోసం ఊపిరి బిగబట్టింది. సుజాత అలా చూస్తూనే ఉంది.

"ఇప్పుడు గేదెల మీద ప్రయోగించిన మంత్రాలు మన మీద ప్రయోగించదన్న నమ్మకం ఏంటి? మళ్ళీ ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకూడదంటే కఠినంగా శిక్షించాలి. అందుకే." ఒక్క నిమిషం ఆగి అందరివంకా కలయజూసి " అందుకే ఈ దుష్టమంత్రగత్తెని వివస్త్రని చేసి నడివీధిలో ఊరేగించాలి" గంభీరంగా అన్నాడు.

అంతే! అంతా సంతోషం పట్టలేనట్లు ఘొల్లున అరిచి తమ హర్షాన్ని ప్రకటించారు.

ముందు సుదర్శనం ఏమన్నాడో ఆ మాటల్ని గ్రహించడానికి సుజాతకి మెదడు సహకరించలేదు. విన్న తర్వాత అపనమ్మకంగా సుదర్శనం వంక చూసింది. అసలు తను విన్నది కరెక్టేనా? తన చెవులు తనని మోసం చేస్తున్నాయా ఏంటి? .

శాడిస్టిక్‌గా అరుస్తున్న జనాల వంక చూసింది. ఈ ఘోరాన్ని చూడలేని జీతగాళ్ళు కొందరు అక్కడ నుంచి తప్పుకుని గూడెం వాళ్ళకి వార్త చేరవేశారు. ఎక్కడో కిలోమీటర్ దూరంలో పొలంపనికి వెళ్ళిన ఏసుపాదం, మరియమ్మకి వార్త చేరింది. శోకాలు పెడుతూ పరిగెత్తుకు రాసాగారు.

ఊరికి పడమటి దిక్కున ఉన్న పొలంలో పనిచేస్తున్న ప్రసాద్‌కూ ఈ విషయం తెలిసింది. చేతిలో ఉన్న కొడవలి అలాగే పట్టుకుని ప్రళయకాల రుద్రుడిలా బయల్దేరాడు.

సుదర్శనం పైశాచికంగా నవ్వుతూ ఓణీ మీద చెయ్యి వెయ్యగానే చేష్టలు దక్కి నిల్చుండిపోయింది. ఓ బాధ, దుఃఖం, క్రోధం, ద్వేషం లాంటి భావాలు ఆ సమయంలో కలగలేదు. తను అక్కడలేనట్లుగానే వుంది సుజాత.

శరీరంలోంచి ఆత్మ లేచిపోయి వట్టి కట్టె మాత్రమే మిగిలినట్లుగా వుంది. తన చుట్టూ ఏం జరుగుతుందో ఊహించలేని స్థితిలో వుంది.

ఊరంతా చూస్తుండగా ఓణీ లాగి పారేశాడు సుదర్శనం. లంగా వూడదీశాడు. జాకెట్టు పర్రున చింపేసి వివస్త్రని చేసి మెళ్ళో చెప్పుల దండ వేశాడు.

ఆడదానికి ప్రాణంతో సమానమైనది మానం అన్న విషయాన్ని గట్టిగా నమ్మిన వాళ్ళు ఆమె ప్రాణాలని తీస్తున్న సంతోషంలో వున్నారు.

అప్రయత్నంగా ఒంటిని చేతులతో కప్పుకునే ప్రయత్నం చేస్తూ నేలమీద కూలబడిపోయింది సుజాత. జుట్టుపట్టుకుని పైకి లేపాడు.

ఈ ఘోరాన్ని చూడలేని కొంతమంది రైతులు ఇంటి మొహం పట్టారు. తమ భర్తలూ, అన్నలూ, తండ్రులూ ఇంత నీచులైనందుకు చాలామంది ఆడవాళ్ళు తిట్టుకున్నారు.

నగ్నంగా ఆమెని వీధులన్నీ తిప్పుతున్నారు. ఆమె రెండు చేతులతో శరీరాన్ని కప్పుకోడానికి, కూలబడి తనని తనే అచ్ఛాదనగా చేసుకోడానికీ ఆస్కారం ఇవ్వడంలేదు.

తను ఆడదనేగా ఈ అవమానం? రేపు నలుగురిలో తలెత్తుకుని తిరగకూడదనేగా? ఎన్నో రకాలుగా తనని అణిచిపెట్టాలని

చూసి ఇక ఏ దారీ లేక ఇలా తనని నవ్వుల పాలు చేశారు.

సూదుల్లాంటి చూపులు శరీరంపై తార ట్లాడుతుంటే గొంగళి పురుగులు పాకిన ట్లుగా ఉంది. ఒళ్ళంతా మంటల్లో మాడి పోతే బావుండునని ఉంది.

సభ్యసమాజం తలెత్తుకోలేని ఈ సంఘట నని చూసి గూడెం జనాలు కన్నీరు మున్నీ రయ్యారు. ఇదేమని ఇద్దరు ముగ్గురు ప్రశ్నిస్తే బాణా కర్రలతో జవాబిచ్చారు రైతులు.

వీధులన్నీ వెతుక్కుంటూ పరుగు పరు గున వచ్చాడు ప్రసాద్. కొడవలి చూపించి గుంపుని చీల్చుకుంటూ సుజాత దగ్గరకి వచ్చాడు. ఆమెని చూడగానే అంతటి ఆవే శమూ ఏమైందో కరిగి నీరయ్యాడు. గుండె ల్లోంచి దుఃఖం పెల్లుబికింది. బలవంతానా అదిమిపెడుతూ తన భుజాన ఉన్న కండు వాతీసి సుజాతకి కప్పాడు.

సుదర్శనం, పార్థసారథి అడ్డుపడబో యారు.

"రేయ్! పుచ్చెలెగిరిపోతాయ్ వూ!. ఆడకూ తురిమీద కాదురా ప్రతాపం. దమ్ముంటే నాలాంటివాళ్ళమీద చూపించండి" కొడవలి పట్టుకుని భయంకరంగా అరిచాడు.

కొదమసింహంలా కన్పిస్తున్న అతని మీదకి వెళ్ళే సాహసం చెయ్యలేకపోయారె వరూ.

ఈలోపు గోలు గోలున ఏడుస్తూ వచ్చిన ఏసుపాదం మరియమ్మ తమతో తెచ్చిన చీరని ఆమె వంటికి కప్పారు.

ఆమె మెళ్ళోవున్న చెప్పుల దండని విసిరి కొట్టాడు ప్రసాద్. అప్పటివరకూ పిచ్చిచూ పులు చూస్తూ ఏదో లోకంలో ఉన్నట్లున్న సుజాత ప్రసాద్‌ని చూడగానే గుర్తుపట్టినట్లు మొహంలో చిన్న కదలిక. తల్లిదండ్రులూ ప్రసాద్ కలసి ఆమెని పొదవి పట్టుకుని నడిపించసాగారు.

వెళ్తూ వెళ్తూ ఆమె సుదర్శనం వైపు చూసింది. ఆ చూపుకే శక్తి ఉంటే అతనా మంటల్లో భస్మమైపోయేవాడు. ఆ చూపునే అర్థం చేసుకోగలిగిన శక్తి ఉంటే కొంచెం జాగ్రత్త పడివుండేవాడు.

★ ★ ★

జరిగిన సంఘటనతో గూడెం బిక్కచచ్చి పోయింది. పెద్దలకి ఎదురెళితే ఎలాంటి అవమానం జరుగుతుందో తెలిసి వచ్చింది అందరికీ.

కుర్రకారు కొందరు తప్ప ఎవరూ ప్రతి స్పందించలేదు. తమ గుడిసెలో కూర్చుంది సుజాత. ఆమె చెయ్యి పట్టుకుని వదల కుండా ప్రసాద్ ఏవో అనునయ వాక్యాలు చెపుతున్నాడు. వింటుందో లేదో ఎవరికీ తెలీదు.

రాజు దూరంగా దిగాలుగా నిల్చుని అక్కని చూసుకుంటున్నాడు. మరియమ్మ ఊరి రైతుల్ని దుమ్మెత్తిపోస్తోంది. ఏసు పాదం గుడ్లనీరు కుక్కుకుంటూ కూర్చు న్నాడు.

"సుజీ!" ప్రసాద్ మెత్తగా పిల్చాడు. కళ్ళెత్తి చూసింది!

"మర్చిపో! మర్చిపోయి చదువుమీదే దృష్టి పెట్టు. ఇకనుంచీ నేను నీకు తోడు" అనున యంగా అన్నాడు. ఏదో అనబోయి మాటలు మింగేసినట్లు కళ్ళు, పెదాలు కాసేపు చలించి ఆగాయి సుజాతకి.

"కాస్తంత ఈ అన్నం ముద్ద తిను" తిని పించబోతూ అన్నాడు. పళ్ళెం విసిరికొట్టింది సుజాత. మరియమ్మ దుఃఖం మరింత హెచ్చింది.

"నీరసం వస్తుంది సుజీ! ఓ ముద్ద గొంతులో ఏస్కుని కాసేపు తొంగో" చెప్పాడు ప్రసాద్.

తిరస్కారంగా చూసి మొహం తిప్పుకుంది సుజాత.

"సుజీ! నేనేం చెయ్యాల్లో చెప్పు." ప్రాధే యపూర్వకంగా అడిగాడు. ఓ మగాడిగా

అతనితో ఆవేశం ఉరకలు వేస్తోంది. తనకి ఆప్తురాలయిన ఆడదానికి జరిగిన అవమానం గుర్తొస్తుంటే ఆ పని చేసిన వాళ్ళందరినీ నరికేయాలనిపిస్తోంది. కానీ ఆపని తెలివిగా చెయ్యాలి. గూడెం వాళ్ళందరినీ కూడగట్టాలి. అందరూ ఓ తాటిమీద ఉండి ఆ పని చెయ్యాలి.

ఏది ఎటు తిరిగినా అంతా వాళ్ళ పంచనబడి బతికే వాళ్ళే. తిండిగింజలకి లోటు వస్తుంది. ఆలోచిస్తూ కూర్చున్నాడు. సాయంత్రం వరకూ అంతా అలాగే ఆలోచనల్లో గడిపారు. మళ్ళీ రాత్రికి వస్తానని చెప్పి గూడెంలోకి వెళ్ళాడు ప్రసాద్. మరియమ్మ ఏసుపాదం పనిపాటల్లో పడ్డారు.

తల పగిలిపోయేలా ఆలోచించిన సుజాత ఓ నిశ్చయానికి వచ్చింది.

రాత్రి ఎనిమిదింటికల్లా భోజనం చేసింది. తొమ్మిదికల్లా ఇంట్లో అంతా నిద్రలోకి జారుకున్నారు.

తనకి కావలసిన సరంజామా అంతా సర్దుకుంది. మెల్లగా ఇంట్లోంచి బయట పడింది.

ఆమెకి ఆ పొలాల తోవలన్నీ చిరపరిచితాలే!. నడుస్తూ నడుస్తూ పంట పొలాలు దాటి ముందుకెళ్ళింది. అప్పుడెదురయ్యాయి ఊళ్ళో పెద్దరైతుల ఆదాయానికి కారణభూతమైన చేపల చెరువులు. వీటి ద్వారానే రెండు చేతులా డబ్బు సంపాదించి ఆ మదంతో విర్రవీగుతున్నారు. వీటిని చూసుకొనే అహంకారంతో కన్నూమిన్నూ గానక ప్రవర్తిస్తున్నారు. కసిగా చూస్తూ నిల్చుంది కాసేపు. ఆ తర్వాత కర్తవ్యం గుర్తొచ్చినట్లుగా తనతో తెచ్చుకున్న పురుగుమందుల డబ్బాలను, స్ప్రేయర్‌లో పోసి ఆ పొలాల మీద పిచికారీ చెయ్యడానికి సిద్ధపడింది.

నీటిలో అల్లనల్లన తిరిగే బుజ్జి చేపలు ఓ క్షణం కళ్ళముందు మెదిలాయి. 'ఎప్పటికైనా చచ్చేవే!' విరక్తిగా అనుకుని చేపల చెరువుల్లో పురుగు మందులు పిచికారీ చేసింది.

దాదాపుగా సుదర్శనం చేపల చెరువులన్ని ఫినిష్. సంతృప్తిగా అనుకుంది.

ఆ తర్వాత వరికుప్పల దగ్గరకి వచ్చింది. సాధారణ పరిస్థితుల్లో అయితే వాటిదగ్గర తప్పనిసరిగా ఎవరో ఒకరు కాపలా వుంటారు.

కానీ ఉదయం జరిగిన సంఘటనతో ఎవరూ ఒంటరిగా పొలంలో పడుకోటానికి సాహసించలేదు. కమతగాళ్ళని కూడా ఇంటి దగ్గర కాపలా పెట్టుకున్నారు.

వరికుప్పలన్నీ అనాథల్లా వున్నాయి. అక్కడికి చేరుకుంది సుజాత. నూనెలో ముంచిన గుడ్డని పెద్దకర్రకి చుట్టింది. దానిని అగ్గిపుల్లతో వెలిగించింది. అది కాగడాలాగా భగ, భగమండసాగింది.

గండ్రగొడ్డలి పట్టుకున్న పరశురాముడే అయింది సుజాత. ఒకో వరికుప్పా సుజాత ముందు తలవంచింది.

ఎర్రని మంటలు ఎటు చూసినా నాలుకలు సాచుకుని ఆకాశంలో ఎగబాకుతుంటే తెలివిలోకి వచ్చింది.

తను చెయ్యాలనుకున్న పనిచేసేసింది. ఇక తనని బతకనివ్వరు. యిక్కడ నుంచి పారిపోవాలి. ఆమెకి తన సర్టిఫికెట్లు గుర్తొచ్చాయి. పరుగు పరుగున యింటికి వచ్చి తన సర్టిఫికెట్లు సర్దుకుంటుండగా ప్రసాద్ వచ్చాడు.

అతనికి అప్పటికే వరికుప్పలు తగలబడుతున్న విషయం తెలిసింది. పరిగెత్తుకుంటూ వచ్చాడు.

అపనమ్మకంగా సుజాత వంక చూశాడు. "నేనే" సగర్వంగా అంది. ఏం చేయాలో తోచనట్లు అయిపోయాడు.

అమ్మ, అయ్య, తమ్ముడు వంక ఓసారి చూసింది. సంచి భుజానికి తగిలించుకుని

**ఇతరులను ఎల్లప్పుడూ ద్వేషించడం, లేదా ముఖప్రీతి వాక్యాలతో మెప్పించడం దాస్యబుద్ధిని వెల్లడిస్తుంది. – జార్జి వాషింగ్టన్**

పరుగు ప్రారంభించింది. అనుసరించాడు ప్రసాద్.

★ ★ ★

సుజాత రైలెక్కాక కాసేపు తోచనట్లు అక్కడే నిలబడ్డాడు ప్రసాద్. తర్వాత పొలా లకి అడ్డంబడి పరిగెత్తుతూ ఇంటికొచ్చిప డ్డాడు.

రాత్రంతా గూడెంలోనూ, ఊళ్ళోనూ కల కలం వినిపిస్తూనే వుంది. అర్ధరాత్రి ఎవరో వచ్చి తలుపుతట్టడం వినిపించింది కానీ తలుపు తియ్యలేదు.

తెల్లారి లేచేసరికి అంతా గందరగోళంగా ఉంది. నీళ్ళలో పైకి తేలి నిర్జీవంగా కన్పి స్తున్న చేపల్ని చూసి మరింత మంటెత్తిపో యారు రైతులు.



సూర్యుడు బారెడు పైకి ఎగబాకేసరికి పోలీసులొ చ్చారు. ప్రతి ఇంటికీ వెళ్ళడం, అందరినీ చావ గొట్టి నిజం కక్కించే ప్రయత్నం చేయసాగారు. ఆ దెబ్బలకి తాళలేక అందరూ సుజాత పేరే చెప్పారు. ఆమె కోసం గాలించారు గానీ ఎక్కడా దొరకలేదు. ప్రసాద్ మీద కూడా సందేహం వచ్చి అతన్ని చాలాసేపు విచారించారు. ప్రసాద్ మొండికెత్తి వున్నాడు. "తనేం చేసిందో నాకు తెలవదు. కానీ తనని ఈ ఊరి పెద్దమనుషులు ఏం చేశారో తెలుసా?. గుడ్డలూడదీసి యీధులెంట తిప్పారు." ప్రసాద్ రౌద్రంగా చెపుతుంటే అక్కడ నుంచి పోలీసులూ, ఊరిపెద్దలు కూడా తప్పుకున్నారు.

ఆ తర్వాత సంవత్సరం పాటు సుజాత రగిలించిన రావణకాష్ఠం రగులుతూనే వుంది. గూడెంలో ఎవరూ నోరెత్తలేనట్లుగా అయ్యారు. చదువులేదు, తిండి లేదు. ఆరో గ్యాలు లేవు. అన్ని ఊరి మోతుబరుల చేతుల్లోనే.

అవకాశం దొరికినపుడల్లా ఏదో విధంగా వీళ్ళని ఇరికించే ప్రయత్నాలు చేశారు. యాకోబుని అలాగే అరెస్ట్ చేసి బోస్టన్ స్కూల్లో వేశారు.

ఎప్పటిలాగే జీవచ్ఛవాలుగా నోరెత్తలేని విధంగా గూడెం జనాలు మారాక అప్పటికి రెండేళ్ళకి కాస్త శాంతించారు ఊరిపెద్దలు.

ఎపుడయితే సుజాత తనని విడిచిపెట్టి వెళ్ళిందో అప్పటినుండీ ప్రసాద్ చైతన్యాన్ని కోల్పోయినట్లుగా అయ్యాడు. తనూ, సుజాతా వేరువేరనీ ఇద్దరూ దూరంగా ఉండాల్సి వస్తుందనీ ఏనాడూ ఊహించ లేదు ప్రసాద్.

కానీ అతనికి బాగా నమ్మకం ఏదో రోజు సుజాత తిరిగి వస్తుంది. తన జీవితంలోనూ, గూడెం వాళ్ళ జీవితా ల్లోనూ వెలుగులు నింపు తుందని మనస్ఫూర్తిగా నమ్మాడు.

★ ★ ★

సుజాత ఏంటో పూర్తిగా అర్ధమయింది రవి కిర ణ్‌కి. అంతా విన్నాక భారంగా నిశ్వసించాడు. మరింత గౌరవం పెరిగింది ఆమెమీద.

ఇన్ని అనుమానాలూ, అవహేళనలూ, కన్నీళ్లతో పెరిగిన సుజాత చదువుకోవడం వల్లనైతే గానీ, లోకాన్ని పరిశీలించడం వల్ల నైతే గానీ పై కష్టాలన్నింటినీ తన నిర్మాణా త్మక ఎదుగుదలకి మెట్లుగా మార్చుకుంది.

ఆమె తాత్కాలికంగా సుదర్శనం గురించి ఆవేశపడి ఉండొచ్చు అందులో న్యాయమూ ఉంది. కానీ ఆమె ఎవర్నైతే ద్వేషిస్తుందో అతనికి తను తమ్ముడు కావడం యాధృ

 చ్ఛికం. ఈ సంగతి సుజాత అర్థం చేసుకో గలదన్న నమ్మకం తనకుంది.

ప్రసాద్ దగ్గర సెలవు తీసుకుని ఇంటికి వచ్చాడు రవికిరణ్. అప్పటికి ఇంకా సుద ర్శనం ఇంటికి రాలేదు. సుదర్శనం భార్య తలుపు తీసింది.

మరిదిని చూసి పక్కకి తొలిగింది. ఆమె వంక జాలిగా చూసి తనకు ఎలాట్ చేసిన గదిలోకి వెళ్లి పడుకున్నాడు.

రాత్రి నిద్ర లేకపోవడం మూలంగా తెల్ల వారిన తర్వాత కూడా కళ్లు విడివడటం లేదు. తల్లి వచ్చి లేపుతుంటే బద్ధకంగానే లేచాడు.

ప్రేమ జాలువారుతున్న కళ్లతో తల్లి తన వంక చూస్తూ కన్పించే సరికి అర్థమైంది మనసు. చిన్నతనం నుంచీ తనే ప్రేమని కోల్పోయాడో అర్థమైంది. గబుక్కున లేచి కూర్చున్నాడు.

"ఈ రోజు తలంటు స్నానం చెయ్యి బాబూ! మంగలి వచ్చాడు" అంది తల్లి.

"మంగలి ఎందుకమ్మా? మన కాళ్లూ చేతులూ బావున్నపుడు మన పని మనమే చేసుకోవాలి" అంటుంటే చోద్యంగా చూసింది.

నూతి గట్టు దగ్గర ఉన్న చపటా దగ్గర పీట వేసి "పోనీ నేను తలంటనా? " ఆశగా అడిగింది.

తల్లి మనసు అర్థమైంది. తలూపాడు వంటికీ తలకీ నూనె రాస్తూ, "పెళ్ళి అవ్వ లేదు కదరా!" అడిగింది.

"ఊహూ!" చెప్పాడు.

"పెళ్లికూతురు మాత్రం రడీగా ఉందిలే." నోట్లో వేప పుల్ల పెట్టుకుని నములుతూ అక్కడికి వచ్చిన సుదర్శనం అన్నాడు. రవి కిరణ్ మాట్లాడలేదు.

"ఎవర్రా అది? " తల్లి ఆశ్చర్యంగా అడి గింది.

"ఆ ఏసుపాదం గాడి కూతురు... నాతో గుడ్డలూడదీయించుకుందే ఆ పిల్ల" హేళ నగా అన్నాడు.

సుదర్శనం భార్య మరిది మొహం చూడ లేనట్లు వడి వడిగా లోపలికి వెళ్ళిపో యింది.

తల్లి మొహం నల్లబడింది. రవి కిరణ్‌కి రక్తం సలసలు మరిగింది. కానీ అలాగే కూర్చున్నాడు.

"వాణ్ణి తొందరగా తీసుకురా! మన పాత పశువుల కొట్టం ఖాళీగా ఉంది... బాగు చేయిస్తాలే! రేయ్ రవీ! నిన్నూ అందులో ఉండమంటానని భయపడకు. ఈ ఇంట్లో నీకూ అధికారముంది. మంచి పిల్లని పెళ్లి చేసుకుని ఈ ఇంట్లో ఉండు. నీ మగతనా నికి చిహ్నంగా అది పాకలో ఉంటుంది" చెప్పాడు.

రక్త సంబంధాన్ని కూడా మించి అసహ్యం కలిగింది. "అన్నయ్యా! తన విషయం వదిలేయి. సుజాత నాకు బాగా కావలసిన మనిషి అని చెప్పాను. అదీ కాక ఒక మనిషిని ఇలా అవమానకరంగా మాట్లాడటం మంచి పద్ధతి కాదు. గతంలో ఏం జరిగిందో అనవసరం. ఇక ముందు మనం సుజాత గురించి చెడ్డగా మాట్లాడు కోక పోవడం మంచిది" రవికిరణ్ ఖచ్చి తంగా అన్నాడు.

తమ్ముడి మాటలకి దిమ్మ తిరిగి పోయాడు సుదర్శనం. మొహం నల్లబ డింది. క్షణాల్లో తేరుకున్నాడు.

"ఎలా మర్చిపోవాలిరా? అది ఊరికి ఎంత నష్టం చేసిందో నీకేం తెలుసు? " కోపంగా అన్నాడు.

"నాకన్నీ తెలుసు. మనం ఆ అమ్మాయికి ఎంత నష్టం చేశామో కూడా తెలుసు. ఊరంతా శాంతిగా ఉండాలంటే మనం కేవలం మన పని చేసుకుంటూ వెళితే చాలు" అనగానే రెచ్చిపోయాడు సుదర్శనం.

"ఏరోయ్! నీతి పన్నాలు వల్లిస్తున్నావు? ఇన్నాళ్లూ ఏమైపోయాయివి? " హేళనగా

అన్నాడు.

నవ్వాడు రవి కిరణ్. "నేను గూడెం వాళ్ల లాగా నీ మాటలకి చేష్టలకి బెదిరిపోయే వాడిని కాదన్నయ్యా! నాకు హక్కున్న చోటికి వచ్చాను. నా వెనుక నిజాయితీతో కూడిన వ్యవస్థ ఉంది. నువ్వు సుజాతని కిడ్నాప్ చేసిన విషయం కాకినాడలో ఉన్న నాకు తెలిసి నేను వచ్చి తనని విడిపించుకున్నానంటే నా శక్తి నీకు తెలిసి ఉండాలి. అందుకే నా జోలికి రావద్దు. అన్యాయాలకి నేను వ్యతిరేకం" ఖచ్చితంగా చెప్పాడు.

తల్లి ఇద్దరి వంకా ఆందోళనగా చూడసాగింది. "ఎపుడో చిన్నప్పుడు పారిపోయి ఇపుడు నా తమ్ముడినంటూ వచ్చావు. ఏంటి నమ్మకం? " కోపంగా అన్నాడు.

"నీకా సందేహం ఉంటే అమ్మనడుగు చెపుతుంది. లేకపోతే శాస్త్ర విజ్ఞానమే. డి.ఎన్.ఏ. టెస్టే నీ సందేహాన్ని తీరుస్తుంది. నీ పరువు నువ్వే బజారున పడేయదల్చుకుంటే నీ ఇష్టం" అన్నాడు రవికిరణ్.

నీళ్ల బకెట్ ని ఓ తన్ను తన్ని గొణుక్కుంటూ అక్కడ నుంచి వెళ్లిపోయాడు సుదర్శనం.

తాపీగా స్నానం చేసి టిఫిన్ చేసి గూడెం వైపు బయల్దేరాడు రవికిరణ్.

అప్పటికే అతను సుదర్శనం తమ్ముడని తెలిసేసరికి రోడ్డు మీద జనాలు అతన్ని చూడటం కోసం ఆ వంకా, ఈ వంకతో రోడ్డుమీదికి వస్తున్నారు.

చాలామందికి పెద్దవాళ్లు అతన్ని ఆపి అతని తాతగారిని తల్చుకుంటూ 'తాతపోలిక' అంటూ మెటికలు విరిచి మరీ హర్షాన్ని ప్రకటిస్తున్నారు.

అతను గూడెం వైపు వెళ్లడం చూసి ఒకళ్లిద్దరు అతన్ని ఆపి వెళ్ళొద్దని చెప్పారు. కానీ పట్టించుకోకుండా సాగిపోయాడు రవి కిరణ్.

సుజాత వాళ్లిల్లు రాత్రి చీకట్లో చూసినా గుర్తుంది. సరాసరి వెళ్లి తడిక తీసుకొని లోపలికి వెళ్లాడు. మరియమ్మ తొంగి చూసి అగ్గగ్గలాడుతూ వచ్చి నులకమంచం వాల్చింది.. ఆమెని హైరానా పడొద్దని వారించి కూర్చున్నాడు.

కాసేపటికి బైటికి వచ్చింది సుజాత. ఎంత వద్దనుకున్నా ఆత్రంతో ఆమె వంక చూడకుండా ఉండలేకపోయాడు.

రాత్రి అనుభవించిన సంఘర్షణకేమో మొహం, కళ్లు ఉబ్బి కన్పిస్తున్నాయి. కానీ మొహంలో స్వచ్ఛత ఏదో కన్పిస్తోంది. తన దగ్గరికి రాగానే పలకరింపుగా నవ్వాడు. తనూ చిరునవ్వుతో వచ్చి ఎదురుగా ఉన్న స్టూలు మీద కూర్చుంది. అది చూసి అతని మనసు తేలికయింది.

సంభాషణ ఎలా మొదలు పెట్టాలో ఇద్దరికీ అర్థం కాలేదు.

"టిఫిన్ చేశావా" అడిగాడు. తలూపింది సుజాత. "నేను కొన్నాళ్లు ఈ ఊళ్లోనే ఉండబోతున్నాను" సంభాషణకి నాందిగా అన్నాడు.

"ఎక్కడ ఉంటున్నారు? " అడిగింది.

"ఏం? ఆశ్చర్యంగా అడిగాడు.

"మీరు ఉండబోయే స్థలాన్ని బట్టి మన అనుబంధం రూపుమారుతుంది" చెప్పింది సుజాత.

నిట్టూర్చాడు రవికిరణ్. "అక్కడ నా కన్న తల్లి ఉంది" ఆవేదనగా అన్నాడు.

"అక్కడ నా ఆగర్భ శత్రువు ఉన్నాడు" సుజాత అంది. కాసేపు ఆలోచించసాగాడు రవికిరణ్.

"సుజాతా! నేనెవరితో మాట్లాడుతున్నానూ ఎక్కడ వుంటున్నానన్నది ముఖ్యం కాదు. నీతో నేనెలా వుంటునానన్నదే ముఖ్యం"

"ఊహూ! నేను ఆ సుదర్శనం అన్యాయాలకి వ్యతిరేకంగా శాంతియుతంగా ఉద్యమం నడుపుతున్నపుడు ఆ యింట్లోంచి వచ్చి నువ్వు సహాయం చెయ్యడాన్ని ఎవరూ నమ్మరు. ఒక ఉద్యమం ముందుకి సాగా

లంటే ఐక్యత ముఖ్యం. అది సాధించాలంటే ఉద్యమాల్ని నడిపేవాళ్లు మరింత పారదర్శకంగా ఉండాలి కదా!"

"నిజమే' అక్కడవుండే హక్కు. ఓ ఆత్మీయతా బంధం నాకున్నాయి కనుక వుంటానన్నాను. అదీ శాశ్వతంగా కాదు కనుక ఈ నిర్ణయం తీసుకున్నాను" తలెత్తి ఓసారి అతని వంక చూసి తలదించుకుంది. శాశ్వతంగా కాదన్న మాట మనసుని కలుక్కుమనిపించింది. "పోనీ నన్నేం చెయ్యమంటావో చెప్పు" అడిగాడు. "మనం తరచుగా కలుసుకోడానికైనా నేను నీ సహాయం స్వీకరించడానికైనా ముందు మరి గూడెం వాళ్లు నిన్ను విశ్వసించాలి. ప్రసాద్ వాళ్లతో మాట్లాడి ఏ విషయం నీకు చెపుతాను" అని ఓ క్షణం ఆగి "నీకు నా మాటలు అవమానిస్తున్నట్లు వున్నాయా? " అడిగింది.

"ఊహూ! వ్యక్తిగత యిష్టాయిష్టాల కన్నా నలుగురి మంచికోసం పాటుపడుతున్న నిన్ను చూస్తుంటే గర్వంగా ఉంది" అన్నాడు.

కాసేపు నిశ్శబ్దం.

"నువ్వు మరి కొంచెం జాగ్రత్తగా ఉండాలి. ఎవరూ నీ మీద చెయ్యి వెయ్యలేనంత ఎత్తుకి ఎదగాలి. అసలు ఈ విషయం మాట్లాడదామనే వచ్చాను" అంటుండగా ప్రసాద్, సురేఖ, మోహన్, ప్రకాశం, పండుబాబు అంతా రావడం కన్పించింది.

వాళ్ల వంక చూస్తూ ఉండిపోయాడు. రవికిరణ్‌ని చూడగానే ప్రసాద్ మొహం వికసించింది. అందరినీ పేరుపేరునా పరిచయం చేశాడు. అంతా అతన్ని ఓ అద్భుతాన్ని చూసినట్లు చూశారు.

సుజాతని ఇన్నేళ్లు ఆదుకుని ఓ మనిషిగా అతను తీర్చిదిద్దాడని తెలిశాక అతని మీద మరింత గౌరవం పెరిగింది. అంతా అతనేం చెపుతాడా అని ఎదురు చూడసాగారు.

"ఇప్పుడు మీ ముంగిట ఓ మహత్తర అవకాశం ఉందని చెప్పడానికే వచ్చాను" అన్నాడు. అందరూ మొహాలు చూసుకున్నారు.

"ఇంకొన్నాళ్లలో పంచాయితీ ఎన్నికలు రాబోతున్నాయి. నాకు తెలిసిన వాళ్ల ద్వారా కనుక్కున్నాను. మన గ్రామంలో రిజర్వుడు శాఖలో ఆడవాళ్ల కోటా కింద సీటు శాంక్షనయింది. మీ గూడెంలో ఏస్త్రీ అయినా ఎన్నికల్లో నిలబడటానికి అర్హురాలే!" చెప్పాడు.

అందరూ గుసగుసలు పోయారు.. చివరికి సుజాత వంక సాభిప్రాయంగా చూశారు. తలూపింది సుజాత. ప్రసాద్, రవికిరణ్ చాలా ఆనందపడ్డారు. రాజకీయాలంటే ఆసక్తి లేదనీ, తను నిలబడనని అంటుందేమోనని భయపడ్డారు. కానీ సుజాత అంగీకరించింది.

"రాజకీయాధికారం ద్వారా ప్రజలకు సమభావనతో చూసే మనస్తత్వాన్ని మరింత మెరుగు పరుచుకోవచ్చనిపిస్తోంది. అంతే కాదు. ప్రజలకి మరింత బాగా సేవ చెయ్యొచ్చు. మనం మొదలు పెట్టిన ప్రతి పనిలో అడ్డుపుల్లలు వేసేవారు తగ్గుతారు. ప్రభుత్వం మంజూరు చేసే సొమ్ముని నిజాయితీ కలిగిన నాయకులు సమర్థవంతంగా వినియోగిస్తారు. అందుకే నేను ఈ ఎన్నికలలో నిలబడాలనుకుంటున్నాను" నిశ్చయంగా అంది.

అక్కడున్న అందరూ అరుపులూ కేకలతో హర్షాన్ని ప్రకటించారు.

"ముందే తెలిసిపోతుంది కాబట్టి మనూరి రైతులు వెళ్లి రిజర్వేషన్లు తారుమారు చేస్తేనో? " అనుమానంగా వ్యక్తపరిచాడు ప్రసాద్.

"అలా జరిగే ఆస్కారం లేదు. ఒక వేళ

---

***ఒక శాతం ప్రేరణను తొంభై తొమ్మిది శాతం శ్రమను ప్రతిభ అంటారు.***

***– రోస్‌పాల్***



జరిగినా ఎన్నికల్లో పోరాడి గెలుద్దాం. మనమంతా ఐకమత్యంగా ఉంటే సాధించలేనిది ఏదీ లేదు" రవికిరణ్ అన్నాడు.

ఆ తర్వాత అందరూ ఎన్నికల గురించి ఊరి రైతులు వేయబోయే ఎత్తుల గురించీ చర్చించుకుంటూ ఉండిపోయారు.

★ ★ ★

సుదర్శనం తమ ఊరి సర్పంచ్ ఎలక్షన్ రిజర్వేషన్‌ని జనరల్ కేటగిరీకి మార్పించడానికి తనకి తోచిన ప్రయత్నాలన్నీ శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. ఆల్రెడీ ఆ ఫైల్స్ అన్నీ సి. యమ్. పేషీకి వెళ్ళిపోయాయని అవి మార్చే ఛాన్స్ లేదనీ తెలిసింది.

హతాశుడయ్యాడు. తను పోటీచేసే ఛాన్స్‌లేనపుడు ఇక ఆ సుజాతనే నిలబెడతారు. గూడెం ఓట్లన్నీ ఆమెకే పడతాయి. అదికాదు ముఖ్యం. ఆమెకి పోటీగా ఆ రిజర్వేషన్‌కి చెందిన స్త్రీయే నిలబడాలి.

అదెలా సాధ్యం? చాలాసేపు ఆలోచించిన మీదట అంతా కలిసి సమావేశం అయి నిర్ణయం తీసుకోవాలనుకున్నాడు.

ఆ రోజు సాయంత్రం సుదర్శనం ఇంట్లో కాకుండా భూషణం ఇంట్లో సమావేశమయ్యారు. ఎంతోసేపు చర్చలు జరిపిన మీదట ఏం చెయ్యాలో ఒక అవగాహనకి వచ్చారు. అప్పటికప్పుడు మనిషిని గూడేనికి పంపి తమకి కావలసిన వాళ్ళని పిలిపించుకుని మాట్లాడుకున్నారు.

★ ★ ★

తన గదిలో పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్న రవికిరణ్‌కి హఠాత్తుగా స్ఫురించిందో విషయం. ఒక్క ఉదుటున లేచి షర్ట్ వేసుకుని సుజాత యింటివైపు వెళ్ళాడు. వెళ్ళేసరికి ఆమె ఇంటి దగ్గరలేదు. రైస్‌మిల్ దగ్గర వుంది. ధాన్యం అమ్మడానికి వచ్చిన వాళ్ళతో ఏదో మాట్లాడుతోంది.

అతన్ని చూసి వాళ్ళతో మాటలు

ముగించి వచ్చింది. వచ్చేసరికి బయట చెట్టుదగ్గర నిలబడి ఉన్నాడు.

"నీ డేటాఫ్‌బర్త్ సర్టిఫికెట్ ప్రకారం నీకు పాతికేళ్ళు నిండి ఉండాలి. ఎలక్షన్స్‌లో పోటీచేయాలంటే సర్టిఫికెట్‌లో డేట్ ఎంత వుందో చూసుకున్నావా? " ఆత్రంగా అడిగాడు.

ఆమె కూడా ఆ విషయం ఇంతవరకూ ఆలోచించలేదు. దాన్లో వున్న డేట్ కూడా గుర్తు లేదు. ఇద్దరూ హడావుడిగా ఇంటికి వచ్చారు.

సర్టిఫికెట్ డేట్ ప్రకారం ఆమెకి ఇంకా నెలన్నర గడిస్తే తప్ప ఇరవై అయిదేళ్ళూ పూర్తికావు. అదిచూసి ఊపిరి పీల్చుకున్నారిద్దరూ.

నామినేషన్స్ వేయడానికే రెండు నెలల వరకూ టైముంది. దానికితోడు ఎన్నికలు కూడా పోస్ట్‌పోన్ అవ్వొచ్చునని అనుకుంటున్నారు.

సర్టిఫికెట్స్ లోపల పెట్టి బయటకి వస్తూ ఏదో ఆలోచిస్తున్నట్లుగా కూర్చున్న రవికిరణ్‌ని చూసి "కంగారుపడ్డావా? " అడిగింది.

"ఊ! అదేగానీ జరిగితే యింకో అయిదేళ్ళు ఎదురుచూడాలి. అప్పటికి ఇంత సులువుగా విజయం సాధించే అవకాశం వుంటుందో వుండదో అనే ఆలోచిస్తున్నాను" అన్నాడు.

అతని వంక అలాగే చూస్తుండిపోయింది. ఈ మధ్య అతనికీ తనకీ మధ్య ఏదో అడ్డుగోడ ఏర్పడినట్లుగా వుంది. ఆ గోడ తను కట్టిందేనని తెలుసు. సుదర్శనం తనకి చేసిన పరాభవానికి మొదటిసారి గుణపాఠం చెప్పింది. కానీ ఈ సారి మరింత అనాగరికంగా ఏదో మధ్యయుగాల్లో ఉన్నట్లు తనని ఎత్తుకుపోయి మానభంగం చెయ్యబోయాడు. దీనికి ప్రతీకారం తీర్చుకోమని హృదయం పోరుపెడుతున్నా బుద్ధి వివేకాన్ని ఆశ్రయిస్తోంది. అతనిమీద తన గెలుపు స్వచ్ఛంగా తనలాంటివాళ్ళకి మార్గదర్శకంగా వుండాలని కోరుకుంటోంది." అందుకే నైతికంగా విజయం పొందాలని ఎదురుచూస్తోంది.

కానీ ఎంతకాదనుకున్నా రవికిరణ్‌ని చూస్తే మనసులో ఏదో ఇబ్బందికరమైన పరిస్థితి. అతను సుదర్శనానికి తమ్ముడు. 'నా రక్తమే నీలోనూ ప్రవహిస్తోందని తన తమ్ముడిని ఉద్దేశించి సుదర్శనం అన్నమాటలు మాటిమాటికీ సూదుల్లా పొడుస్తున్నాయి.

స్ఫటికంలాంటి స్వచ్ఛమైన తమ అనుబంధం మీద మాటలతో దాడిచేసి మలినం చేసిన సుదర్శనం అంటే అణువణువునా వ్యతిరేకమే!

తన భావాల్ని కంట్రోల్లో ఉంచుకోడానికి ప్రతిరోజూ యోగా చేస్తూనే వుంది. కానీ ఖాళీ దొరికినపుడల్లా ఊహలు చుట్టుముడుతూనే వున్నాయి.

"ఏంటలా చూస్తున్నావు? " అడిగాడు.

"అపుడపుడూ మనసులో ఓ మూల వెల్తిగానే ఉంటోంది." ఏంటో తెలియదన్నట్లు చెప్పింది.

"నీకు నువ్వు విశ్లేషించుకోలేదా? " అడిగాడు.

"ఊహు."

"ఏం? ."

"భయం." తలదించుకుని చెప్పింది.

పకపకా నవ్వుతూ "సుజాతకి భయమా? " అన్నాడు చిరుకోపంగా చూసి "నేనూ మనిషినే!" అంది. అతను కాసేపాగి "నీ మనసునీ, అందులో ఎవరికీ తెలియని విషయాల్లో నువ్వనుభవిస్తున్న నీ వ్యక్తిగత సంఘర్షణనీ నేను గమనించాను. ఈ ఎలక్షన్స్ అవనీ. పరిష్కారం దానంతట అదే దొరుకుతుంది" విషాదంగా అన్నాడు. అర్థం

> ***మనం కోరేది మనకు దొరకదు. కాబట్టి మనకు దొరికిన దానినే ఇష్టపడదాం.***
> **– హెన్రీ డేవిడ్ థొరియో**

కానట్లు చూసింది సుజాత.

★ ★ ★

"సుజీ! ఈ మధ్య మన ప్రకాశంగాడి పిన్నమ్మ మీద నాకెందుకో డౌట్‌గా వుంది." అన్నాడు ప్రసాద్.

"ఏ విషయంలో? "

"ఎలక్షన్స్ గురించే!." సాలోచనగా అన్నాడు.

"ఆవిడేం చేస్తుంది? ." ఆశ్చర్యంగా అంది.

"ఈ మధ్య వాళ్ళింట్లో చాలా మార్పులు వచ్చాయి. వూళ్లో ఎకరం పొలం కొనాలని అనుకుంటున్నారంట. దాంతోపాటు ఈ మధ్య యింట్లో కొత్త వస్తువులు కూడా వచ్చాయంట. మొగుడూ పెళ్ళాలిద్దరూ కూలికి వెళ్ళే వాళ్లే! వాళ్ళకింత డబ్బు ఎలా వచ్చి వుంటుంది? "

నిజమేనన్నట్లుగా చూసింది సుజాత.

"మనం నామినేషన్స్ వేసే తేదీ దగ్గర పడింది. నువ్వు ఏకగ్రీవంగా ఎన్నికవ్వాలని మేమంతా కృషి చేస్తున్నాం. మధ్యలో తేడా జరిగితే మళ్ళీ ఎన్నికలు జరగడం. అంతా గందరగోళం అవుతుంది." అన్నాడు.

"ఓసారి మనం వెళ్ళి మాట్లాడితే? " సుజాత అంది. "మంచి ఆలోచనే. ఆలస్యం ఎందుకు? పద" అన్నాడు ఇద్దరూ కలిసి వెళ్లారు.

వెళ్లేసరికి చీరల మూటతనితో బేరాలు చేస్తోంది ప్రకాశం పిన్నమ్మ. వీళ్ళని చూసి తత్తరపడుతూ లేచింది. "ఆ! పిల్ల పెద్దమ డిసి కూడా అయ్యిందిగా పెళ్ళి జేద్దామని బట్టలతను వొత్తే" అంటూ పొంతన లేకుండా మాట్లాడి ఆ మూటతనిని 'ఆనక' రమ్మని చెప్పి పంపేసింది.

"బాబాయ్ లేడా? " ప్రసాద్ అడిగాడు. "ఆ! టౌన్‌కి బోయాడు రాత్రేళకి వొత్తాడు" చెప్పింది. సుజాత డైరక్ట్‌గా విషయంలోకి వచ్చింది.

"నీకు తెలుసుగా అత్తా! నేను ఎలక్షన్స్‌లో నిలబడ్డానని. మన గూడెంలో అంతా సపోర్ట్ చేస్తున్నారు. నువ్వు కూడా సహాయం చెయ్యాలి మరి" చెప్పింది.

"ఆ! ఆ! ఎందుకుజెయ్యను? జేత్తాను" అంటూ పక్క చూపులు చూడసాగింది.

ప్రసాద్‌కీ, సుజాతకీ డౌట్ బలపడింది. అందుకే యింతకు ముందు సర్పంచులు ఊరిని ఎలా భ్రష్టు పట్టించారో ఇప్పుడు తను అధికారంలో లేకపోయినా ఊరి కోసం ఎన్ని సదుపాయాలను అమలులోకి తెచ్చిందో, అధికారంలోకి వస్తే ఏం చేస్తుందో అన్నీ విడమర్చి చెప్పింది.

అన్నింటికీ తలూపుతూ కూర్చుందామె.

"ఓ కన్నేసి ఉంచాలి." బయటకి వస్తూ అన్నాడు.

"అంతే కాదు. అణిచిపెట్టబడిన వాళ్ళ ఐక్యతని నిరూపించాల్సిన సమయం యిది. నిజంగా ఈమెకి ఎన్నికలలో గెలిచి ప్రజలకి సేవ చేయగల హృదయం వుంటే నేను తప్పుకోడానికి అభ్యంతరం ఏమీ లేదు" అంది సుజాత.

"అదేంటి సుజీ! నువ్వా అట్టా మాట్టాడ తావూ!! మన గూడెంలో అంతా ఒక్క తాటి మీద ఉన్నారు. నిన్ను కాదని ఎవళ్ళనీ ఊహించడానికి వాళ్లు సిద్ధంగా లేరు. ఏదో ఇన్నాళ్ళకి మనకి మంచి రోజులొచ్చాయని అంతా సంతోషపడుతున్నారు. నువ్వు పిన్ని విషయం మనసులో పెట్టుకోకు. నేను రవి బాబుతో మాట్లాడతాను. ఆయన సలహా ఏంటో చూద్దాం' అన్నాడు.

ఎన్నికల ప్రకటన వెలువడింది... రిజర్వుడు కేటగిరీ కావడంతో ఊళ్లో ఏ సందడీ లేదు. గత పదేళ్లుగా యిష్టారాజ్యంగా పరిపాలిస్తున్న ఈ సర్పంచ్ పదవిని వదులుకోవాలంటే సుదర్శనానికి చాలా బాధగా వుంది. కానీ తప్పదు.

తప్పుకునే ముందు 'ముసలం' పుట్టించి మరీ తప్పుకోవాలని శతధా ప్రయత్నిస్తున్నాడు.

నామినేషన్లు వేయడానికి ఉపసంహరిం చుకోడానికి గడువు నిర్ణయమయింది.

అందరికీ వీలయిన ఓ రోజు చూసి సుజాత గూడెం వాళ్ళతోనూ, రవికిరణ్ తోనూ కలిసి వెళ్లి నామినేషన్ వేసి వచ్చింది. 'మీది యునానిమస్‌గానే అవు తుందమ్మా!' అని అక్కడి అధికారులు యధాలాపంగా అన్నారు.

అయినా తిరిగి వచ్చాక అనుమానాస్ప దంగా కన్పించిన ఒకరిద్దరి మీద తీవ్రమ యిన నిఘా ఏర్పాటు చేశారు.

ఆ రోజు నామినేషన్లు వేయడానికి చివరి రోజు. ప్రకాశం పిన్ని కదలికల్ని ఎప్పటిక ప్పుడు కనిపెడుతున్న వాళ్ళకి ఆ రోజు మరింత సందేహం పెరిగింది.

సుదర్శనం పొరుగూరి నుంచి తెచ్చుకున్న జీతగాళ్లు నలుగురు ప్రకాశం పిన్నిని పిల్చారు. ఆమె కూడా బైటకి వెళ్లడానిక న్నట్లు ఉతికిన చీర కట్టుకుని ఉంది.

చుట్టూ కనిపెడుతున్న వాళ్ళకి సందేహం వచ్చి వెంటనే ప్రసాద్‌కీ, సుజాతకీ కబురు చేశారు. ఆఘమేఘాల మీద వచ్చాడు ప్రసాద్.

గూడెం వాళ్ళందరూ ఆమెని, ఆమె భర్తనీ చుట్టుముట్టారు.. "తప్పుకోండి" బింకంగా అన్నాడతను.

"నువ్వు నీ పెళ్ళాంతో సుజాత మీద పోటీగా నామినేషన్ ఏయించుతున్నావా?" ప్రకాశం కోపంగా అన్నాడు.

"అది నా ఇట్టం నీకెందుకు మద్దెన?" కోపంగా అన్నాడు. "నీకు తెలవదు బాబాయ్ పిన్నిని అడ్డం పెట్టుకుని సర్పంచ్ పదవి కాజేసి మళ్ళీ మన జీవితాల్ని నాశనం చేత్తాడు. ఆడు నీకు లక్షో రెండు లక్షలో పడేసి పిన్నిని నిల్బోబెట్టడానికి ఒప్పించి వుండొచ్చు. దాని మూలంగా మన గూడెం వాళ్ళంతా అలో లక్ష్మణా అని ఏడుస్తూ ఉంటే నీకు సంతోషమా? అదే మన సుజాత సర్పంచి అయితే మనందరి జీవితాలూ బాగుపడతాయి. అందరం కలిసి సంతోషంగా ఉండటం ఇష్టమా? మీ కుటుంబమే ఆనందంగా ఉండాలా?" ప్రసాద్ అడుగుతుంటే వాళ్లు మొహాలు దించుకున్నారు.

సుజాత వాళ్లదగ్గరికి వచ్చింది "అత్తా! నువ్వు నిలబడతానంటే నేను తప్పుకుంటా. కానీ మన గూడెం వాళ్లంతా ఒకమాట మీద వుండాలి. ఎవరిపట్లా పక్షపాతం లేకుండా వ్యవహరించాలి. నువ్వు ఎవరి చేతిలోనో కీలుబొమ్మవు. మన గూడెం వాళ్లందరి జీవితాలూ తాకట్టు పెడతానంటే ఎవరూ ఒప్పుకోరు" అంది.

"అవును మేం ఒప్పుకోం. సుజాతమ్మే నిల బడాలి. అందుకు వ్యతిరేకంగా జరిగితే గూడెంలో మీరొక్కరే అవుతారు. నిర్ణయిం చుకోండి" గట్టిగా చెప్పారు పెద్దవాళ్లు.

వేరుమాట లేకుండా అంతమందీ ఒక్క మాటమీద నిలబడటం చూసి వాళ్లలో పల్ల వించిన ఐక్యతారాగానికి ముగ్ధుడయ్యాడు రవికిరణ్. చలించి పోయింది సుజాత.

చివరికి ప్రకాశం వాళ్ల పిన్నికి ఒప్పుకోక తప్పలేదు. తన మొగుడు సుదర్శనం మాటకు దాసుడయి తీసుకున్న రెండు లక్షల గురించే చెప్పి ఖర్చయిన పదివేలు పోగా అటకమీద దాచిపెట్టిన ఒక లక్షా తొంభైవేలు తెచ్చిచ్చింది. ఆ పదివేలూ సుజాత కలిపింది. ప్రసాద్ ద్వారా తిప్పి పంపారు.

కక్కలేకా మింగలేకా ఊరుకున్నాడు సుద ర్శనం. ఆరోజు సాయంత్రం అయిదింటి వరకూ నానా రకాలుగా ప్రయత్నించాడు. టౌన్ నుంచి గూండాలనూ పంపాడు.

కానీ గూడెం వాళ్లంతా కర్రలూ కొడవళ్లూ పట్టుకుని గూడాన్ని అష్టదిగ్బంధనం చేశారు. సుజాతకి వాలంటరీగా సెక్యూరి టీని ఏర్పాటు చేసుకున్నారు.

అయిదు దాటాక అంతా స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నారు. ఆ తర్వాత రెండు రోజులకి

ఎలక్షన్ కమిషన్ యునానిమస్‌గా గెలుపొందిన గ్రామాల పేర్లు ప్రకటించింది. ఆ లిస్ట్‌లో సుజాత పేరు, తమ ఊరి పేరు చూసి ఆనందంతో పొంగిపోయారు.

సుజాతని ఊరంతా ఊరేగించారు. ఊళ్లో చాలామంది ఇంటి తలుపులు మూసుకున్నాయి. కానీ రవికిరణ్ ప్రభావంతో నలుగురైదుగురు కుర్రవాళ్లు, ఓ పదిమంది ఆడవాళ్లూ సుజాతని అభినందించారు. వారినుంచి ఆమాత్రం అభినందనలని కూడా ఆశించని సుజాతకి మార్పు మీద ఆశ కలిగింది.

ఆ రోజు సాయంత్రం బహిరంగంగా జరిగిన మీటింగ్‌లో తను గ్రామాభివృద్ధిమీదే దృష్టిని కేంద్రీకరిస్తానని ఎవరిమీదా కక్షసాధింపు చర్యలు ఉండవనీ ప్రకటించింది.

ఆమె వేదిక మీద ఉపన్యసిస్తుంటే రవికిరణ్ కళ్లు చెమర్చాయి.

★ ★ ★

రాష్ట్ర వ్యాప్తంగా ఎన్నికల హడావిడి సద్దుమణిగింది. సుజాత సుదర్శనం నుంచి ఛార్జి తీసుకుంది. ఆమె ఇప్పుడు పంచాయతీ ఆఫీసులో సుదర్శనం సీట్లో కూర్చుంటోంది. అంతకుముందు వారి దృష్టిలో ఎంత హీనమయిన వాళ్లయినా అధికారంలో ఉంటే చాలు చుట్టూ మూగిపోతారు.

సుజాత విషయంలోనూ అలాగే జరుగుతోంది. ఊళ్లో పెద్దలు మనసులో ఎలా ఉన్నా ఒకరికి తెలీయకుండా మరొకరు మెత్తబడుతున్నారు. సుజాత మాత్రం తను పరిపాలనలో పారదర్శకతని ఖచ్చితంగా అమలుచేస్తోంది.

ఆరోజు ఉదయాన్నే సుజాత తన ఇంటి ముందున్న తోటలో కలుపుతీస్తూ ప్రసాద్‌తో ఏదో మాట్లాడుతుండగా వచ్చాడు రవికిరణ్.

చిరునవ్వుతో ఆహ్వానించింది సుజాత.

అతను లోపలికి రావడంతోనే ఆమెకి ఓ కవర్ అందించాడు. కుతూహలంగా ఓపెన్ చేసి చూసింది. ఆమె మొహం పాలిపోయింది. "ఇది చాలా రిస్క్" అంది. "ఏది కాదు? " ఎదురు ప్రశ్నించాడు.

ప్రసాద్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు...

"అఫ్‌కోర్స్ కానీ మేమందరం చాలా మిస్సవుతాం" అంటూ ప్రసాద్‌కి ఆ కాగితాన్ని అందించింది. పాలస్తీనా, ఇజ్రాయెల్‌ల మధ్య నిరంతరం జరుగుతున్న గొడవల్ని కవర్‌చేయడం కోసం అక్కడే నివాసం ఉండే ఒప్పందంతో వచ్చిన ఉద్యోగ నియామక పత్రం అది. ఏమీ మాట్లాడలేకపోయాడు ప్రసాద్.

"వారం రోజుల్లో వెళ్లిపోవాలి నేను. ఈలోపే నువ్వు ప్రసాద్‌ని పెళ్లిచేసుకుంటే నా కళ్లారా చూస్తాను. లేకపోతే నువ్వు పంపించే ఫొటోల్లోనో కాసెట్‌లోనో చూడటమే? " ఆమె సంఘర్షణని పటాపంచలు చేస్తూ అన్నాడు రవికిరణ్.

ప్రసాద్ మొహం వికసించింది. ముసిముసిగా నవ్వుతూ "మీరు ఊ అనాలేగానీ రేపే పెళ్లి చేసుకుంటాం. బహుశా సుజాత మీ అనుమతి కోసమే ఇంతకాలం ఆగి వుంటుంది. మీరు సెలక్ట్ చేసిన వాళ్లనే చేసుకోవాలని" ప్రసాద్ అన్నాడు.

సుజాత మూగగా చూసింది.

"అయివుండొచ్చు. చిన్నప్పటి నుంచీ తన కష్టసుఖాల్లో భాగస్వామిగా ఉన్న మీరే ఆమెలో నిరంతర చైతన్యాన్ని రగిలించగలరు. మీరే ఆమెకి సరిజోడీ" మనస్ఫూర్తిగా చెప్పాడు. ప్రసాద్ సంతోషంగా చూసి సుజాత చేతిని తన చేతిలోకి తీసుకుని "నా కంఠంలో ప్రాణం ఉన్నంత వరకూ మేమిద్దరం ఊరి క్షేమానికే అంకితం అవుతాం" ఉద్వేగంగా అన్నాడు. అతని మాటలూ, ఆ స్పర్శ ఆమెకి తన లక్ష్యాన్ని గుర్తుచేశాయి. రవికిరణ్ పట్ల తనకున్న మమకారం మనసులోపలి ఓ ప్రత్యేకమయిన అరలో యిముడ్చుకుని ముందుకు సాగాలి నిశ్చయంగా అనుకుంది సుజాత.

✷

# చతురకథలు

## తాగించొద్దు...

"చెప్పరా.... చెప్పు.... బద్మాష్! మాట్లా డవేరా దున్నపోతా...." గతవారం రోజులుగా పోలీసుల ఆ అరుపులు, లాఠీ దెబ్బలు ఆవ్యక్తి నుంచి ఒక్కమాటను కూడా రాబట్టలేక పోయాయి!

ప్రతిపక్షానికి చెందిన ఒక నిజాయితీ



పరుడైన ఎమ్మెల్యే హత్య కేసులో ప్రధాన అనుమానితుడిగా ఆ వ్యక్తిని అరెస్టు చేసారు పోలీసులు. ఈ హత్యతో అధికార పార్టీ మంత్రికి సంబంధం ఉందనీ, అరెస్టయిన ఆవ్యక్తికి మంత్రి అండదండలున్నాయనీ పోలీస్ దర్యాప్తులో వెల్లడైంది.

ఈ కేసులో నిజం నిగ్గు తేల్చడానికి కంకణం కట్టుకున్నాడు నీతికీ, నిజాయితీకీ మారుపేరైన ఎస్పీ సురేంద్ర. అందుకే ఆవ్యక్తిని రహస్యంగా తన కస్టడీలో ఉంచాడు. అయితే ఆవ్యక్తి పోలీసులకి ఎంతమాత్రం సహకరించడంలేదు. పోలీసులు ఎన్ని హింసలు పెట్టినా దున్నపోతు మీద వర్షం పడ్డట్టుగా నోరు మెదపడం లేదు.

ఆవ్యక్తి వయసు ముప్ఫై ఏళ్ళు ఉంటాయి. హాలీవుడ్ హీరో ఆర్నాల్డ్ లాంటి పర్సనాలిటీ.. మాటల్లో 'జగ్గయ్య' గాంభీర్యం... మొహంలో 'అమ్రిష్‌పురి' క్రూరత్వం.. నవ్వులో 'రాజనాల' విలనిజం.. 'టార్జాన్'రూపం.

ఆవ్యక్తి గురించి అదనపు సమాచారం కోసం ఆవ్యక్తిని 'పెంచినతల్లి'ని తన ఆఫీసుకి తీసుకొచ్చాడు ఎస్పీ సురేంద్ర. ఆమె వృద్ధురాలు. ఆమె చేతిలో కొన్ని వందనోట్లు పెట్టాడు ఎస్పీ సురేంద్ర. ఆమె కళ్ళు మిల మిల మెరిశాయి. తర్వాత ఆమెను కొన్ని వివరాలు అడిగాడు. చివరిగా- "ఇంత మొండి వాణ్ణి ఎక్కడా చూళ్ళేదు. అతనికి బాధ, భయాలు తెలీవా? " అన్న సురేంద్ర సూటి ప్రశ్నకు ఆమె సమాధానం విని నమ్మలేకపోయాడు. ఆమె వంక అనుమానంగా

చూశాడు. ఆమె మొహంలో నిజాయితీ స్పష్టంగా కన్పించింది ఎస్పీ సురేంద్రకి. వెంటనే ఆవ్యక్తి ఉంచిన గదిలోకి ఒక 'సీసా'ని తీసుకెళ్ళాడు ఎస్పీ సురేంద్ర. ఆసీసా మూత తెరిచి నిద్రపోతున్న ఆవ్యక్తి ముక్కు దగ్గర పెట్టాడు. సీసాలోంచి వచ్చే ఘాటైన ఆ వాసనకి ఆవ్యక్తి కళ్ళు తెరిచి బెదురుతూ వెనక్కిజరిగి, పిల్లిలా ముడుచుకుపోయాడు.

"వద్దు... వద్దు... తాగించొద్దూ... ఆసీసాని దూరంగా తీసుకుపొండి..." అంటూ వణికిపోతూ గట్టిగా అరవసాగాడు.

"అయితే నిజం చెప్పు" అడిగాడు సురేంద్ర.

"చెబుతాను, చెబుతాను...." కంగారుగా అన్నాడావ్యక్తి.

"నీతో ఎవరు చేయించారు ఈ హత్య? " గద్దిస్తూ అడిగాడు సురేంద్ర.

ఈహత్య మంత్రి తనతో ఏవిధంగా చేయించిందీ, ఏం ఆశించి చేయించిందీ, అలాగే గతంలో మంత్రి అండదండలతో తను ఏఏనేరాలు, హత్యలు చేశాడు లాంటి నమ్మలేని విషయాలు చెప్పాడు ఆవ్యక్తి! అంతేకాక మంత్రి అక్రమ ఆస్తులకి, అవినీతికి సంబంధించిన ఒక కీలక డైరీని ఎస్పీకి అందించాడు. ఆసీసాలో ఉన్నది మాత్రం తాగించొద్దూ... అంటూ సురేంద్ర కాళ్ళు పట్టుకున్నాడు.

ఇంతకీ ఆసీసాలో ఏముందో తెలుసా?

చెప్పనా... చెప్పేస్తున్నా.. అది... ఆముదం!

**- ఆముదాల అజయ్**

---

## నిన్ను నీవు దిద్దుకో

సుధాంశురావు ప్రియాంకకు పరిచయమవడానికి కారణం అతడొక వర్ధమాన రచయిత కావడమే. ఆ తరువాత అతడు దిన దిన ప్రవర్ధమానం కావడానికి కారణం ప్రియాంక లేఖలు రాసి ప్రోత్సహించడమే. కారణం అతడి రచనల నిండా స్త్రీ సమస్యలుండడం! అతని రచనల ధోరణికి ముగ్ధురాలై అలా అలా చేరువై పోయింది ప్రియాంక అతని అభిమానిగా.

అతడిని చూస్తుంటే ఎవర్ికైనా మంచి అభిప్రాయం కలుగుతుంది. పెద్దలంటే ఒదిగి ఉండడం ఆ వినయం, ఆ నవ్వు, అన్నీ మనల్ని ఇష్టపడేలా చేస్తాయి. ప్రియాంకకూ అదే జరిగింది మరి!

★ ★ ★

ప్రియాంక గదిలోకి ప్రవేశించి పుస్తకం చదువుతున్న ఆమె కళ్ళు మూశాడు సుధాంశురావు.

ఆమె ఉలిక్కిపడి "ముందు మన పెళ్లి సంగతి చెప్పండి..." అంది గట్టిగా!

"నిన్న మా ఇంట్లో మాట్లాడేశాను..."

"ఏమన్నారు? " ఆతృతగా, ఆశగా అడిగింది.

"కులమేమిటని అడిగారు. పైగా మన నియోగులేనా అని అడిగింది అమ్మ... అన్నట్లు ప్రియా ఏమనుకోకు నీదే కులం? " బెదురుగా అడిగాడు సుధాంశురావు.

అప్పటికే నిటారుగా అయిన ప్రియాంక తల పట్టుకుంటూ "మాల వాళ్లం" అంది నెమ్మదిగా ఇబ్బందిగా!

"నిజమా! అచ్చు బ్రాహ్మణ పిల్లలానే వుంటావు" నమ్మలేనట్టు అన్నాడు సుధాంశురావు ఆమె వంక నిశితంగా చూస్తూ!

"సరే గానీ నీ నిర్ణయమేమిటి? " ఏ భావం లేకుండా అడిగింది.

"ఆ వయసు పెద్దవాళ్లని ఏమని ఇబ్బంది పెట్టను చెప్పు? "

హతాశురాలైంది ఆమె.

కానీ కనిపించనీయకుండా జాగ్రత్తగా అంది

"ఇంకెందుకు నీ రచనలు అవన్నీ నా ముందు పడేయ్ అగ్గిపుల్ల గీసి అంటించే




పదేపదే అతడి మనసులో ప్రతిధ్వనించసాగాయి.

మరునాడు అతడు వచ్చి చూస్తే ప్రియాంక గది ఖాళీ చేసేసిందని ఎగ్జామ్స్ వచ్చే ఏడు రాస్తుందటని పక్క వాటావాళ్లు చెప్పారు.

అన్యమనస్కంగా పెద్దలు కుదర్చిన పెళ్లి చేసుకున్నాడు సుధాంశురావు.

మామగారు కూడా మంచి సాహితీ వేత్త. పైగా సాహిత్య అవార్డుల కమిటీలో సభ్యుడు కూడా! ఆయన ఆ సంవత్సరం సుధాంశురావు చేత నవల రాయించాడు అవార్డు కోసం. కానీ, ఫలితం లేకపోయింది. మిగిలిన సభ్యులందరూ నవల చదివి హీరోలో నిజాయితీ లోపించిందని మరో నవలకి ఇచ్చారు బహుమతి.

"అవును. నాలోనే నిజాయితీ లేకపోతే, నా రచనలో ఎలా వస్తుందది..." మనసులో అనుకున్నాడు నిరాశగా సుధాంశు రావు.

ఆ రోజే ప్రియాంక నుంచి ఒక లేఖ వచ్చింది.

"రచయిత సుధాంశురావు గారికి నమస్కారములు.

నేను గతంలో మీ రచనల మీద అభిమానంతోనే మీ ఊళ్లో రూమ్ తీసుకుని ఒంటరిగా డిగ్రీ చదువు ప్రారంభించాను. నేను నిజానికి బ్రాహ్మణ పిల్లను. అందునా నియోగులం. మీ రచనలు మీకు తప్ప మిగిలిన లోకానికి వర్తిస్తాయని తెలిసి తట్టుకోలేకపోయాను. ఉంటాను...." అని వుంది అందులో

ఆ తరువాత సుధాంశురావు ఎప్పుడూ కలం ముట్టుకోలేదు.

స్తాను" ఆమె గొంతులో కసి!

అతడు నవ్వి "మరి నా కీర్తినేం చేస్తావు?" విలాసంగా అడిగాడు.

"హూ...కీర్తి! నిజాయతీ లేని ఆ రాతలెందుకు? రాసింది ఆచరించలేని నువ్వెందుకు? అంతా మోసం, దగా! ఆత్మవంచన చేసుకుంటూ ఆ రచనలు చేయకపోతేనేం?"

గుండెలకొచ్చి గుచ్చుకున్నాయి ఆ మాటలు! ఇంక నిలవలేక వెళ్లిపోయాడు.

ఆ మాటలే అతడిని వెంబడించసాగాయి.

– పసుపులేటి సాయిలక్ష్మి

✦

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తమ ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.**

**కూపన్**

జూలై చతుర నవల ***అట్టడుగు స్వరం***

సమీక్షకుని పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

# 'శబ్దం' పై సమీక్షలు

మే 2005 'చతుర'లో ప్రచురితమైన సూరేపల్లి విజయ నవల 'శబ్దం'పై మాకు అందిన ఉత్తమ సమీక్షలు

## నేటి పరిస్థితులకు దర్పణం

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**అ**క్షరం అంటే నశించనిది, చెడనిది అని అర్థం. అక్షరమా! నువ్వు చిరంజీవివి! అంటూ ప్రారంభించిన నవల "శబ్దం" నేటి భారతదేశ సామాజిక పరిస్థితులకు దర్పణం.

చిరంజీవిగా భారత కథలో ప్రసిద్ధుడైన భీష్ముని పేరుతో వున్న అరవైయేండ్ల మేధావి భీష్మాచార్య పాత్ర నవలలో ఎంతో అర్థవంతంగా వుంది. ఊరు అందం గోడలు చెబుతాయి అన్నట్లు నవల ఔన్నత్యాన్ని, ఔచిత్యాన్ని ప్రారంభమే సూచించింది.

భీష్మాచార్య ఒక పత్రికకి ఎడిటరు తరువాత ఎడిటరు అంతటి స్థానం వున్నవాడు. అనుభవజ్ఞుడు, ధీరుడు. అనిమిష భీష్మాచార్య మిత్రుడు శర్మ అనే ధైర్యశాలి కూతురు. తన తండ్రి గూండాల చేతిలో మరణించిన సంగతి భీష్మాచార్యకి చెప్పకుండా భీష్మాచార్య దగ్గర జర్నలిస్టుగా చేరటానికి వచ్చింది.

ప్రారంభంలోనే అనిమిష సాహసాన్ని, దృఢసంకల్పాన్ని భీష్మాచార్య గ్రహించాడు. జర్నలిజం అంటే అక్షరాలతో చేసే యుద్ధం. అక్షరాలే అస్త్రాలు, శస్త్రాలు అని తెలుసుకుంది. తన తండ్రిని, తల్లిని, తమ్ముణ్ణి, చంపిన దుండగుల్ని హతమార్చాలని కంకణం కట్టుకొని భీష్మాచార్య దగ్గర చేరింది. ఆ దుష్టులే భీష్మాచార్య భార్యనీ, కూతురునీ చంపారని తెలుసుకుంది. ఇద్దరి ఆశయం ఒకటే!

"విషాదం నీదరికి వచ్చినపుడు వివేచనని మేల్కొలుపు!""ఆవేశం నీదరికి వచ్చినపుడు ఆలోచనని ఆశ్రయించు!" అన్న తండ్రి మాటల్ని అప్పుడప్పుడు మననం చేసుకుంటుంది అనిమిష! సాహసవంతురాలైన జర్నలిస్టుగా భీష్మాచార్య శిక్షణలో ఎదిగింది అనిమిష! "ప్రాణాలకు తెగించి మేధస్సును మధించి పరిశోధనతో పరిశీలనతోరాస్తే అక్షరాలు పాశుపతాస్త్రాలే" అని గ్రహించింది.

అపరభీష్ముడు భీష్మాచార్య గనిలో రత్నం వంటి అనిమిషని తన శిక్షణతో సానలు దీరిన జాతిరత్నంలా తయారుజేశాడు. వజ్రాయుధంలా దుండగులపై ప్రయోగించాడు.

కండబలాన్ని, గుండెబలాన్ని, కలంవాడిని, మాటలవేడిని, శక్తిని, యుక్తిని, ఉపయోగించి శత్రువుల్ని నిశ్శేషంగా అంతమొందించారు అనిమిష, భీష్మాచార్య. ఆదినుండి అంతం దాకా ఆపకుండా పాఠకులతో చదివించే నవల శబ్దం అపరాధ పరిశోధక నవలలాగా రచన సాగింది. అశ్లీలాలు, అనవసర సన్నివేశకల్పనలు లేని మంచి నవలని అందించిన సూరేపల్లి విజయగారికి అభినందనలు.

– పి. నాగరత్నం, హైదరాబాద్

## సబల

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

నేటి సమాజంలో వేళ్ళూనుకున్న అవినీతి, స్వార్థం, లంచగొండితనం, హింస, ధనవ్యామోహం మానవుడిని దానవుడిగా మారుస్తున్నాయనడంలో ఎలాంటి సందేహం లేదు. "తొండ ముదిరి ఊసరవెల్లిగా మారినట్లు" రౌడీలు, గుండాలు "దాదా"లుగా మాఫియా"డాన్"లుగా మారి కొన్నినగరాలలో సమాంతర ప్రభుత్వాన్ని నడుపుతున్నారు. తమ పదవులకోసం, అధికారం కోసం వీరికి వత్తాసుగా నిలిచిన రాజకీయ నాయకులు వారిని అదుపు చేయలేక పోతున్నారు. వీరి వలన సమాజంలోని ప్రతి ఒక్కరూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో బాధలు అనుభవిస్తూనే

ఉన్నారు. ఈ అవినీతి మహా వృక్షాన్ని కూకటి వేళ్ళతో సహా పెకిలించేందుకు తనను తాను పెనుతుఫానుగా మలచుకున్న అని మిష సమాజంలోని ప్రతి ఒక్కరికి ఆదర్శప్రాయంగా నిలిచిందనడంలో అతిశయోక్తి లేదు.

'కృషి ఉంటే మనుషులెలా ఋషులవుతారో' అదేవిధంగా కసి ఉంటే తను అనుకున్నదాన్ని అందుకుని విజయం సాధిస్తారని అనిమిష పాత్రద్వారా రచయిత్రి కళ్ళకు కట్టినట్లు వివరించారు. సాధారణ వ్యక్తిత్వంతో తండ్రి చాటు బిడ్డగా పెరిగిన అనిమిష తన కుటుంబం అన్యాయంగా అవినీతికి బలికావడాన్ని జీర్ణించుకోలేక దానికి బాధ్యులైన వారి మిద పగ ప్రతీకారాలతో వాళ్ళ అంతు చూసే వరకు విశ్రమించక తను అనుకున్న దాన్ని సాధించడంలో కృతకృత్యురాలయింది. ఆమె ఆశయానికి అన్ని విధాలా సహకరించి, ఆమెను పదునైన ఆయుధంగా మలచడంలో భీష్మాచార్య చూపిన చొరవ, జాన్ డేవిడ్‌ను ఆమెకు రక్షణగా ఉంచి ఆమెను కాపాడడంలోను భీష్మాచార్య పాత్రను మలిచిన తీరు అత్యద్భుతం. మర్రి వృక్షంలా వేళ్ళూనుకున్న దాదామియా చీకటి సామ్రాజ్యాన్ని తన తెలివితోనే పెకిలించి పారేసి అందరి మన్ననలను పొందిన అనిమిష పాత్ర నేటి మహిళ అబలకాదు సబల అని నిరూపించింది.

నవలతో పాటు అందిస్తున్న స్పెషల్ ఫీచర్స్ "కథ వెనుక కథ" మరియు "రచయితలకు ప్రత్యేకం" అనేవి కథారచన మీద ఆసక్తి గల వారికి ఎంతగానో ఉపయోగపడతాయి. " జ్ఞాన తరంగిణి" ప్రతి ఒక్కరూ చదివి తీరవలసిన అంశం. చతుర వారికి అభినందనలు.

– ఎం. సుశీల, కిష్టయ్యబంజరు, ఖమ్మం

## ఇదీ సమాజసేవే

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఝాన్సీలక్ష్మీబాయి, రాణి రుద్రమదేవి మొదలగు వీరవనితలు జన్మించిన ఈ పుణ్యభూమిలో వారిచరిత్రలు, శత్రువులను గడగడలాడించిన వైనం స్త్రీ అబల కాదు సబల అని నిరూపించాయి. కానీ చాలావరకు ప్రస్తుత పరిస్థితులు ఎక్కువ శాతం స్త్రీని అబలగానే బలపరుస్తున్నాయి. ఈ రాకెట్ యుగములో కూడా స్త్రీ ఒంటరిగా రాత్రి పది గంటల సమయములో తోడు లేకుండా బయటికి వెళ్ళదు. వెళ్ళలేదు.

"శబ్దం" నవలలో రచయిత్రి అనిమిష పాత్రని బాగా మలచారు. నేనే 'అనిమిష" నైతె అన్న ఆలోచన నాకు ఊహకందనిది. ఎంతటి భయస్తురాలైనా, అవసరమొస్తే ప్రాణాలను లెక్కచేయని మొండి ధైర్యముతెచ్చుకొంటుంది పిల్లిని బోనులో పెడితే అది పులిగా మారుతుందనేది జగమెరిగిన సత్యం కాని ఎంతమంది స్త్రీలు పులులుగా మారుతున్నారనేది ప్రశ్న.

అనిమిష మారణాయుధాలు ఉపయోగించకుండా, అక్షరాలనే శస్త్రాలుగా ఉపయోగించి శత్రువులను నాశనం చేయడము ఈ నవలకి హైలెట్. దీని ద్వారా జర్నలిజంకున్న పవరు తెలియనివారికి ఈ నవల ద్వారా తెలియచేసింది రచయిత్రి. అట్లాగే "ఎవరైనా సరే ఏ సమస్య వచ్చినా బెదిరిపోకుండా ధైర్యంగా ఎదుర్కొనే మనస్తత్వం అలవరుచుకోవాలని" రచయిత్రి మరో సందేశం.

రచయిత్రి 'శబ్దం' ద్వారా స్త్రీలో వున్న బేలతనం మాపి, సబలత్వము వెలికితీసే ప్రయత్నము ద్వారా స్త్రీ పాఠకుల హృదయాలను కదిలిస్తుందనడంలో సందేహం లేదు. ఇదీ ఒక రకమైన సమాజ సేవే! హేట్సాఫ్ టు సూరేపల్లి విజయ.

– కె.అనురాధా రావు, హైద్రాబాద్

## జీవన సత్యాలు

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

సాహిత్య ప్రయోజనం ఏదైనా, అది ఏ

రసాన్ని పాఠకులకు అందించినా, అది వారి మెప్పును పొంది చదువుతున్నప్పుడు, నీరసానికి గురి కానివ్వనప్పుడే ఆ ప్రక్రియ విజయవంతం అయినట్లుగా భావించవచ్చు. ఈ కోవకు చెందినదే మే నెల చతురలో ప్రచురించిన 'శబ్దం'. సూరేపల్లి విజయ రాసిన ఈ నవల ప్రారంభం నుండి చివరి దాకా ఏకబిగిన చదివించింది. ఆద్యంతం ఆసక్తికరంగా పాఠకులను అలరించింది.

ఏమైనా సాధించాలంటే ఆశయం పట్ల అంకిత భావం, చిత్తశుద్ధి, అలుపెరుగని శ్రమ, నిరంతర కృషి, పట్టుదల కావాలి. అప్పుడే ఆశించిన శిఖరాలకు చేరుకోగలుగుతాము" అనే అంశం చుట్టూ అల్లబడిన ఈ నవల పాఠకులకు ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని అందించింది. ఈ నవలలోని ప్రధాన పాత్ర అనిమిష, భీష్మాచార్య, శర్మ పాత్రలను మలచిన తీరు అద్భుతం. శర్మ ఒక తండ్రిగా తన కుటుంబ సభ్యుల పట్ల చూపిన అనుబంధం సమాజం పట్ల నిర్వర్తించిన బాధ్యత చాలా బాగుంది. ప్రతి వ్యక్తి తనకిలాంటి తండ్రి ఉంటే బాగుండునని ఊహించేలా ఆ పాత్రను మలచారు. పాత్రికేయ వృత్తిని నేపథ్యంగా తీసుకొని కథానాయిక తన పగను ప్రతీకారాన్ని తీర్చుకున్న తీరు అద్భుతం.

సులభంగా అర్థమయ్యే భాష, శైలి, ఆకట్టుకొనే సన్నివేశాలతో సాగిన ఈ నవలలో సందర్భానుసారం ఆణిముత్యాల్లాంటి జీవన సత్యాలను పొందు పరచడం నవలకు నిండుదనాన్ని చేకూర్చింది.

**– ఆసియా సుల్తానా,** మహబూబాబాద్.

# అక్షర తరంగాలు

***(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

మానవత్వం మరచిన గుండాసామ్రాజ్యానికి ఎదురు తిరిగి కలం అస్త్రాలను ధైర్యంతో సంధించిన అనిమిష ఒక గొప్ప విప్లవం లాంటిది. అనిమిష తనకు జరిగిన అన్యాయానికి మానసిక స్థైర్యం కోల్పోకుండా భీష్మాచార్య దగ్గరికి వెళ్లింది. అతనికి జరిగిన అన్యాయానికి చింతిస్తూనే, భీష్మాచార్య హెచ్చరికలతో ప్రతి అడుగు జాగ్రత్తగా వేసింది. జర్నలిజం సమాజాన్ని అద్దంలా చూపించేటట్లుగా ఉండాలని, అక్షరాల ఖడ్గంతో అవినీతిని పారద్రోలి, సమాజానికి అక్షరాస్త్రంతో శస్త్ర చికిత్స చేస్తుందని చెప్పిన తండ్రి ఆశయం నెరవేర్చింది అనిమిష.

భీష్మాచార్య ఒక మహా తపస్వి. అనుక్షణం అనిమిషకు వెన్నంటి కాపాడే జాన్ డేవిడ్ ఒక నీడలాంటి పాత్ర.

అక్రమాలతో చెలగాటమాడే దాదామియా లాంటి దుష్టుడికి, షంషేర్, సలీం లాంటి కిరాతకపు ఏజెంట్లు వేసే ఎత్తులకు పై ఎత్తులు వేసి వారిని మట్టుపెట్టిన అనిమిష పాత్ర శబ్దం నవలకు హైలైట్.

అండర్ వరల్డ్‌లో మాఫియా నేతలు జరిపే అక్రమాలు, మోసాలు, అవినీతి, విధ్వంసాలు, భయోత్పాతాలు చిత్రించి ఈ అక్షర తరంగాలతో సమాజంలో మార్పు రావాలని ఆశించిన రచయిత్రికి ధన్యవాదాలు.

***– జి. సావిత్రి, కావడిమట్టి,*** కర్నాటక. ☆

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

సచిత్ర విచిత్రం

# అవయవాల శిల్పి!



ఆమె ఓ చిత్రమైన శిల్పి. జపాన్‌లో నివసిస్తున్న ముకికోషిమా వివిధ రకాల అవయవాలను అద్భుతంగా రూపకల్పన చేస్తుంది. అవి అసలు అవయవాలవలెనే భ్రాంతి కలిగించి చూపరులను మంత్రముగ్ధుల్ని చేస్తాయి! రంగులు అద్దిన సిలికాన్‌తో ఆమె వాటిని తయారుచేస్తుంది. గ్యాంగ్‌స్టర్లు, దొంగలు ఆమె ఖాతాదార్లు. వారంతా తాము నమ్మిన దేవతల విగ్రహాలకు తమ చిటికెన వేళ్లను నరికి బలిగా ఇస్తారు. అందువలన తమ చోర వృత్తి బాగా సాగుతుందని వారి నమ్మకం.

